శ్రీ

# మేవాడుశౌర్యాగ్ని



ఇత్యాది

కృష్ణలీల, లవకుశ, మిహిరాద్యనేక నాటకగ్రంథకర్తలగు

బళ్లారి, వైయాకరణి, పండిత.

**కే. సుబ్రహ్మణ్యశాస్త్రి విరచితము.**



బళ్లారి, ఎక్స్‌ప్రెస్, ముద్రణా...

కాకినాడ స్కేప్ అండు కో లో కె. సుబ్బారాయ సోదరులచే
ముద్రింపఁబడియెను.

మొదటికూర్పు : 1927.

దీనివెల
1—4—0

# విజ్ఞాపన

చరిత్రాత్మక నాటకభూమలయందు నాంధ్రమహిళ కెనలేనియభిలాష; కావున చిరకాలము క్రిందట నేనినాటకము రచించితిని; కాని శ్రీసరసవినోదినీ సభకై ముద్రింపనైతి. ఇందలి సంవిధానపాత్రానుసంధాన రసపోషణాదులు విపశ్చిద్వర్యుల యాలోచనికషమున గుణపరిపాటినందఁగలవు.

ఈనాటకమున వీరకరుణారసములు ప్రాముఖ్యములగుట, రసపోషకభాషాప్రౌఢిమ యత్యవసరమయ్యె. అందందు దీర్ఘసమాసములు గీర్వాణపదానువిద్ధములగుట నాకాలమున భాషాప్రచారపరిపాటియు, వైదుష్యమును బోధించుటకేయని విన్నవించువాఁడ.

కథాసంవిధానమతి దీర్ఘమగుటచే నొకింత నాటకము పెద్దదియైనను, నభినేతలు ప్రదర్శనానుగుణముగ సంకోచితమొనర్చుకొనుటయొప్పు.

పద్యములయందు యతిలక్షణవిధానము ప్రస్తుతకాలమున సంస్కారపదమధిరోహించుట మేలనుబుద్ధి మామ నందనునకు కలిగి యుండుటచే నాతఁడు సవర్ణదీర్ఘముచేతను, సంధ్యక్షరాదేశముఁగను, కనుపట్టునచ్చుతో గూడిన హల్లునకు ప్రథమవడికిని సావర్ణ్యము నాశ్రయించి యతిచెల్లించియున్నవాఁడు. "యానపవల్లరిన్ జనవమంది" యను నుత్పలమాలయందును, "తరుణీయొప్పుతెవీపుసీరుచిర నేత్రాబ్జాతముల్"

యును మత్తేభ మునందును మఱికొన్నిఁటియందును నివిచూడనగు. 'యి' కార 'యే' కారములకును, ఋకారప్రయుక్త వకారమునకును నిగ్రంథమునందు యతి చెల్లింపఁ బడియున్నది. ఈసంస్కారము దుష్టమను వారికనుకూలముగ నయ్యవి తప్పొప్పులపట్టికయందు సవరింపఁ బడియున్నవి.

ఇట్టివిశ్రాంతివిశేషంబులింకను నందందుఁగలవు. అవన్నియు నీనవీనసంస్కారాపేక్షచేఁ గలిగినవనియే పాఠకు లూహింప ప్రార్థితులు.

59వ పుటయందు, సాగర్జివాక్యములకు ముందీపద్యము ప్రమాదవశమున ముద్రితము కాలేదు. కాన దానినిక్రింద ముద్రించియున్నాఁడ.

చ॥ దురితమహాంధకూపమునఁ ♦ దొంచినమిచ్చినమెట్లనంగ, భా
స్వరరసపుత్రికీర్తి నిటు ♦ వైరులఁగూర్చిడిదూలలోయునన్,
నరకులహీను నాడుజన ♦ నంబును ద్రోహితమంబుఁ జేర్పగా
నరుగుప్రదీపయుగ్మ మన ♦ నక్కట నాచరణంబు లేగెడున్.

పరిపట్యాశ్రమము.
బళ్లారి. 1—6-27 } వైయాకరణి పండిత. కే. సుబ్రహ్మణ్యశాస్త్రి



# నామనవి

ఈనాటకమునైతము, నేతత్కాలవికృతేతరనాటకములంబోలె నాటక ప్రదర్శనమున దిగంతవిశ్రాంతకీర్తినిగన్న బళ్ళారిసరసవినోదినీ సభాసభ్యుల ప్రోత్సాహమున దాదాపు 12వత్సరములక్రిందట రచియింపఁ బడియె. ఇటీవల ద్విజేంద్రమహాశయుని 'ప్రతాపసింహనాటకము'ను గాంచియు, దీనిఁబ్రకటించుట కియ్యది స్వకల్పనావిరాజితముగుట కతననే!

ప్రస్తుతకాలమున కథాసంవిధాన రసపోషణ పాత్రపోషణాదులయందు మహారాష్ట్రహిందీ వంగభాషలయందలి నాటకరాజములు నవీనసంస్కారముచే వన్నెకెక్కియున్నవి. అందు శోకవీరరసాదులు జ్వాలంబుగ నభివర్షించుటకు గద్యరచనయే రసనిష్యందపరాకాష్ట నందియున్నది. అట్టినాటకము లాంధ్రమున విరళముగ చూపట్టుచుండుటచే నీనాటకమున విశేషగద్యభాగవేల్లనము గోచరించుచున్నది. పద్యములు తిలతండులన్యాయమున విస్ఫురింపుచున్నను, గద్యభాగమే విశేషముగుట కతనఁబోలు యీప్రాంతమునందలి నాటకీయసంఘమునందలి ప్రముఖేతరసభ్యుఁడొకఁడు దీనిని నవలయని భ్రమఁజెందెనఁట!

ఇన్నాటకమున దుర్గాదాసు యను నొకపాత్రనామము కొంరగజేబు సమకాలీనుఁడగు ఠాకూరు దుర్గాదాసును సమర్థించుచున్నదను భ్రమఁగలుగవచ్చును. ఏకనామసముపేతవ్యక్తులెన్నియోని హిందూదేశచరిత్రయందును, నందును రాజపుత్రస్థానచరిత్రయందు చూడనగును. ఈదుర్గాదాసు నవీనసంవిధాన కవికల్పితపాత్రయని యూహింపనగు.

మహాకవి కాళిదాసవిరచిత శాకుంతలామాళవికాగ్నిమిత్ర నాటకములయందలి కృతదారులును, లబ్ధసంతానులునునగు ధీరోదాత్తనాయకులకుఁ బోలె, నిందును, ప్రతాపునికి రాణాబాయియెడ ననురాగము కల్పింపఁబడియున్నను, యీయనురాగమాతనిధీరోదాత్తతనాపాదించుసాధనములలో నొక్కటియనియే కవియభిప్రాయము. అవ్యాజానురాగ మెవ్వరియందైనను, నెట్టి కాలముననైనను దూష్యము కాజా

లము. పవిత్రతరప్రణయ బీజాంకురములకు పాత్రాపాత్రములును చూరరాని హృదయక్షేత్రములునుకలవే? అయిన ననురాగమునింద్యము కాకున్నను, ననురాగశృంఖలాబద్ధులై యుక్తాయుక్తముల నరయక మానవులొనర్చు యత్యాహితములు దూష్యములగును.

ప్రతాపుఁ డనురాగబద్ధుఁడైనను, వాక్యపాలనదీక్షకై ప్రకటించిన మనస్థైర్యమును, కార్యైకదీక్షయు ప్రశంసనీయములగు.

మోహాతిరస్కృతయగు రాణాబాయియు, ప్రపంచమున స్త్రీసహజకృత్యమగు వాత్మహత్యకు బూనినను, యుత్తరక్షణమున నేదైవము పరమాంతఃకరుణచే ప్రసాదించినశరీరమును హింసింప నెట్టియర్హతయు లేదనియు, దేశఫలసస్యాదకాదుల వర్ధితములైన యవయవేంద్రియములు దేశప్రజాసేవకై వినియోగింపవలయుననియు నిర్ధరించె. స్త్రీలుసైతము దేశప్రజాసేవకనర్హులు కారని జగంబులకు చాటుటకై, యాజన్మబ్రహ్మచర్యవ్రతసక్తయై, తత్కాలసంసర్పిత మేవాడువిఘ్నమునకునాత్మార్పణమొనర్చి; యా మోధయై యాత్మజ్ఞానమందెను.

రహీం, ఖాన్ ఖాన్, అక్బరులకు మహమ్మదీయులైనను గ్రాంధికభాష నుపయోగింపఁబడినది, గ్రామ్యముపయోగించినయుత్తమత్వమునకు భంగమాపాదించునను సంశయమున సలక్షణగ్రాంధికభాషయే వ్రాయబడినది.

కాకినాడ "శ్రీవిజయభారతసభ" వారినాటకమును కాకినాడ, రాజమండ్రి పిఠాపురం మున్నగుపట్టణముల ప్రదర్శించి విబుధజనప్రశంసకు పాత్రులైరి. వారి ప్రార్థనపై రచియింపఁబడిన పాటలు సైతమీదు ముద్రింపఁబడియున్నవి. పాటలు నాటకఖేలనమున కత్యావశ్యకములని కాని, యవి లేకున్న నాటకము రుచింపదని కాని కవియభిప్రాయము కాదు. ఏతత్కృవిక్రృతరాక్షసీమహాత్మ్యా కాంత, 'ప్రణయపరిణామము, లీల, హిరణ్మయి, విషాదసుబోధన, కృష్ణదేవరాయమున్నగు నాటకము లచిరకాలమునేముద్రితములు కాఁగలవు.

కే. బాలసరస్వతి. బి. యె. బి. యల్

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.

---

## తత్ప్రవేశరంగములు.

ప్రతాపుఁడు—మేవాడుమహారాణా : కథానాయకుఁడు. I 1, 3, 4 II 1, 3 III 1, IV 1, 3, 4, 5 V 1, 2.

సాగర్జీ—ప్రతాపునిసోదరుఁడు. I 1, 4, II 2, 3, 5, III 1, 4, IV 2, 5, V 1.

దుర్గాదాసు—ప్రతాపుని సేనాని. I 1, 3, 4, II 3, III 1, 2, 5 IV 1, 2, 3, 4, 5, V 2.

అమరసింహుఁడు—ప్రతాపుని కుమారుఁడు. I 2, II 4, III 2, IV 2, V 2.

గోపీనాథ—ప్రతాపుని గురువర్యుఁడు. I 1, 4, III 1, 2, 3, 4, 5,, IV V 2.

భామాసా<br>ఝూనాన్‌రావ్ } ప్రతాపుని సామంతులు

రహీంఖాన్—మొగలు సేనాని. I 3, II 2, III 4, IV 4.

అక్బరు—ఢిల్లీ సార్వభౌముఁడు. II 1.

బడోసీ-ఖాన్ ఖాన్-మానసింహ-పృథ్వీసింహులు-అక్బరు సామంతులు.

## స్త్రీలు.

విక్రమబాయి—ప్రతాపుని భార్య. II 4, III 2, IV 1, 3, V 2.

లీల—ప్రతాపుని కుమారి. II 4, III 2, 3, 4, 5, IV 1, 3, V 2.

రాణాబాయి—ప్రతాపునివరించినయువతి. I 3, II 1, 4, III 2,3,4, 5 IV 2, 3, 4, 5, V 2

ప్రమద—సాగర్జీభార్య. I 2, II 4, 5, IV 2, V 1.



రాజరాజేశ్వర్యై నమః

# నాంది

—:o:—

శా॥ స్మేరాంకూరకపోలమొక్కటి శిర ✦ శ్రీవిష్ణువక్షస్థిత
శ్రీరామామణిగారవింప, దనుజా ✦ శేషప్రభీలంబు నా
వేరొండాత్రి పురాళిదగ్ధముల గా ✦ వింపన్, ప్రతాపాఢ్యలీ
లారామన్ జగదాళిఁబ్రోచు శివలీ ✦ లన్ మమ్ము పాలించుతన్.

# ప్రకటన

నాచే రచియింపఁబడి ప్రకటింపఁబడిన యీ మేవాడు శౌర్యాగ్ని, నాటకమునకుఁ గల సర్వస్వాతంత్ర్యములు క్రొత్త కాపీరైటు ఆక్టుప్రకారము నాకుఁ జెందియున్నవి. కావున, దీనిని భాషాంతరీకరింపవలయునన్నను, ప్రచురింపవలయునన్నను ఖేలన మొనర్పవలయునన్నను, నాయనుమతిని వ్రాతమూలమున పొందవలయును. అటుఁగాక స్వతంత్రించినవారలు నానష్టమునకు పాత్రులగుదురు.

1—5—27 } బళ్ళారి పండిత కే. సుబ్రహ్మణ్యశాస్త్రి.



శ్రీ

# మేవాడు శౌర్యాగ్ని నాటకము.

ప్రథమాంకము ప్రథమరంగము

కొమల్మేరుదుర్గము—రాజాస్థానము

సాగర్జీప్రతాపులు—సింహాసనము చెంత నుపవేశించియుందురు.
భామాసా—ఝూనాస్రావ—భవానిదాసు—దుర్గాదాసు లొక
ప్రక్కను—గోపీనాథశాస్త్రి—క్రిష్ణాజీ—బ్రాహ్మణులొక
ప్రక్కను నుపవేశించియుందురు.

(అనుబంధము 1)

భామా—సభ్యులారా! సామంతప్రభుచూడామణులారా! ఇపుడు మనమందఱమిందుచేరియుండుట సర్వజనవిదితమే కదా! మహారాణా ఉదయసింహరాజేంద్రుఁడు దివంబునకరిగె ప్రస్తుతము రాజ్యమరాజకమైయున్నది. మేవాడున సార్వభౌమపదలాలితుఁడగు ప్రభువతంసుఁడు లేకున, దైనందినము పరిక్షీణదశనందగలదు. కావున రాజవంశధర్మచిరంతనాచారప్రకార ముదయసింహభూపాలమరణానంతరము, తదగ్రిమసుతుఁడగు శ్రీప్రతాపసింహ యువరాణాగా రీసింహాసనమలంకరింపవలయునని నాయాశయము.

# మేవాడు శౌర్యాగ్ని నాటకము.

సీ॥ మేవాడుస్వాతంత్ర్య భేదాంధకారాళి
నుదయసింహుఁడు నస్త మొదవెనుర్వి
రసపుత్రశౌర్యాబ్జ రాసిని—వగముంప
యవనచంద్రుఁడు దేశ భువిని వెల్గె
క్షత్రియయోధ వి క్రమహేమరేఖకు
నికషోపలంబిందు నేగుదెంచె
జన్మభూభామిని సార్వభౌముని నాథు
ప్రాణేశునెంతయు మమతఁగోరె

తే॥ గీ॥ శత్రురాహువు గ్రసియింప సరగవచ్చె
మ్లేచ్ఛఖడ్గాళిదుర్దిన రీతిచెలఁగె
తెంపు! ప్రభుచంద్రు నిలుపుఁడి రీతిసింహ
పీఠి! యింకేల యోచింప! వీరులార ॥

భవా—సామాజికులారా! నావిన్నపమింత యాలకింపుఁడు. ఈభామాసావచించినరీతి—ఉదయసింహమహారాణాయనంతరము—ఈచిత్తూరు రాజ్యచక్రవర్తిత్వము సాగర్జీ యువరాణా యుఁదావహించుచున్నదిగాని రాజ్యలక్ష్మి యితరుల వరింపనేరదు. ఈరాజ్యసామ్రాజ్యపదవిని మహారాణా ఉదయసింహభూపాలుని స్వర్గగమనసమయమున వీరికరతలమందిడి చనిరి వారుతమ పవిత్రముఖపద్మమునుండి ప్రకాశీకరించిన వాక్సరణి యొక్కటియేగాక, స్వహస్తలిఖిత శుభాక్షరవిన్యస్త శ్రీముఖమునైతము దయపాలించియున్నారు-ఇదియేయాశ్రీముఖము.

భామా—(పత్రికఁగైకొని) సామాజికులారా! మహారాణాగారి యానతిని తజ్జీవితకాలముననేమి, దేహత్యాగానంతరముననేమి, నస్మదీయశిరంబుల ధరింపవలసినదేకదా! ఈపత్రిక నింతపరామర్శింతము.

"శ్రీ మేవాడుసార్వభౌమ మహారాణా ఉదయసింహరాజేంద్రులు మదీ

యసామంతభూకాంతులకును, ప్రజానీకమునకును నాజ్ఞాపించుశ్రీముఖ మేమన:—నేనింతకాలము, యీ చిత్తూరురాజ్యమును మీకరుణావాత్సల్యముచే పరిపాలించి దైవవశమున నీకర్మమయశరీరమును వీడిపోవలసియున్నది. అట్టిసమయమున కలిగిన మామకాభీష్టమును నాయనంతరముననైనను మీరాచరింపవలసియున్నది. నాకు మువ్వురుసుతులు నయవినయవిక్రమక్రమ వీరులున్నను, మదనంతరము సింహాసనపురంధ్రావామాంకపరిసరము నధిష్ఠింప యువరాణా సాగర్జీయేనర్హుఁడు. నాయగ్రిమసుతుఁడగు ప్రతాపునిమాని, యీరాజ్యశ్రీని సాగర్జీనివరింపఁజేయుట మేవాడుదేశజననిపై నాకుఁగల యభిమానమనియే మీరు భావింపవలయు. ప్రకృతము మేవాడు దుస్థితినితిలకించి నమ్మాతనుద్ధరించుటకై నేనెంతయో యోచించియీనిర్ధారణమునకువచ్చినాఁడ. కాన మీరు రాజభక్తిధురంధరులేయైన మదీయాజ్ఞామాణిక్యంబును మీశిరంబుల ధరింపవలయు.

ఇట్లు,

ఉదయసింగ్ మహారాణా."

అందఱు—(ఊరకుందురు)

సాగ— రసపుత్రవీరాగ్రేసరులారా! ప్రభుభక్తిపరాయణులారా! ప్రభుశాసనోల్లంఘన మెట్టిపాపకార్యమో యోచింపుఁడు. ప్రకృత మీమేవాడు దుర్భరహీనస్థితికి దావలమైయున్నది. రాజ్యపాలన కష్టము లెఱిఁగినవాఁడగుటచే, మహారాణా ఉదయసింహాప్రభువుతనయనంతరమున నీచిత్తూరు రాజ్యరమామణి శాత్రవపాదతల విమూర్ణితమైపోవునేమోయను భీతిచే నేనెంతవలదనినను బలవంతమున నాకీరాజ్యరమాపాలనభార మొసంగి చనియె. కావున, చచ్చి పరలోకమునను న్న ప్రభు మనశ్శాంతిని, దేశమాతకష్టములను నాలోచించి కార్యమొనర్పుఁడు. రాజభక్తినిమానకుఁడు.

భవా—సరి. మహారాణాగారి యానతిని మనమవశ్యము నిర్వ ర్తింపనేవలయుఁగదా? ఇదిమీయందఱికిని సమ్మతమేకదా ?

ఝూనా—సందియమేల ? భవానీదాసు వచించినరీతి మనము రాజాజ్ఞ పాలించుటకిదియే నవీనప్రారంభమా ? రాజపుత్రరక్తమునకు న్నంతప్రభుభక్తిపరాయణత మరెద్దానికిఁగలదు ?

భవా—సమంజసము. యువరాణా ! సాగరీప్రభూ ! ఈసింహా సనమలంకరింప మిమ్మాసభప్రార్థించుచున్నది.

(సాగరీ సింహాసనవేదికనధిరోహించును, ప్రతాపుఁడు వెనుదిరుగును)

కుర్గా—నిలుఁడు ! ప్రతాపసింహసార్వభౌమా ! నిలుఁడు! సిం హాసనవేదికఁబాయకుఁడు. ఈ యనన్యసామాన్యప్రక్రియనే పరమా మ్నాయమార్గమని భావించి, కర్తవ్యసముచితకార్యకరణమున విము ఖులుకాకుఁడు. (ప్రతాపుఁడు నిలచును)

సభాస్తారులారా ! సామంతులారా! ఇదియామనకు కర్తవ్యము? ఇదియా ప్రభుభక్తిపరాయణత్వము ? ప్రభువగు నుదయసింగ్ మహా రాణాగారికిట్టి యభూతపూర్వమగు నాజ్ఞాకరణమున కెట్టియర్హతయు నుండదు. సార్వభౌమపదము రాజధర్మమర్మపరంపరాగతమగు నభ్యా సప్రకారము, రాజసంతానసంతానమున నగ్రిమసుతునకు ప్రాపణీ యస్వత్వముకాని చక్రవర్తితనయిచ్ఛచొప్పున వినియోగింప చేసినర్థ రాచూర్ణముకాదు. కాన నుదయసింగ్ మహారాణాగారు మేవాడురాజ కులక్రమాగత సింహాసనాధికారమును తనప్రథమసుతునకు తప్పించి యితరులకిచ్చుట కెట్టిధర్మశాస్త్రబోధితమగు నధికారమును నుండదని నొక్కివక్కాణించెద. అగుచే, నిరంతరప్రజాపాలనధురీణబాహుయు గ్ముఁడై, నిజప్రతాపజ్వాలననిరస్తశాత్రవతృణకాననుఁడై, రాజ్యరమా విలాసకేళీభవన స్వకీయకటాక్షుఁడైన, శ్రీ ప్రతాపసింహరాజేంద్రునకే

మేవాడుసింహాసన మధిష్ఠేయమైయున్నది. దీనిని మీరవివర్శనమున, అధర్మమున, అక్రమమున, నతిక్రమించి, రాజ్యము నరాజపాలితము నొనర్ప సమకట్టితిరా! మదీయబాహుబలసమగ్రసాహస శౌర్యవిభూతిచే, రాజ్యరమామణిని బలాత్కారసమాకర్షణమున రాదిగిచి ప్రతాపసింహభుజాపరమనిరపాయ పద్మమందిరమున నధివసింపజేసెద. (సింహాసనము చెంతకేగి) సాగర్జీప్రభూ! తామధిష్ఠింపదగిన పరమాసనమియ్యది కాదు. అదే! అందున దిరండు (ఆకర్షించి సాగర్జీని యతనియాసనమునను పవేశింపఁజేయును.

ఝూనా—భళిరే! గుర్దాదాస్! నీధర్మవిచారణపారీణతయెంతయు ప్రశంసనీయము. మేమందరమును ప్రమాదవశమున రాజశాసనమవశ్యాకిరణీయ మని భావించి రాజ్యపాలనమున న్యాయత్త మొనర్ప సంసిద్ధులమైయుంటిమి. నీదగురాజనీతిసారధర్మబోధవాక్సరణినాలించి యస్మదీయాజ్ఞానవిజృంభిత వివేచనాశూన్యతమూని కర్తవ్యము నెఱింగితిమి. ఇఁక మనమాచరింపవలసిన ధర్మమును నిర్వర్తించుచున్నాము.

(అందఱు కరతాళధ్వనులు చేయుదురు.)

ప్రతా—ఝూనాస్‌రావు! తాళుము-తాళుము సామంతరాజవరేణ్యులారా! యించుక యోచింపుఁడు నాకు రాజాజ్ఞయెటు పాలనీయమో, నాకును, ప్రజాసామాన్యమునను నొకటఁజేసియు నొకేపాలనీయమగుకాదే? ఇయ్యదినాకు రాజశాసనమొక్కటియేఁగాక, యవశ్యమాచరింపవలసిన జనకుని శాసనము ఒకవేళ రాజునకగ్రిమసుతుఁడనగుటచే నాయందే రాజ్యపాలనార్హతయావహించునని మీరెంచుపక్షమున, నేను నాసోదరుని పట్టాభిషేకమున కియ్యకొనుటయేఁగాక నామనసార నాస్వత్వమును నాయనుజాతుఁడగు నీసాగర్జీకొసఁగుచున్నాఁడకదా? మీకేలయోచన? ప్రకృతమీమేవాడు కష్టపరంపరల మునిఁగియున్నది ఇంకను మునుఁగనున్నది డిల్లీసార్వభౌముఁడగు వక్బరు

పాఠానుసైన్యము శ్రీమేవాడును నాక్రమించియున్నవి మనజన్మదేశమునకే యలంకారప్రాయమై, శాత్రవపాదస్పర్శనమందక, నిరంతర విముక్తినాట్యస్మై, పర్వతమయమైన, చిత్తూరు దుర్గసతీమణిపదులకు వశీభూతమై, శాత్రవపాదతల స్పర్శమున తిలడిల్లుచున్నది.

సీ॥ ఏకోట! యగినర్ర వీరహుర్లోకమై
రసపుత్రమానశౌర్యాళిబెనచు
ఏకోట! ఘనహమీరప్రభునిదిగ్విజయభా
మావివాహోజ్జ్వల మంటపంబు
ఏకోట! సంగరాడ్విభుకోపవహ్నిమే
చ్ఛాళిసంహారక యజ్ఞశాల
ఏకోట! క్షత్రియ వీరరమామణి
యవనవధానువి హారభూమి
తే॥గీ॥ మనయశశ్చంద్రికమనల ప్రాణధనము
మనశరణ్యంబుమనపూర్వ మాన్యరక్త
వరితంబు చిత్తూరుదుర్గ వరస్థాన
మరివశంబయ్యె నేమందు నక్కటకట॥

ఇట్టిసమయమున నామన మంతఃకలహములఁబెంచి కలహించుట ? నా సోదరుఁడు సార్వభౌముఁడైన, నేనుసార్వభౌముఁడనుకానా ? ఒకసార్వభౌముఁడేల, మేవాడ్దేశస్వాతంత్ర్యరక్షణమహాకార్యమున, ప్రతియొకఁడును తనయావచ్ఛక్తిని వినియోగింపవలసినదే? కానలెండు ! మనమందఱము నుదయసింగ్ పితాజీగారియానతిని నిర్వర్తింతము సాగర్జీకిపట్టాభిషేకమొనర్తము, (సాగర్జీ చెంతకుఁబోవనుంకింప గోపీనాథుఁడునిలిపి)

గోప.—ప్రతాపసింహరాణా ! నిలుఁడు! ఇది మీజనకునియానతియగుటచే, మీరుదానినిపాలింపనెంచుట మీపితృభక్తిని, స్వార్థపరి

త్యాగమును చాటుచున్నది. కాని, జనరాజ్యమైనమాత్రమున ధర్మాధర్మముల ప్రజాంగీకారప్రకారము విచారింపవలదా? వంశపరంపరాగతమగు పూర్వాచారరీతి, ప్రాణములు రాణాగారిదేహమును బాసిన క్షణముననే, సార్వభౌమత్వమును, నతనిదేహమును బాసి, యతనియగ్రిమతనయునియందావహించును అట్టిమిమ్ముచేరినరాజ్యసిరి నితరులకొసంగుటకు మీకెట్టియధికారమును లేదు అటునిరాకరించుటకును, నితరులకొసంగింపఁజేయుటకును, వలయుస్వాతంత్ర్యమే కాలముననైన, నేరాజ్యముననైన, ప్రజలయందేయుండును ప్రభువుతనకు లేనియధికారమును కల్పించుకొని, యాక్రమముగను-నన్యాయముగను తమకిడిన శాసనమున ప్రజలుపాటింపకున్న, వారికెట్టిరాజశాసనాతిక్రమణ పాపమును కలుగదు. ఈయుత్సవము నియమాది సుస్థిరమై, దోషవిరహితమై తనంతనావహించిన దొరతనపుయోమాహామణిసి జనసామాన్యమునకు ప్రకటించువినోదోత్సవముగాక-మేవాడురాజ్యసిరిని మీయందావహింపఁజేయు పట్టాభిషేకమహోత్సవముకాదు కావుననే యీదేశమున పట్టాభిషేకసూచకకిరీటధారణస్వాతంత్ర్యము వేదాశీర్వచనపూర్వకముగ నొనర్చుద్విజోత్తములయందుఁగాక, క్షత్రియశేఖరుఁడగు నీకృష్ణాజీవంశముననున్నది. ఇఁకనీసమోన్మదోత్సవమునకెట్టి యాలస్యమునొనర్పకుఁడు. ఇదిధర్మసమ్మతము పూర్వాచారసిద్ధము. దీనిచేనెట్టియనర్థమువాటిల్లినను, అదిదైవకృత్యమని యోంచవలయు. కృష్ణాజీ! రమ్ము కిరీటధారణోత్సవమునిర్వహింపుము. (కృష్ణాజీకిరీటధారణమొనర్చును. బ్రాహ్మణులు మంత్రములు చదువుదురు. "దేవీం వాచమజనయంతిదేవాః" మంగళవాద్యములు మోయును. (యవనిక పడును.)

## ప్రథమాంకము — ద్వితీయరంగము,

(సాగర్జీమందిరము - ప్రవేశము సాగర్జీ - చింతాకులితుండై)

సీ॥ సతతసంతాపాగ్ని । స్వాంతంబుదహియింప
నుసుకుసుమెటులార । కుందువాఁడ
కరతలపద్మాంక । చేరమైన, రాసిరి
యొగసిపోవుటకెట్లు । నగుచువాఁడ
సచివ, సైన్యాధిప, । సామంతులకు, నాగు
సుదతికిమోమెట్లు । చూపువాఁడ
ఆసభశలగిన । నవమతిశల్యంబు
లెటు నేమదిని స । హించువాఁడ
తే॥గీ॥ ప్రబలగౌరవభావత । పరగువాఁడ
ధరణిసరివారిలో నెట్లు । తిరుగువాఁడ
మరచియీనగి నెట్టుల । మనెనువాఁడ
ఎంచిప్రాణములెట్లు భ । రించువాఁడ॥

ఆహా! ఎన్నిదినములు శత్రుపరాభవమోర్చియోర్చి, తజ్జనితదుఃఖకల్లోలకల్లోలమాలికల మునుంగుదు. అయ్యో! నేఁడు నిండోలగమున సమస్తసామంత సర్వాంగసహావలభులమ్రోల, తనంతనె, రాజ్యసిరినన్ను వరింప కరధృతకమలహారయై, కమనీయరత్నపంచాస్యపీఠమున, తేస కేగింట చూచుచున్న సమయమున, నాపౌత్రుఁడు, మదీయకంధర రాజ్యరమా నిక్షిప్త కుసుమదామమును నావలఁదీసివైచి, తద్రాజ్యరమామంగళ దేవతాకరమును బలాత్కారమున గ్రహించెగా! అయ్యో! నేఁడు నాకుఁగలిగిన పరిభవదుఃఖము జగన్మయమై, వేదనామయమై యెందును తానయై నను నిర్దహించుచున్నదిఁగదా! రాజ్యరమాకాంక్ష నాకు లేకున్నను మానెఁగాక, మదీయహస్తగతమహేంద్రపదవిని, నింకొకరు

తప్పించి, ననునొప్పించి, దురంతప్రదీప్త క్ష్వేళరసహ్రదమున నెట్టుమ్మడియే, ననుద్రోయుట కెట్లు సహింతు ? అంచును, నానాసామంత భూకాంతుల సవినయ నేత్రమాలికల సుందర, నను మన్నించు సచివ సేనాధిప సబహుమాన సభక్తి వినమ్రశిరముల సముత్కమున, విజయేందిరా సతీమణుల భాతి, శాథాంతరాళమున నధివసించి, మదీయమకుటధారణ మహోత్సవదిదృక్షాయత్తచిత్తలగు రాచకన్నియల వలపుఁగొలుపు దరస్మితంపు నెమ్మొగముల సన్నిధిని, కటా! యేమనివచింతు ? మామకాజ్ఞాకరణసూచకనయనవిక్షేపములకై కాచియుండు భృత్యసేవక మిత్రులదండ, సింహపీఠినుండి యీడుర్గాదాసు నన్నాకర్షించి, దుర్భరావమాన సహస్రశనిధారాకదంబములఁ జీల్చి, సంతాప సంఘాతవజ్రపాతనిపాతముల విశీర్ణముఁ నొనరించి, లోకానీక భీకర దుస్తరావమాన హేళన వాక్యతీక్ష్ణశస్త్రముఖములఁ గ్రుచ్చి, ప్రళయకాలాభీల కాలశమన క్రూరచండవిఖండనముల ఛేదించి, నిరర్గళ నిరసన వాక్యశతధారాధారాళక్రీడనముల తుత్తుమురొనర్చి, కలఁచి, నలఁచి, నఱచి వైచుట కెట్లోర్తు ? అనన్యాయత్త పితృసమార్జిత మేవాడు రాజ్యవైభవము పరమచండాలుని భాతి నానుండి తొలంగిపోవుటకు శోకింతునా? దైవసమాన మజ్జనక శాసన భంగమునకై విలపింతునా ? సపత్నీమాతృసంజాత మత్సపత్నరూప-ఆజన్మశాత్రవ దుర్దమ ప్రతాపప్రతాపుని ప్రాభవమునకై దుఃఖింతునా ? దుర్దమమై, దురంతమై, దుర్భావ్యమై, దుఃఖసర్వస్వమై, రాజపుత్రక్షత్రియ మానసాసంభవమై, ననుముంచి, లోకము నావరించి దిశల నాక్రమించి, దుర్లోకప్రవృత్తి విజృంభించుచున్న మదవమాన గాఢాంధకారతమిస్రదేవతా సమాక్రమణమునకు రోదింతునా ? అయ్యయో ? తోడి రాజకుమారవరేణ్యులు, భవదీయ బాహుపంజర విముక్తమై సార్వభౌమపదవీ రాజమరాళము యెప్పగిదినన్యులపై వ్రాలెనన్న వారికెప్పగిది ప్రత్యుత్తరమిత్తు ? సార్వభౌమపదవి నేచవ

లీల కరగృహీతమొనర్చికొని వచ్చితినన్న నిర్భరామోదోత్సాహగా త్రి వల్లరీసంచలనశబ్దాయమానమణిభూషాభూషాయితాంతఃపుర రామా మణియగు నాప్రియదాభూష కేమనివచింతు ? ప్రతీపభూపాల వారంబు, మదీయాసిధారాగ్రజ్వలిప్యమాణశౌర్యాగ్నిపై నుఱుక నున్నతరి, తత్సమదాటోపనివారణ పటిష్ఠంబులైన మాత్సేనానికురంబ ములకు, తత్తిదాజ్ఞాకరణమహాసంరంభంబు నందుటమాని, నేనును తద్భృత్యోపమానజీవినై వారితోఁ కలసి—శాత్రవునికిఁద—అకటా శాత్రవుఁడునుకాఁడే-నిజసోదరరూపవైరిచరణసమీపమున,న న్నస్వ్సత్వాని,గనపగతరాజ్యవైభవుని,గనతీతలోకాధమజీవనుని,గఁజేసిన ప్రతి పక్షునిదండ, శిరంబువంచి-కరంబుమోడ్చి పట్టెడన్నమునకై సేవక వృత్తి నెట్లొనర్తు ? మామక రాజ్యపట్టాభిషేకమహోత్సవమే, తమ కెందును దురధిగమ వైకుంఠ రాజ్యవిభూతియని భావించుచు, మత్స మ్మోదభాగగ్రహణమునకై, యనేకసమ్మోదోత్సవపరంపరల నన్నుఁ దేర్పనాకై వేచియున్న మామకమిత్రబృందము నేరీతినూరడింతు? సరి హారునవ్వ, పెరవారుచులకనచేయ, కాని వారు కాసి కానిమ్మనియాశీర్వ దింప,కలయవమానముల కెల్ల నెట్లుతాళుదు? యేపగిది ప్రజాబృందము లఁజేరుదు ? యేభాతిపల్కరింతు? యేరీతి మన్మానసము నాదరింతు? యేభాతిపల్కరింతు ? లేదే ? మదీయావమతిసంఘాతజీమూతవ్రా తంబుల నిపాతంబొనర్పు వాతపోతంబొక్కటిలేదే ? కలుగదే అస్మ త్తిరస్కారప్రతీకారపరమపదవిప్రాప్తి పరమామోదమహోత్సవ సుఖమురాదే ? వైరివిదారణ, తద్హృదయపుటభేదననిసృతవిక్రమో పాత్తవిజయలక్ష్మీకరగ్రహణపరమానందము— కలుగవలయు—రావ లయు-సమకూరవలయు-సమీపింపవలయు-మదీయశాత్రవనిర్దళన— నిర్మూలన-నిర్నామీకరణ నిరూపనిర్గతసత్వ-నిర్దహనసమ్మోదసమయ ము చేకొందును ! ఆహా ! యేమీ! శాత్రవవిదళనమా ! శాత్రవుఁడె

వఁడు ? నిర్దళనమెట్లు ? ఏరూపమున ? శాత్రవుఁడు మాప్రతాపుఁడు కాఁడా ? మామకవంశప్రదీపకప్రతాపోన్నతఁడు కాఁడా? సోదరుఁడు కాఁడా ! సోదరనిర్దళనమా ! కట్టా! మానసేందీవరమా ! నీకెట్టిబుద్ధి వొడమె ? నీయొదలి ప్రతిసత్త్వారేణువును పాపకృత్యమునే స్రవించు చున్నదా ? ఆహా ! పరాశతానిర్గతాపమానదేవతా ? త్వదీయవిలాస మాయిది ? చిక్కను-నీకు చిక్కను ? నీకు గుఱియెవ్వరు ? నీసంతా పమునకు పావలమెవరు? మాప్రతాపుఁడేకదా ? అన్యుఁడు కాఁడే ?

(ప్రవేశము ప్రమద)

సాగ—ప్రమదా ! యిదియేమి? నీరోషకషాయిత వీక్షణము లెచ్చట ప్రసరించుచున్నవి ?

ప్రమ—ఎచ్చట యిచ్చటిదుండునో ? ఇచ్చటి దెచ్చటలేదో యచ్చట !

సాగ—ఇచ్చటిదేమి ? అచ్చటిదేమి ? నానొక్కటియుఁ దెలియకున్నది!

ప్రమ—అది యిప్పుడెట్లు తెలియును ?

సాగ—అది. యున్న నేది ?

ప్రమ—ఏదిలేకున్న పురుషుఁడు కంచుకమున కర్హుఁడగునో ? ఏది యున్ననన్ని యుండియు నుండనట్లు కాన్పించునోనదియు-అదియు !

సాగ—నీమాటలేమియు నర్థము కాకున్నవి!

ప్రమ—అనర్థమగువఱకు నర్థము కావు.

సాగ—ఆయనర్థమున కయ్యేనా నీకింతశ్రమ ?

ప్రమ—ఇచ్చట యిష్టమున్నఁగదా శ్రమ ?

సాగ—ఇష్టమనఁగ జేనియందు ?

ప్రమ—స్త్రీలయందు-స్త్రీలసమానులయందు.

సాగ—స్త్రీసమానులా ?

ప్రమ—ఔను-బ్రదికియు చచ్చినవారు.

సాగ—అట్టి వారెవ్వరు ?

ప్రమ—దుస్సహావమానమున—బ్రదికియు—చచ్చినట్లు తిరుగు వారు.

సాగ—ఎవరువారు?

ప్రమ—ప్రత్యక్షవస్తువునే తెలియఁజాలరా?

సాగ—ప్రత్యక్షమున నుండున దెవరు ? నేనేకదా ?

ప్రమ—ఔను. నేను చెప్పునదియు మీరే ? మీరు చెప్పునదియు మీరే ?

సాగ—ప్రేయసీ ! యేమి? తూలనాడుట కుపక్రమించితివా?

ప్రమ—అర్ధాంగినియగు నేను తూలనాడుటయే తమ మానసమునకు వెక్కసమైన, పగతురు, దాయాదులు, తూలనాడి, పోనాడి, తెగనాడి, ఆడినంతఁజేసి, చేసినంత యనుభవింపఁజేయుచున్నను మీమానసమున కేమియు వెగటుపాటుఁ దోఁచలేదు కాఁబోలు?

సాగ—నాపగతుఁడెవఁడు ? చేసియుండు టేమి ?

ప్రమ—నిన్నసింహాసనమునుండి క్రిందకీడ్చి, సరివారిలో తలవంపులుగ నవాచ్యపరిభవమునకులోఁ జేసినవాఁడు తమకు మిత్రుఁడు కాఁబోలు ?

సాగ—(తలవంచియుండును)

ప్రమ—పోవనిండు ! నాకేల యీచింత ! ఈప్రమదాభూష మెన్నటికిని దాసులకు దాసికాఁజాలదు.

సాగ—దాసులకు దాసియెవరు ?

ప్రమ—మీరు మీదాయాదులకు దాసులుకారా ? అట్టి మీకు నే దాసినికానా ?

సాగ—జీవితేశ్వరి ! నేఁడేల నీవిట్లైతివి ? నేను దాయాదులకు దాసుఁడనా ! ఉదయపురమహారాణా సోదరుఁడనుగానా?

ప్రమ—పరులసమయుఁడు మారసి వారిపాదసపర్యలొనర్చు నీచదాసజనమునకు, పట్టెడన్నమునకునై తనువును పరాయత్తమొనర్చి ప్రాణముల నమ్ముకొని జీవించు మీకును భేదమేమి ?

సాగ—ఏమీ ! యువరాణాయన మహారాణాదక్షిణభాగములంకరించి యలరారు నాకును నీచదాసజనమునకును, సాటికల్పించితివా ?

ప్రమ—యువరాణాయా మీరు! నాఁడు భోజనపాత్రికడ కరుగు శునకమును పాఱఁదోలినట్లు, ఆదుర్గాదాసుభటాధముఁడు సింహాపీఠినుండి క్రిందికీడ్చి పాఱవైచినది చాలదా మీయువరాజ్యపదవికి బహుమానము?

సాగ—రమణీ ! ఔను ! ఆయవమతియే నన్నింకను క్షణక్షణమును పలుకరించుచున్నది. దానికిఁ దగినశాస్తియగువఱకు నాకు నిదురపట్టదు.

ప్రమ—నిదురయేలపట్టదు ? శాత్రవులు మిమ్మీడ్చి యూడిగము చేయించుకాలము వచ్చువఱకు నిదురకేమి కొఱంత ?

సాగ—ప్రమదా ! యేలవ్రణముపై క్షారజలముఁ జల్లెదవు ? నామానసవేదనయే విశ్వరూపము ధరించుచున్నది! దానికి సైఁదోడుగ నీతీక్ష్ణవాక్యశస్త్రవేదన యొక్కటియా?

ప్రమ—శాత్రవావమానశూల వేదనకన్న నావాక్యశస్త్రవేదన మీకు దుర్భరముగనున్నదా ?

సాగ—చాలునింకూరకుండుము. పెట్టిదంపుపిడుగుల నొక్కుమ్మడిరేఁ నీముఖాకాశమునుండి గుప్పింపకుము.

ప్రమ—ఇఁక నావాక్యవేదన మీకుండదఁటెంటు ! అపుడే ప్రతాపునిభార్య, ప్రమదయంతఃపుర సేవకుప్రమదయేల రాలేదని పరుసంపు మోముతో నడిచెనఁట! పోయివత్తునా ?

సాగ—ప్రమదా ! యించుక సేపు నన్ను వదలుము. నీమహా క్రూరనిశాతవాక్యహాలాహలమును ధరించుశక్తి నాశిరమునకు లేదు.

ప్రమ—రాజకుమారా ! కాదు—కాదు—రాజపత్నీకుమారా ! మరియొక వార్త ? అక్బరుచక్రవర్తి మనపై ననేకవాహినీపరంపరలఁ బంపియున్నాఁడఁట ? మీరాయుద్ధమునకు చనవలయునఁట! వెడలుఁడు వేగమే ? దుర్గాదాసుకశాఘాతములు వడులోవలనే ?

సాగ—ప్రమదా ! నీవేల నాకు ప్రమదవు కాకున్నదానవు? దుస్తరసంతాప మాపఁజాలక యేమొనర్తునాయని సందియపడుచున్న నాకిదియా—?

ప్రమ—ఓసర్ప్యాట సులభముగ నున్నదే! దుర్గాదాసు నింటి వాకిలి కాచుచు మీరును, నతనిభార్యయగు పుత్రి పరిచర్య చేయుచు నేనును నున్న నెవ్వరిభయమును నుండదు. భోజనమున కెట్టికొఱంత యునుండదు.

సాగ—ఈరాజపుత్రకులాభరణుఁడగుసాగర్జీమేన విక్రమ రేణువులాఅకుండుపఅకు ప్రతిపక్షనిర్మూలనక్రీడయొనర్చి, వైరిశుద్ధి నొంది సుఖంపక మానునని యనుకొంటివా ?

ప్రమ—ఇపుడు మీరు పురుషసింహులు. అయిన మీప్రతిపక్షులెవరు ? అక్బరా ? అతనిసేనలా !

సాగ—కాఁడు, కాఁడు అక్బరు కాఁడు! పేరోలగమున నన్నుభూత దుస్తరావమానమునకు గుఱిఁజేసిన దుర్గాదాసుకన్న నాకు వైరి, శాత్రవుఁడు మఱొక్కఁడు కలఁడా! వాని—

ప్రియ—వెఱ్ఱితేఁడా! యిదియా? మీ వైరదీక్ష! ఇట్టి వెఱ్ఱిదొరలు కావుననే పగతురు మిమ్ము పశువులఁ గట్టెడిస్తంభమునకు కట్టియున్నారు. దుర్గాదాసేమి చేయును పాపము! పరులు చెప్పెడి పని చేయువాఁడు. ఏసినవాఁడుండ యిషు వేమి చేయును?

సాగ—కలికీ! దుర్గాదాసు కాఁడా నా పగతుఁడు? వానికీ బోధ మొనర్చిన బోధకు లెవరు? నా వైరిపదపట్టాభిషిక్తు లెవరు? చెప్పుము? నా మానసము కింకర్తవ్యతాపబాధమైయున్నది?

ప్రియ—సరిసరి; మంచి నేర్పరులు మీరు; విందుపొందు ననుభవించుటకు మీరు? నిష్ఠురమునకు మాత్రము నేనా? నిష్ఠురమునకైన నియ్యకొని వచించిన నేమిఫలము? ఊరక నాయుబును పోఁగొట్టుకొనుట యోఁగదా?

సాగ—రామామణీ! తొలుత వచింపుము? నీయుపదేశ ప్రకారము వర్తించువాఁడు నాకంటె నింకెవఁడు? జీవితేశ్వరీ! నీవు నీతివిద్యకాచార్యవై సముంచితగృహిణీపదమలంకరింపుము?

ప్రియ—నాథా, యింత తెలియఁ జాలరా? మీ ప్రతిపక్షుఁ డెవ్వరగుటయు నూహింపఁజాలరా?

సాగ—ప్రేయసీ! నాకేమియుఁ దోఁచకున్నది. దురంతదుస్తర సంతాప నిదాఘతప్తమగు మామక మనశ్శిలను నీయుపదేశ శీతలశీకరామృతవృష్టిచే చల్లపడఁజేయుము?

ప్రియ—రాజేంద్రా! మీ తాపసంతాపకారకుల నిరూపించిన మీ వైరభావముఁ దీర్చికొని సంతుష్టులగుదురా? నిక్కమా?

సాగ—నిక్కమా ? యేలయింకను సందేహించెదవు? ఇదే నీకరమున కరమిడి ప్రతిజ్ఞఁ జేసెద చెప్పుము?

ప్రియ—నేను నోటచెప్పవలయునా ? మీశాత్రవుఁడు- మీ వైరి- మీయగ్రజుఁడే- మీకుఁ బ్రతాపునికన్న వేఱు శాత్రవులుకలరా ?

సాగ—ప్రియదా ! నాసోదరుఁడు నన్నిట్టి యవమతికి గుఱిఁ జేయ నెన్నఁడైనఁ బాల్పడునా ?

ప్రియ—నేను తొలుతనే వచింపలేదా? లోకులకు సత్యము రుచింపదని, తలఁగోసి ముందిడినను గారడివిద్యయన్న నేనేమిచేతు? మీసోదరుఁడే, మీవంశశేఖరుఁడగు ప్రతాపుఁడే, దుర్గాదాసునకు సేనాధిపత్యమొసంగెదనని యుద్బోధించి నేఁడు నిండోలగమున మిమ్మిట్టి యవమానసాగరమున ద్రోసెను.

సాగ—కామినీ! ప్రతాపుఁడే నిండుసభయందు నాపట్టాభిషేకమునకు సమ్మతింపఁడా?

ప్రియ—అంతయు నాటకము. నాథా! యింతయోచింపఁజాలరా! దుర్గాదాసు గోపీనాథులు తప్ప నింకెవ్వరైన ప్రతాపుని సింహాసన మధిష్ఠింపుమని ప్రార్థించిరా! వారితో యోచించి, మీమోమునకు మసిఁబూసి, సామంతులకన్నుల మన్నుజల్లుటకై పన్నినతంత్రము కాని, నిక్కమని విశ్వసించితిరా? ఇంత యోచింపుఁడు. మీయగ్రజుఁడే దుర్గాదాసున కట్టిప్రోత్సాహాభయవాగ్దాన మొసంగకున్న మీతండ్రికాలమున నెందో మూలకొదిఁగి మీపాదసేవలభించునాఁ ని వేకరుచున్న యధమ దుర్గాదాసు మిమ్మిట్టి ఘోరతిరస్కారమై స్వరాజ్య పట్టాభిషిక్తులఁ జేయునా ?

సాగ—సతీమణీ ! నీవాక్యసరణిచే నిక్కముఁ దెలిసితి ! ఇఁక తెలిపెద మదీయసాహసవిక్రమోపాయ మహాజాలమును. తెలుపుము వైరశుద్ధికి మార్గమెయ్యదియో ? ఇంకేల నే నిందుండవలయు ? పరరాష్ట్ర

ముల యోధుఁడవై! క్రమక్రమముగ సమున్నతపదవి నంది మీాసలం దువ్వుచుండెద! వీరిమోము చూడనోప! బంధుగులలో నెల్ల నెక్కుఁడగు వానియందు చూపఁదగిన వైరమింతకంటె నింకేమి కావలయు?

ప్రమ—బాగున్నది. ఇంతకంటె మర్గాదాసు పరిచర్యయే మేలు? మీారీపురిఁ బాసిన శాత్రవులకుపీడవీడినట్లగు. తమ సమారంభమును విశృంఖలముగ జరుపుచు, మిమ్ము వెక్కిరించుచుందురు. మీారనుభవించు సంతాపమునకు మీారు వారికి దుర్ఘటక్రూరసంతాపము చేకూర్చి, పోఁగొట్టుకొన్న సింహాసనమును మరల సాధించినగదా పౌరుషము?

సాగ—అది సాధ్యమా?

ప్రమ—ఉపాయ వైఖరియున్న నంతయు సాధ్యమే!

సాగ—ఆయుపాయము నిరపాయమైయున్న నవశ్యము గ్రహించెద.

ప్రమ—అక్బరు ప్రభువుతో మైత్రిపాటించుట యుపాయమా? అపుడు మన కార్యమంతయు చక్కవడదా?

సాగ—అక్బరుపాదుషా నాశ్రయించుట యుపాయము కాదు. కాని కార్యమెట్లు చక్కవడఁగలదు?

ప్రమ—కార్యముచక్కవడక వక్రిపడునా? మేవాడుకుసుమదామము తనచరణముల నాశ్రయించిన వలదను వాఁడా అక్బరు?

సాగ—అక్కటా! కామినీ! దారుణకాలకూటమును పైత్యరోగమునకై మ్రింగుమనెదవే? మాయింటిముంగిటికల్పకమై, మాపూర్వికులకుపేటికాభూషణమై, యింతవఱకు మామకాభీష్టప్రదానమున వాసిగాంచిన చిత్తూరురాజ్యమును పరులపాలు చేయుమంటివా? నీవు రాజపుత్రవనితవు కావా? దేశాభిమాన, మాతృదేశానుపాలన, జన్మ

దేశభక్త్యాదులు నీయందీనాఁడట్టి పత్రిక యాభూతములయ్యెనా? క్షత్రియాంగనాపుత్రతేజము నీమనఃక్షేత్రమున తిరోభూతమయ్యెనా? ఎట్టి మాటలాడితివి? ఎట్టికర్ణకంటకవిషమవాక్సరణిని గుఱియించితివి? ఎట్టిఘోరమహాపాతకచింతనకు మనమున తావొసంగితివి?

ప్రమ—ఔను. నేనే మాతృదేశాభిమానమును మానితిని. నేనే దేశమాతను పరులపంచకుఁ దోసితిని. మీయన్న పాదుషాసైన్యములకు మేవాడునందలి ప్రజలనందఱిని బలిగొనఁగి దేశమాతను కాపాడుచున్నాఁడు. జన్మదేశమఁట? అభిమానమఁట? ఏమైనది మీజన్మదేశమునకు రోగము. ఇట్టిసోదరప్రేమలేని కిరాతకరాక్షసులచే దప్పి రాజనీతిధురంధరుఁడును, ధర్మమార్గ ప్రతిష్ఠాపనాచార్యుఁడును నగు నక్బరు సంతటిపుణ్యమూర్తి పరిపాలనమునకు సిద్ధమగుట దేశమాతకు క్షేమము కాదా? ఆవలమనమూరక విడతుమా? ఇంతకును మీజన్మదేశభూమి మీపాలనేయుండునుఁగదా?

సాగ—అక్బరుమనరాజ్యప్రభుత్వమును మనయింట నేకట్టునా?

ప్రమ—కట్టకున్న మనమాతనికి సాయము చేయుదుమా?

సాగ—స్వజనుల, స్వజాతి ధర్మంబుల, స్వవిక్రమగౌరవముల, నితరులపాదమూలమున విక్రయించి, దానివలన కలుగులాభమును నేపొందవలయునా?

ప్రమ—వలదు-పొందవలదు! ఇట్లేకాని వారు కట్టకడపటకను పూడ్పుటకు నియోగించినను తిరుగుచుందము, పగతురపాదసేవచేయుచు సవతితల్లికొడుకు పెట్టుపట్టెడంగిలన్నముకై, వారునియమించునను మనపైఁబడలేదని తిరుగుచుందము. తేపుదుర్గాదాను కాదు తుదకొక చండాలయువతికై తముచులకనఁజేసి వామపాదమున తన్నినను మమ్ము

కాదని యెడలు తెలుసుకొందము. ఇట్లుబ్రదుకుటకంటె చచ్చుటయే మేలు-మీరెట్లుసహించెదరోకాని___

సాగ___ పడతీ! నీవేలభీకరాగ్ని విస్ఫులింగముల గాలి విసరి రగుల్చుచున్నావు? ఇంచుక నీవూరకుండుము?

ప్రియ___అగ్నిగుండమధ్యమున నుపవేశించిన మీకువిస్ఫులింగము లొకలెక్కయా?

సాగ___ఔను-మదవతి! ఔను-నామానససంతాపము దావానలతనొందియుండ మాఱుచేయఁజాలకున్నాను, నీయుపాయము సమంచితమే; కాని, దానికై ద్రోహమొనర్పవలయుఁగదా? అందును నాయగ్రజునికి___

ప్రియ___అయ్యో! పాపమెంతవ్యసనము గుఱిస్మరించుచున్నారు. అగ్రజుఁడట; ఏమగ్రజుఁడు-అంత్యజుఁడు. మీయగ్రజుఁడేయైన పూజ్యుఁడగు మీతండ్రియానతి మీరుచుండెనా? మీమోమునకుమసి బూసి మిమ్ము సేవకులచరణదాస్యమున కునిచినవాని నగ్రజుఁడని యెట్లనెదరో నాకుసిగ్గగుచున్నది.

సాగ___మానినీ! సత్యము. అయిననతఁడట్టివాఁడైన నమాత్రమున మనమిట్టి నీచకార్యమునకు సమ్మతింపవలయునా?

ప్రియ___ఏదినీచము! అన్యులనాశ్రయించియైన మీశేముషీ పరిపాటిచే మీవైరులొనర్చిన యవమతికి ప్రతీకారమొనర్చుటయా? లేక పౌరుషంబంతయునట్టేటఁద్రోసి-అవమానమంతయు సహించిగ్రద్ద బ్రదికినట్లు బ్రదుకుటయా? చాణక్యునంతటిబీదపారుఁడు తనకాలికి తగిలిన దర్భపుఁడకను కాల్చిబూడిదచేసి, నీటఁగలిపి త్రావఁడా! ఆబడుగుబాపనికున్న పౌరుషము మీకు లేకున్న నేనేమిచేతును? నాదౌర్భాగ్యము ననవలయుఁగాక?

సాగ—అలనా! ననుపీడింపకుము. లోకమేనాకుసంతాపమయమై విజృంభించుచున్నది. ఇట్టిదశయందు నీవును ననునిరాకరించెదవా? రమ్ము! ఇంతసంతాపకారకుఁడగు నాప్రతాపుని ప్రతాప మాఱుపఱచి నాతాపమాఱుదు.

మ॥ అరిపాథోధిమునింగి, వైరజలను స్నాతుండనై, యీప్రతా
పరమాగ్రహము నొంచి, రాజ్యమణులన్ భావించి, రాదీసి సం
స్ఫురగర్వోన్నత తాపమార్చి, ప్రమదా భూషేందిరాలోలతన్
ధరచెన్నారెద! విక్రమించెద! లస త్పద్మాభలోకేక్షణా॥

ప్రమ—ఇపుడు మీరుపురుషవరేణ్యులు. మిమ్మవమానించిన వైరులక్లేశతల్లడమందుచుండ-మనమిరువురమును చూచుచు-చిత్తూరుసామ్రాజ్యముపాలించుచు- వారినిపరిహాసించుచు, బంగరుతూగుటుయ్యాలలో మనముడోలాసమాక్రీడనమొనర్చుచుండ-ప్రతాపుఁడు, దుర్గాదాసును నిరువైపులసపర్యలొనర్ప-వారిభార్యలు "దేవిగారేమిచేయుచున్నారు! దర్శింపసమయమా?" యని నాసేవకై కాచియుండ మనమంతిపురమున, సగాంభీర్య, సరాజస, సకోప, సవైభవదృష్టులతో వారినీక్షించుచు గ్రాలినఁగదా మీపౌరుషసాహసములు జగచ్ఛిరోరగ్నమున రంగారును? ఇందుదోషమేమున్నది? అక్బరునుండియైనను పితృశాసనమున బలాత్కారణమున చేసినవారగుదురు.

సాగ—అంతయే-ప్రమదా! నీయట్టి కృత్యవిదయైన సాధ్వీమణియుండఁగదా నాకిట్టి కృత్యవిచారకృతార్థతకలిగెను; ఇఁక ధన్యుఁడనైతి.

ప్రమ—ఒకధన్యతయేనా! ఇంకెంత కానున్నదో చూతురఁటలెండు-

(లోపల-అమరసింహుఁడు-పాటలోనిచరణము)

అదే! అమరసింహుఁడు వచ్చుచున్నట్లున్నది. వీనికిప్పటినుండియే దేశమాతస్తవము! స్వాతంత్ర్యము!!

(ప్రవేశము-అమరసింహుఁడు పాడుచు-అనుబంధము-౩)

అమ—పినతండ్రీ! అభివాదనములు!

ప్రమ—అమరసింహా! నీకు సమయాసమయములను, స్థలాస్థలములును లేవా ?

అమ—జననీ! యిదియసమయమా? నాకు ప్రతిదినమును మా పినతండ్రి యస్త్రవిద్య గఱపు సమయమియ్యది యేకదా ?

ప్రమ—ఇఁక నీకెట్టివిద్యల నేర్పుటకును నీపినతండ్రికి కాఁజాలదు, నీకన్నివిద్యలబోధింప వా దుర్గాదాసు లేఁడా?

సాగ—ఔను! అమరసింహా! ఔను! నీకన్నిటికిని యాదుర్గాదాసే యాచార్యుఁడు.

అమ—పితాజీ! యేల? యిది యుద్ధసమయమనియా? కానిమ్ము; నీకుకరుణకలిగినపుడు బోధింతువఁట లెమ్ము, పితాజీ! మరియొకమాట! ఉదయసింగ్ రాణా మొగలుసైన్యముల నెదుర్పలేక పిరికిపందవలె చిత్తూరువీడి పరువెత్తునపుడు నీవందుంటివా?

సాగ—ఏల?

అమ—నీవుండియు నతనికిబోధింపలేదా? దేహమశాశ్వతము. సుతదారాద్యాప్తవర్గంబంతయు స్థిరము కాదు. భాగ్యసంపదలన్నియు బుద్బుదప్రాయములు. క్షత్రియునకు కీర్తి యొక్కటియే స్థిరమని బోధింపఁజాలవైతివా. అయ్యో! ఆవీరాబాయిజననికున్న ధైర్యసాహసములలో నొక్కశతాంశమేని మాతాతగారికున్న మన జన్మదేశమున కిట్టిదుర్దశ కలిగియుండదుకదా?

మ॥ నృపహృద్వేది వెలింగి, దుష్టసమిధా నీకంబు వేగాల్చిలో
కపునీతామలధర్మముఁ బెనిచి, సత్కల్యాణముల్ గూర్చి, స్వ
ర్గపురానంద ఫలంబొసంగెడు మహా క్షాత్రాగ్ని చల్లారినన్
నృపులం బాతుఁడు లోకబాహిరుఁడు క్షోణీశుండు కానేర్చునే॥

అట్టి స్వార్థపరుని అట్టి దేశస్వాతంత్ర్యనాశకుని గర్భమునజనించిన మీకును పిఱికితనమును, దేశద్రోహదుశ్చింతనయు నుదయింపకుండుట ప్రశంసనీయముకదా?

సాగ—అమరసింహా—?

ప్రమ—చాలునిఁక నీయధిక ప్రసంగము. నాథా! పోవుదము రమ్ము?

(సాగర్జీ—ప్రమదలు నిష్క్రమణము)

అమ—అదేమిచిత్రమో కాని నాకును - యీజననికిని మొదటనుండియు సరిపడదు. నామాటయటుండ - మా సాగర్జీ పితాజి సైతము యీజననిమాటకు మాఱాడఁజాలఁడు.

(అనుబంధము - 3 లోనిచరణమునుపాడుచు - నిష్క్రమణము)

(యవనిక పడును)



# మేవాడు శౌర్యాగ్ని నాటకము.

## ప్రథమాంకము:—తృతీయరంగము.

---

కొమల్మేరు దుర్గసమీపారణ్యము

ప్రవేశము: రహీం—భైరామ్‌ఖానులు.

రహీ—భైరామ్‌ఖాన్! ఇంకనువారు రారైరి! ఇందేమైన నపోహాముండదుకదా?

భైరా—రహీంఖాన్! నీవుఖాన్‌ఖాన్ పుత్రుఁడవు. యువచక్రవర్తియగు సలీమునకు ప్రాణమిత్రుఁడవు, పాదుషాయాజ్ఞచే మేవాడు యుద్ధభారమంతయుఁ గైకొన్నశూరుఁడవు. నీయెదుట నే నసత్యమాడుదునా?

రహీ—అయిన రాణాబాయి గోగుండదుర్గమువీడి కొమల్మేరుకుఁబోవ నేల?

భైరా—ఆమెతండ్రి, మలయసింహుఁడు ప్రతాపునికికూర్చుసీనాని. తనకుమారి యొక్క తెరయే - యసహాయయై, అబంధుకయై యుండ నాతన్వినిప్రతాపునిసంరక్షణమునకొసంగివీరస్వర్గమలంకరించె! గోగుండదుర్గము మనవశమైనందున నాసతి కొమల్మేరుదుర్గమునకుఁ బోవుచునీమార్గమున రాఁగలదు.

రహీ—వచ్చిన మనకార్యమంతయు చక్కపడఁగలదు. సలీంయువచక్రవర్తియంతటివాఁ డామెపై ననురాగముసూచించుట

చోద్యము - అయిన మనమాతన్నిని సమ్మతింపఁజేయుటెట్లు? శాత్రవ వసితయైనను రాజపుత్రాంతఃపుర కామినిని నిర్బంధించితిమా మనప్రాణములకే అక్బరుపాదుషానుండి ముప్పు వాటిల్లఁగలదు.

బైరా—ఆవిషయమంతయు నాకప్పగింపుము.

(లోపల - పల్లకిబోయాలు - పాట)

అదే పల్లకివచ్చు ధ్వనియగుచున్నది. మఱుఁగుననుందము రమ్ము. (చాటునకుఁ బోవుదురు. ప్రవేశము పల్లకి - బోయలు - పాట - అను బంధము 4 తురకలు దీన్-దీన్ శబ్దముల వారిపైఁబడుదురు. బోయలు పల్లకిని విడచి పరువెత్తుదురు.)

బైరా—వెనుక నెవ్వరును లేరు. ఇదియే సమయము. సైనికులారా! మీరే పల్లకిని మోసికొని చనవలయు?

(ప్రవేశము - రాణాబాయి - పల్లకినుండి - ఖడ్గహస్తయై)

రాణా-

మ. ఎవఁడా రాజకులాధముం డెవఁడు? నా కే హీనుండు, క్రూరుండు నీ
భువి రాజన్య సతీవరాక్రమరుచిన్ కే వొల్పార కానంతు! ఆ
రవిసంతానరుచిన్ కనంగని డెదన్ కే రారండు మీ కాయువుల్
అవనిన్ తీరె! మదీయ ఖడ్గహతి మా కే హాత్మ్యంబు వే చూడుఁడీ॥

ఓరీ! మీరెవ్వరు? మము నిర్బంధింప కారణమేమి? అంతఃపుర కామినుల పరిభవింప నెంచిన మీ యధిపుఁ డెవ్వఁడు?

బైరా—యువతీ! నిన్ను నిర్బంధింపవచ్చినవారము కాము.

రాణా—అయ్యా! మిమ్ముఁ జూచిన మహమ్మదీయమతస్థులుగ కాన్పించుచున్నారు. అందుననతిగౌరవనీయకుటుంబమునకుఁ జేరిన వారుగ పొల్పారుచున్నారు; కాని, మీయుద్యమముమాత్ర మంతఃపు

రయోగ్యవనితా జనవిషయమున నించుక సంశయాస్పదముగనున్నది. మీరు పూజ్యమనస్కులయ్యు నిట్టి యనుచితస్థలమున కామినుల నిలుపునట్టి యనౌచిత్యోద్యమమునఁ బాత్రులగుట మిక్కిలి చోద్యముగనున్నది.

రహీం—(ముందరికివచ్చి) హరిణాక్షీ! నీయూహ మిక్కిలి సమంజసము. నేను అక్బరుసార్వభౌముని సచివనందనుఁడ కాని నీసంశయడోలిక నధిరోహింపఁ దగినవాఁడను కాను.

రాణా—పూజ్యచారిత్రా! అక్బరు మండలాధిపతి పరిపూత నామశ్రవణమాత్రముననే మదీయసంశయముదీరెను; కాని, యీ కార్యము మాత్రము మిక్కిలి ఘోరము. దీనికెయ్యది సమాధానము?

రహీం— కామినీమణీ! నేనిందేల దాపవలయు. ఢిల్లీయందలి నౌరోజాయుత్సవము నెఱుంగుదుఁగాదే? నీకు దానిదర్శనభాగ్యము చేకూర్చుటకై యే నేనీకార్యమొనర్చితి. ఔనన్చితిననేల నీవించుక సమ్మతించిన నీయపాంగావలోకమునకై, నీపాణిగ్రహణమునకై సలీంయువచక్రవర్తియంతటివాని నీపాదాక్రాంతునిఁ జేయువాఁడ.

రాణా—అయ్యో! యిదియా నీయుద్దేశము. నీవట్టివానికి త్రోవలఁగాచి తొయ్యలుల బలాత్కరించుట యా కార్యము! యువచక్రవర్తియైన మాత్రమున పరమపావనరసపుత్రకామినీమణి బలాత్కారమున కియ్యకొని, నీవుకోరినవానిని వరించునని తలఁచితివా? పాదుషాయాజ్ఞసైతము నీకుబుద్ధిఁగఱపదా?

రహీం—కామినీ! కలదు, లేదనివాదించుట కిది పేరంటము కాదు. నీసేవకులందఱు నీల్గిరి. మానిశితకరవాలపంజరమున మాచేకట్టఁబడితివి. మాశౌర్యదేవతానుగ్రహప్రాప్తవగు నిన్నే మొనర్పుటకును మాకు సంపూర్ణాధికారము కలదు. సమ్మతికాకున్న మాభాగ్యదేవతవోలె బలాత్కారమున్నదికదా! ఊరక నా వెంటవచ్చి భారతసా

ర్యభౌముఁడను ప్రేమింపుకోడలైన రాజ్యశ్రీ మాయింటి కోడలగునని నేనుం దేవచించితిఁగాదే? అరుదారు ప్రేమనందలం బెక్కెదవో? నిష్కంధకుతూహల తురుష్కభట కరాందోళన మెక్కెదవో? యొక్కమాట వచింపుము. వేగాధ లేల?

రాణా—ఏమీ! మహాతేజోవిభవమహనీయ మేవాడుసామ్రాజ్యధురంధరుండగు శ్రీప్రతాపసింహ రాణా పరిపాలనమునుండి, యమ్మహామహుని చెంతకుఁ బోవుచున్న నన్ను నిర్బంధించి బెదరింపసాగితివా? కానిమ్ము! నీవేమిచేయఁగలవో చూచెద? ఈ రాజపుత్రమానినీమణి కాదు, తత్పాదతలవిచూర్ణ తుచ్ఛపరాగంబునైన స్పృశింపకలవేమో చూచెద? క్షత్రియమానినీమణుల సహజసౌందర్య రామణీయకము లెట్లు జగద్విఖ్యాతములో, వారియప్రతిమాన శౌర్యమును నట్లే జగద్విఖ్యాతములనుట నెఱుంగవుగాఁబోలు?

రహీం—కలవాణీ! నీవీరసూక్తుల నాలకించుచు, మూర్తీభవించిన శౌర్యదేవతయో యన నలరారు, నీసాహసమునుఁజూచి సంతోషింపఁగలవాఁడు వేఱొకఁడున్నాఁడు. దానికియ్యది సమయమును కాదు. సురక్షితస్థానమునకుఁ జేరినపిదప నీయిచ్చవచ్చినరీతి యొనర్తువఁట లెమ్ము? ప్రకృతము మాత్రము పల్లకినధిరోహింపుము?

రాణా—ఓరీ! రమ్ము. నీకును నూరేండ్లు నిండినవి. చేతకరవాలమును, మనమున ధైర్యమును కలిగి కదనాధిదేవతవలె నున్న నాపరాక్రమమును చచ్చివీరస్వర్గమునకేగి, యందు దేవాంగనలకుఁ దెల్పుదువఁట రమ్ము?

రహీం—పలుగాకీ! ఇంకను నీపారుష్యము మానవా? అయిన నాయత్నము లేదు. సైనికులారా! బంధింపుఁడీ కల్మషవాదిని! సంకోచింపకుఁడు?

(తురకలు రాణాబాయిని సమీపింతురు)

రాణా—(ఖడ్గమును ద్రిప్పుచు) ఓరీ! భూమిపైజీవింపనెంచితిరేని దూరముగ నిలువుఁడు! (తురకలు వెనుకనుండి ఖడ్గమును తీసివేతురు.) నీచులారా! శూరాధములారా! మీరొకశూరులా! పిరికిపందలగుమరుఁగాక! మోసమున నొక్కయబల చేతిఖడ్గమును దీసితిరా? వీరులనియేల మీసలుదువ్వెదరు? మీరు సార్వభౌముని సైనికులేయైన నిట్టి నీచకృత్యమునకు బాల్పడుదురా! ఛీ! మీమోములఁజూడ పాతకము.

బైరా—సైనికులారా! యేలచూచెదరు? లెండు! బంధింపుఁడు!

(తురకలు పట్టుకొనవత్తురు)

రాణా—హా! దీనబంధో! అనాథరక్షకా! ప్రతాపసింహచంద్రా! మాంపాహి మాంపాహి—

(అనుబంధము ౫)

(లోపల-భయమువలదు-భయమువలదని-అందఱురిచ్చపడుదురు-రాణాబాయి మూర్ఛిల్లును-ప్రవేశము-ప్రతాపదుర్గాదాసులు సైనికసహాయులై)

ప్రతా—

మ॥ అరరే! మామకబాహుదుర్గపరిర క్షానందహార్మ్యానుసం
చరసౌఖ్యోన్నతమర్త్యకోటికలనా సన్నద్ధులెవ్వారు? ఆ
చరితాచారుల, మద్భుజంబుఁగని యు ద్ఘోషింపకీక్షించునే
ఖరహార్యక్షముఖాప్తి చీల్చిశిరముల్ ఖండింతు వేనిల్వుఁడీ॥

నీచాధములారా! అవాచ్యపాపకార్యములచే మేవాడుభూమిని మలినముగ నొనర్ప చనుదెంచితిరా? క్రూరతరానాథయువతీహింసకులారా! నిలచిన మీకాయువు తీరెనని భావింపుఁడు! దుర్గా! కడంగుమరివర్గసంహారమునకు-నీచాధములారా! యిదేవచ్చితిరి! (తురకలు పరు

వెత్తుదురు) దుర్గా! యీమదిరాయువతి కంతమున నింకను ప్రాణవాయువులున్నవో? లేవో?

దుర్గా—దేవా! ఈయువతి భయసంతోషాధిక్యములచే మూర్ఛిల్లినది; యిందెట్టియుపాయమును లేదు. దేవా! మనమహారాణ సింహాతకుని మోసమునఁ గాత్రివవత్సముఁ జేరిన రత్నస్తంభాధీశుని విషయము నారయుటకై పోయి, మరలి వచ్చుచో సమయమునకీమార్గమున నుండుటతటస్థించినందున నీతన్విని రక్షింపఁగల్గితిమి. కాని, లేకున్న నెట్టిప్రమాదము కలుగుచుండె? అక్బరుసార్వభౌముఁడు సైత మీవిషయమున నెంతశ్రమ గైకొనుచున్నను, ఖానిసఖిల్జీ వంశపరిపాలన కాలమునుండి ప్రవర్తిల్లు దుష్కృత్యము లొక్కనాఁడు నశియించునా? అయ్యో! భరతఖండ దుస్థితికి మహమ్మదీయులేఁగాక హైందవులును సాయమొనర్చుచున్న మనమేమి చేయఁగలము?

ప్రతా—దుర్గా! అదియుండనిమ్ము. ఈతురకలు మిక్కిలి పట్టుదలఁగలవారు. వారిసైన్య మనతిదూరముననే యుండవచ్చును. మరల వారువచ్చులోపల నీసాధ్వి నెట్లైన కొమల్మేరుఁ జేర్పవలయు. కావున సమీపముననున్న పల్లెకుబోయి బోయల పిలచికొనిరమ్ము. మనసైనికు లెందున్నవారో పరికింపుము?

దుర్గా—భాగ్యము. (నిష్క్రమణము)

ప్రతా—ఆహా! ఏమియీయిందువదనయందము! భూలోకమున యువతీసౌందర్యమంతయు, రామణీయకమంతయు, లావణ్యకాంతిపూరమంతయు, నొక్కచోఁ జేర్చి, లోకసమ్మోహనదేవతనుకొలచి యీయంగనాతిలకము నెమ్మేనున నావహించియుండునా; ఈతరుణీమణి యెవ్వరో?

మ॥ రతియో? భారతియో! మహేంద్రుసతియో? కాబ్జుమేల్నాతియో
సతియో; లోకవిమోహసంతతియొ సత్సౌందర్యమా కాంతయో
అతిలోకోత్తర యెవ్వరో? కనులకున్ సార్థక్యమే పారెగా
మతివిభ్రాంతమునయ్యె నీకలికితోఁ మాటాడనర్హుండనే.

॥ యీనగుమోము. భయమూర్ఛయందైనను. తనసోయగంబు మానక, కమలవిలాసమును నీటముంచి, సాటిని దాటి, తోటిబోటులకారాటము కల్పించి, తానుమూర్ఛను కన్నను, తనచేసితరుల శృంగారమూర్ఛను కాంచునట్లుచేయుచున్నది గదా! ఆహా! పరకాంతను పర్యాలోచింపక పరిపరివర్ణింపఁ జెల్లునే? పాపఫలకము కాదే? నాకార్యమేమి? మదీయప్రయత్నపరికరసమార్జనమేమి? నేనిపుడు సస్థానపరిభ్రమణ మొనర్చుటేమి. శాత్రవసేనాతటిచుటు నాయురముపై పారుచుండ, నేన ధీరమతివై కల్యాము నొందనో నే? అకటా! ఏదియెట్లున్నను? నీసంపూర్ణపూర్ణిమా సుధాకరవదనను కనులారఁగాంచియు వర్ణింపని మానవుని మానవత్వమెంతయు నిరర్థకము కాదే?

సీ॥ నిటలదేశంబున నటియించు ముంగురుల్
పంకేజచరభృంగ భ్రమను నీన
కోపారుణంబునౌ కోమలవదనంబు
వరకోకనదకాంతి వాదులాడ
అశ్రుసిక్తకపోల హారికజ్జలరేఖ
సకళంకశశినేక సక్కెమాడ
అధరోష్ఠగతబహు శాశ్రుబిందులు మౌక్తి
కయుతమాణిక్యరే ఖనునదల్ప

గీ॥ కోపరునిశ్వసనోత్పత త్కుచములలరు
విల్తుమోహనకలశముల్ విభుల హృదయ

మొగయుచందంబు వెలవనీ ♦ మగువఁగాంచి
సంతసించివర్ణింపని ♦ జనులుకలరె?

అదె కదలుచున్నది. పలుకరించెదఁగాక (ప్రకాశముగ) మానినీమణీ!

రాణా—(లేచిదూరమున నిలచి) ఆర్యా! నాకిట్లుప్రాణదానమున నస్తోకకృపనుఁజూపిన మహాత్ముని నామము వినఁగోరుట సాహసమగునా?

ప్రతా—మానినిమణీ! నాపేరేమని వచింతు?

మ॥ తనసామ్రాజ్యము నిల్పలేక మదిశాం ♦ తంబేదినున్నాఁడు; మ్లే
చ్ఛనవీనార్భటిమాతృదేశమును వెం ♦ చన్నేరకున్నాఁడు; నా
మనుజాధీశుల శత్రుపక్షచరులన్ ♦ భావించి త్రిప్పంగఁ జా
లనివాఁడన్ వినుమా ప్రతాపుఁడను పే ♦ ర్వాఁడన్ శశాంకాననా!

రాణా—అహా! నేనెంతబేలనైతిని? (ప్రకాశముగ) మహారాణాగారికింత శ్రమమొసంగినందుకు నేనెంతయు నపరాధినైయున్నదాన.

ప్రతా—కామినీ తిలకమా! ఇదియేఁగదా? ప్రభుపదమందిన ప్రతిమనుజుఁడును నొనర్పదగిన ధర్మము. అదిలేనిచో వాఁడు ప్రభువగునా? నాధర్మము నేఁజేసితి ఇందతిశయమేమున్నది? మదీయధర్మమునునైతము సత్వరముగ సమయమున నొనర్పకపోవుటకై నేనెంతయు క్షమాపణ వేడవలసియున్నది.

రాణా—మహారాణాజీ! యీభరతభూమికి కలిగిన కడగండ్లఁ బాపుటకై క్షోణినవతరించిన కమలానాధులుకదా మీరు? మీబాహుబలసమాశ్రయమున నేకదా? ధర్మపరిపాలనమును సాధ్వీజనరక్షణమును నింతవఱకు చక్కఁగజరుగుచున్నది?

ప్రతా—లలనా! ఇదియంతయు భవదవ్యాజప్రేమ సమాదరణము. కాని నాయపూర్వసామర్థ్య మేమియు లేదు అదియుండనిమ్ము.

మ॥ తరుణీ! యెవ్వతెవీవు? నిగుడగ నేకత్రిజాతకాంతుల్ వసి
సరసీపాళికిసిగ్గుఁబెంప తనువికే స్ఫార ప్రభాపూరముల్
మెఱుపున్నింపుల భ్రాంతినివ్వ ఁగనిలోకే మిత్రావళీహీనవై
తిరుగన్ బోలును నెంటిమై యువజనాకృత్తిన్ గూర్చి బింబాధరా.

నినుగాంచిన నుత్తమక్షత్రియాన్వయ సంజాతవని తెలియుచున్నది. నీగమ్యస్థాన మెయ్యదియని ప్రశ్నింపవచ్చునా?

రాణా—నేనుదయపురమునకుఁ బోవుచున్నాను. తామూహించినరీతి నేను క్షత్రియాన్వయమున నేజనించితిని.

ప్రతా—అందుదయపురమున సన్దర్శించుటచే కృతార్థమగు వస్తు వెయ్యది?

రాణా—అది నామానసమునందేయున్నది. దానినుండి సకల జగమున నిండియున్నది.

ప్రతా—ఉదయపురమున కార్యఫల మెదురుచూచుచుండ నీతురుష్కు లెదురించి నీయభిలషితమును కొనసాగించుటకంత రాయము గల్పించిరి కాఁబోలు?

రాణా—నా కార్యఫలము నాపురోభాగముననే వెలసియున్నది. దానికంత రాయము గల్పించువారెవరు? (లోపల జయ్ ప్రతాపసింహా రాణాకుజయ్ అని ధ్వని)

ప్రతా—అబలా! మామక సైనికులు నన్నన్వేషించుచున్నారు వారిని ప్రయాణసంసిద్ధులుగనొనర్చివచ్చెద. నీవిందేయుండుము.

(నిష్క్రమించును.)

### అనుబంధము 6

రాణా—అహా! ఈజగన్మోహన ప్రశాంతాకారుని, యీవిక్రమ
క్రమత్రివిక్రముని, పరలోకగుర్లోక మహాతేజోవిభవుని, నామనోపీఠ
నిలయదేవదేవుని, కనులారఁగాంచు భాగ్యముఁ గంటినిగా? అయారే?
ప్రతాపసింహనామము సార్థకముచుటకీతని భూభారవ్యగ్ర విశాల
భుజాక్షీమయే తార్కాణము. ఈనవీన నటరాజశేఖరుని ప్రతికదన
సదనమున వినోదించు శౌర్యశృంగారహాను వాలించుచంచరీకేక్షణాల
కు నీతనియాననము, క్షత్రియశూరాంగనా మణులకు మోహాఫలం
బొసంగుటకు కల్పవృక్షమై శత్రుకాననములనాశిల్లఁజేయు విషవృక్ష
మై ప్రభుమంత్రోత్సాహములని కేతనవృక్షమైయొప్పారుగాదె? ఈ
ప్రతాపవభోమణి సంభృతాంగసంగత క్షాత్రప్రభనుగాంచి హర్షిం
చి, మోహించి, వరించి, వామభాగాంచి తత్స్థానమున విక్రమలక్ష్మికి
బొసటగనిలచి. శాత్రవదీన భయదాభయదాననిపుణమైన యిమ్మేటి
సంగ్రామపండితు కరమందిన యిందునిభాననదేగదా లోకోన్నత
భాగ్యము.

సీ॥ ండుచందురుకందు | నిరసించు నెమ్మోము
సతులకు నాహ్లాద | సరణిబెంప
అరికేళినరిదేరు | నాజానుబాహువుల్
ఘనమహాపురుష ల | క్షణముఁదెలుప
కెందామరలగేరు | నందమౌక చుఁదోయి
చెలువు సామ్రాజ్యంపు | చిన్నెఁదెలుప
కొదమసింగముఁబోలె | కొమరారుపేరు రం
బలరువిక్రమలక్ష్మి | నట్టిచాట
గీ॥ అతివిశాలంబు ఫాలంబు | నతిశయిల్ల
లోకమోహనకందర్ప | లోలకళల

మిసిమిమీఱెడురా సుతుఁ గనసమ పాణి
నందు భాగ్యంబునా కెందుఁ గలరువకట॥

భళిరే? యిపుడే-మ్లేచ్ఛసేనాకాదంబినులదంభమణఁచియుంచుక విశ్రాంతిని గన్నయీప్రతాప మానసమునకు మామకానురాగవాహిని చేళ్ళంగారరుచిరోద్యానవిహారతను నభ్యర్థింతునా? ఈయింతి విన్నంతరంగమున నిరంతరము జీవితేశునిగ కోరియున్నదని నివేదింతునా? కటా! అది యెంతయు ప్రౌఢకామినికి స్వభావలాఘవము కాదా? అయిన వాత్రిలోకవిక్రముండును నన్నుఁ గాంచుచో తననయనవీక్షణప్రభలయందించుక ననురాగకిరణముల నుదయింపఁజేయుచుండెను. అయ్యది మదభీష్టకుసుమగుచ్ఛము నకునొక వికసనప్రకాశము కాదా?

(ప్రతాపుఁడు ప్రవేశము)

ప్రతా—అలివేణీ! నారాక తడవయ్యె. నను క్షమింపుము.

రాణా—ఆర్యా! నన్ను మీరు క్షమించు భాగ్యమునే కోరుచున్న దానఁగాక-మిమ్ము క్షమించు దాననా?

మ॥ ధరణీశాన్వయమౌళి! యొక్కసతి యూఁ దన్నన్నిల్పి పూజించుచున్
నిరతంబెవ్వని పాదసేవ తనకుఁ న్నిత్యాపవర్గంబుగా
పరదైవంబని గొల్చుచేడు ప్రియయుఁ బ్రారంభుఁడై తన్ను న
త్కరుణన్ బూనిక్షమించు భాగ్యముసుతాఁ గాంక్షింపదే భూవరా!

ప్రతా—(స్వ) ఆహా! యేమి యీమందగామిని సుందరవాక్యమరందబిందుసందోహము? గ్రోలఁగ్రోల తనివిదీరకున్నది. ఈవాక్యచిత్రమణిదర్పణమున ననేకభావప్రతిబింబములు ప్రతిబింబించుచున్నవి. (ప్రకా) కమలాక్షీ! నీవు నారతిప్రేమమంజరి కెంతయు జగదీశ్వరుఁడు సుస్థిరతనొసంగుఁగాక-అయిన నీవు దయపూరిఁ జేరుటయే కదా? కర్తవ్యము.

రాణా—అంతయేకాదు. అందుకర్తవ్యమును కలదు. అయిన నాకర్తవ్యము-తమదర్శనముచే-కృతార్థమైనదనియే చెప్పనొప్పు-అకృతార్థత...

ప్రీతా—మధురవాణీ ! ఏమూరకనీవాక్యసుధావృష్టినాపితివి ? నీకేదైన కొఱంతకలదా ?

రాణా—నాకొఱంత దీర్పఁగూరేసమర్థులు. నాకోర్కెలన్నియు మిమ్మేచేరియున్నవి.

ప్రీతా—అదేల ? నీకోరికఁదీర్ప నీపతి లేఁడా ?

రాణా—నాకన్నిటికిని ప్రకృతము మీరేకదా పతి-మీకంటె పతియెవ్వరు?

ప్రీతా—కందర్పవల్లరీ ! నేనే నీపతియని నీవు మనసారవచించుభాగ్యము-కంటినికదా యని వేనోళ్ళమన్మథునిఁగొనియాడెద! నేశ్రీజనవారాసివమునింగ్రోలఁజాలినసునియవ్యాజప్రేమవారాసినీదజాలకున్నాను. రాజనురాళాంగనకు యేరాజనుగాళము హృదయావాసమునఁగి, యెస్త్రీకానురాగమునఁబెంచునో, నారాజహంసమే భూపతిత్వమునకు కడుంగడుయోగ్యముకాదే ? ఢిల్లీసైన్యము లక్ష్యగుపాకుపా ప్రేరితములై, యీమేవాడుభూభాగంబునుముంచఁజనుదెంచుచున్నను, మనమున నధికప్రోత్సాహసుమములవెదఁజల్లురాజవని తావల్లరి సమాశ్రయీభూతయై వామభాగమలంకరించిన, యెట్టిశాతవసైన్యాతపంబునైనను యీప్రీతావపున్నాగము కనిష్ఠిశాఖాగ్రంబున నిలువరింపఁగలదని సమధికోత్సాహమున పలుకువాఁడ.

రాణా—అమూల్యాలికృమలత్న్మకి సైదోడుగనవనవకల్పానార నవనితాజనవశీకరణవాగ్దేవతిసైతము తమకు వశవర్తినియగుట మిగుల ప్రశంసనీయమే. కాని-అయిన-అనాథయైనయొక ముగ్ధయెడనా తమసరసచమత్కారాధికారమునకు తావు ?

ప్రతా—అళివేణీ! అయిన నిర్మలప్రేమోదయమైన నీహృదయమున యీప్రతాపునకు నివాసమొకింతేని లభింపదా?

రాణా—మహారాణా! తామేయిట్లు మాటాడనగునా? ధర్మపరిపాలన(దీక్ష)దీక్షవహించిన మీరేయిట్లు మాటాడిన నేనేమందును.

ప్రతా—బింబాధరా! మహారాణా యనియేల నన్ను సంబోధించెదవు? నవ్యమన్మథ మహాధనభావవిలాసమహారాజ్ఞివి నీవు కావా! నన్ను కృతార్థునిఁ జేయుటయే కదా నీమహారాజ్ఞీత్వమునకు సార్థకము?

రాణా—ఓ-మంచిసార్థకము-ఊరక పరిహాసమున కిట్లందురు గాక-తామేడ-నేనేడ?

ప్రతా—కీరవాణీ! నీవు నాహృదయమునందే యున్నదానవు-నేను—

రాణా—మీరు నాహృదయమునందే యున్నారనుట కేసందియము లేదు.

ప్రతా—అయిన ధన్యుఁడ? ఏదీ! నీకరగ్రహణమున నన్ను ధన్యునిఁ జేయుము

రాణా—ఆర్యా! మీసరసములకు వేయువందనములు—మహారాజుల ప్రేమలతాంకురములు క్షణకాలరామణీయకములు.

ప్రతా—మోహనాంగీ! నన్ను సామాన్యపురుషులలోఁ జేర్చితివా? నీయాన వచించెద-నిన్ను నాకూర్మిపత్నిగా గైకొందు. కాని, నవశిరీషకోమలాంగివగు నీకీమనోకాఠిన్య మెట్లుపట్టువడెనో?

చ॥ కలువలు కన్నుదోయి, మృదు కల్పకవల్లరి యంగరేఖయౌ;
తలిరులు పాదముల్; కుసుమ కాండముచూపు; సుధాంశుబింబమౌ
యలరెడుమోము; పల్కులమృతాంబులు, నన్నియుమార్దవంబునన్
నెలయుచునుండ నీదుమనం బెట్టుల కర్కశమయ్యెఁ గోమలీ

రాణా—మాటలకేమి లెండు! నిరాఘాటముగ కోటలుదాటును-

ప్రతా—అయిన నాప్రార్థననిరర్థకమేకదా! నీయిష్టము. నే బోయి మరలవచ్చెద-(అని పోఁబోవ)

రాణా—(అడ్డముపోయి) ప్రాణవల్లభా! కోపమా? నాయెడ కోపమా? నీకై కదా నే నింతదూరమే తెంచుట? ఈమలయసింహ పుత్రి నేఁడుగదా ధన్యయయ్యె.

ప్రతా—(రిచ్చవడి—దూరముననిలచి) చంద్రవదనా! నిక్కమా! నిక్కమా! నీవు మలయసింహానందినివా! నిక్కమా!!

రాణా—రాజేంద్రా! ఏలమలయసింహానందినినన్ను నింతవఱకు పూర్ణిమాసుధాకరునిమాడ్కి పూర్ణమోహారసంబు గుఱియించుచు, లోకోత్తరానురాగరసమనోహరంబగు నీనెమ్మోము నాకస్మికముగ ననేకవిచారసందేహసంభ్రమరసంబులఁ గుఱియించుచున్నది?

చ॥ ప్రణయముపొంగిరాదు; అనురాగము నిరికలెత్తబోదు; మో
మున దరహాసమొప్పదు; వి మోహారసంబు, నాకింత యేనియున్
మొనయదు; వీక్షణంబుల న మోఘకళోదయమొందరాదు; ఓ
మనుజవరేణ్యా! కారణ మి భావనదెల్పవె యిమ్మెవేడెదన్॥

వచింపుమా! వచింపుమా! దీనికి కారణమెయ్యది?

ప్రతా—కమలాక్షీ! ఏమియులేదు. ఏదియునులేదు. నేఁడంతయునులేదు. అదే-సూర్యుఁడుతన ప్రేమను విడనాడి కమలినీకాంతపై ననురాగమునుఁ దలఁపక నపరాంబుధిఁ జేరుచున్నాఁడు.

(ప్రవేశము-దుర్గాదాసు)

దురా—మహారాణాకు జయమగుగాక ! దేవా! పల్లకియును బోయలును సిద్ధముగ నున్నారు.

ప్రతా—దుర్గా ! మంచిసమయమునకే వచ్చితివి ? కామినీ మణీ ! లెమ్ము. ఈయందలము నధిరోహింపుము.

(రాణాబాయి పల్లకినెక్కును-అందఱు-నిష్క్రమింతురు)

ప్రథమాంకము-తురీయరంగము.

కొమల్మేరుదుర్గము-రాజాస్థానము.

ప్రతాప-దుర్గాదాసు-గోపీనాథశాస్త్రి-భామాసా-ఝూవాస్ రావ్-జయసింగ్-కమలాదాస్-సాగర్జీ-భవానీదాసులుందురు.

(అనుబంధము 7)

ప్రతా—శూరాగ్రేసరులారా ! దేశాభిమానైకవ్రతులారా!

సీ॥ రాజపుత్రస్థాన । రాజ్యసౌధంబును
మాభుజంబుల నిల్పు । మాన్యులార
సంగరావని దేవ । సందోహములనైన
సరకుసేయని శౌర్య । సారులార
జన్మదేశోద్ధార । జాతి ధర్మావన
కై ప్రాణమిచ్చు భూ । కాంతులార
మేవాడు స్వాతంత్ర్య । దేవతరక్షింప
దీక్షవహించిన । ధీరులార

గీ॥ శతశతాబ్దంబు నావెంట సంచరించి
కష్టసుఖములనరయుచు సఖ్యులుఖులార
నేఁడుచనుదెంచె మీశౌర్య నియతినెఱుప
సమయమియ్యదే సామంత చంద్రులార॥

ప్రకృతవిషయమింతయే యని యుపేక్షింపరాదు! పరమపవిత్రగుణాలవాలమై, పరిపూతరాజపుత్రశాసనకీర్తి చంద్రికాధవళితదిగంతమై, యీభూమండలంబున నేనెనలేనికీర్తి నిగడించిన యీమేవాడుభూమిదుష్కృతశాత్రవపాదతలస్పర్శనమున తనతేజమువాసియున్న పుత్రికులగోల్పోయి, కన్నకష్టములకులోనై, కన్నీరుమున్నీరై పార, స్వకీయతనూజపరిపాలనవిశ్లేషదుఃఖము పొంగి, వెల్లివిరిసి, వేలాతీతమై, తన్నుముంప, స్వరాజ్యస్వాతంత్ర్యములనంద ననవరతముచుమ్మల దీనదశావిలోల నేత్రముల గాంచుచుండుట మనమందఱము కన్నారఁగాంచుచున్నారము కదా! మును రఘురామచంద్రాదుల కరలాలనమున నిగమాగమకళాప్రౌఢిని, విపులసస్యవైభవకనకరత్నసమభివృద్ధిని, పావనసదాచారసంపత్సమృద్ధిని భారతదేశరాజపుత్రస్థాన తనయాశిరోమణి యనఁ పేరెన్నికఁగాంచి, విమలయశశ్చంద్రికనార్జించి, లోకోన్నత పదవి నలరారిన మేవాడుదేశజనని, యిపుడుదిక్కుచెడి, యస్మాదృశవీరశిఖామణుల నిజనందనులుగాఁ బడసియు, దరిలేనిదుఃఖమునకులోనై యుండ గాంచి, యుపేక్షించి తూష్ణీంభావమందిన, మనముపుత్రికులమగుదుమే. కన్నతల్లికష్టములఁ బాపలేనిపుత్రికు లొకపుత్రికులే? మహమ్మదీయులు భారతదేశమున జనించినందున మనకుసోదరులైనను మనతోఁగలసి మెలసి కమనీయసౌహార్ద భావమొందక, మతకలహములఁ బరామర్శించి, పరరాజ్యసమాక్రమణ కాంక్షచే, సోదరభావమును దూరీకరించి, శస్త్రధారాసంపత్తియే సకలార్థసాధకంబని యెంచి, మనపై స్వవిక్రమ జ్వలనజ్వాలాకలాపముల పరగించి, మనజన్మరత్నరాజికి నెలవై, సకల

కళానముదయమున శాకరసై, చూసరుల కరివర్గమునకు సుర్నిరీక్ష్య ప్రభాప్రతాపముల ప్రభాసించునీచిత్తూరు రాజ్యమును సుప్రోత్తుంగ మిగ్రింగ చనుదెంచుట యెట్టి ఘోర కార్యక్రియణమో మీరే యోచింపుఁడు. అక్బరుసార్వభౌముఁడు విఖ్యాతమాన రాజనీతివిశారదుఁడై, నిరంతర కరుణాతరంగిత నిజహృదయ పరిపాలిత ప్రజాసందోహుఁడై, సర్వమత నిష్పక్షపాత భూషితుఁడై, భారతదేశమునకే, ఖండాంతరములనైతము స్వకీయ పరిపాలనమునకే, స్వకీయ పరిపాలనమున వెన లేని కీర్తి నిగడించిగా మిదార్భాగ్యవిశేషమో కాని, రాజ్యకాంక్షా బాధితుఁడై, మనకన్న తల్లిపై, మన జన్మభూమిపై నిజమాతృవీక్షణ ప్రసరణదవాగ్ని నెదఁగ్రొలుచున్నను, నదేల్చుచున్నాఁడు. నేఁడో, రేపో, మనకిప్పుడు సమాశ్రయసౌఖ్యమిచ్చి, సర్వదుఃఖములనడంచి బ్రోచుచు మిగిలిన యీశాంతమల్లేరు మార్గముసై తము శాత్రవకఠిన పాదతలవిచూర్ణితమైపోవుచున్న దనిచింతించుటకే నెంతయు చింతించుచున్నాఁడ. రాజపుత్రవీరాగ్రేసరులారా! దేశభక్తి ధురంధరులారా! నేఁడు మనకీర్తి ప్రాణమానధనములు మీచేనున్నవి.

చ॥ ఘనతరవిక్రమంబెనయ శ్రీగా రిపుపాళివిడల్చి దేశమా
తను మనుపన్ హితంబొ? రిపు కే దాస్యము కోరి ధరిత్రి నీచులై
మనుటహితంబొ? సంగరస కే మస్త విహారము సల్పి శత్రులా
నన ఘనకీర్తి దేహముల కే నాకసుఖంబులనందుటొప్పునో
మనమున నెంచి కార్యగతి కే మానక చెల్పరే? కీర్తిఁ బెంపరే॥

చక్కఁగ నాలోచింపుఁడు. సమయమొదవినతరి క్షత్రియులకుఁ దాంచిత ధర్మమును బాయకుఁడు. అజస్రమానస వేదికా ప్రజ్వలిష్యమాణ రాజభక్తి మహాధనంబును బాయకుఁడు. రాజభక్తి యే సకలార్థసాధకం బనియు, మాతృదేశభక్తి సమస్త పురుషార్థదాయకం బొక్కటియే గాక యిహపరార్థసాధకం బనియు చింతింపుఁడు. కమనీయతర కటిస్థలవిరాజ

మానకరవాలభుజయుగ్మ విలాసాయుధముల నెడవించుకంతయు ఉపేక్షింపకుఁడు. లేక మీమీయాశయముల వచింపుఁడు.

గోప—భూపాలచూడామణీ! రజపుత్రవీరాగ్రేసరులారా! ఈయుద్ధము మేవాడు ప్రాణానిలముల గ్రోలచనుదెంచిన కాలభుజంగము కాని విజయలక్ష్మినిచేకూర్చు విజయమాహాత్మ్యము కాదనుట నే నెఱుంగుదు. అయినంతమాత్రమున, రజపుత్రులకుగ్గుతో బుట్టిన శౌర్యమును నీటఁగలిపి, ఎరవజంబుకములవోలె, పగతుర పాదముల పంచఁబడి జీవింపవలయునని చెప్పువాఁడను గాను. వారుచూడనుంచి కాలముదెంచువఱకు. సింధునదిని దాటి హిమవత్ప్రాంతారణ్యముల నివసించుట మేలని తోఁచుచున్నది. శాత్రవులీ దుర్గమునేసాధింతురు గాక? చిత్తూరు రాజ్యమునే యాక్రమింతురుఁగాక? దానికంతయు మనమంగీకరింపవలసియున్నది. పూర్వము హిరణ్యకశిపు రావణాదుల పొలివుచ్చుటకై యాశ్రీహరి యెంత కాలము నిరీక్షింపలేదు? సామంతచంద్రులారా! చక్కఁగ యోచింపుఁడు. ఒక్క మేవాడేల, రాజపుత్రస్థానమును, రాజపుత్రశౌర్యాగ్నియు, భారతీయశౌర్యధైర్యదేశభక్తులును మీయాధారముపై నాధారపడియున్నవి. రజపుత్రులకేఁ గాక, భరతఖండమున పుట్టినవారికిని, పుట్టనున్నవారికిని నిదర్శనప్రాయులు కాఁగలరు. ఉన్నవిషయముల వచించినాఁడ. వానిఁగైకొనుటయును నిరసించుటయును మీచేనున్నవి.

ప్రతా—గురువర్యా! మీయాశయము మిగులసంస్తవనీయము.

భామా—రాజపురందరా! భవదాజ్ఞాపిత విషయమును మే మేతావకీనచరణపరిసరమున విన్నవింపవలయునని యుంటిమి. అద్దానివిని తామేమనఁగోరుట మ్రొక్కఁబోయిన దేవుఁడెదురువచ్చినట్లయ్యె. ప్రకృతస్థితి యెంతయు శోచనీయము. మనతో డిల్లీసార్వభౌముఁడు వైరమూ

మట్టి, సింగంబు మార్జాలమును పొదివినట్లయ్యె. అనేకాక్షౌహిణీసేనా సమేతుఁడగు అక్బరుసార్వభౌముఁ డేడ? కొలందిపల్లియులు మాత్రము శేషించిన యీ మేవాడు నేలు మనమేఁడ?

శా॥ భీమాటోప విజృంభితానల శిఖాళీధిన్ తృణౌఘంబు, న
ద్ధాహాహంకృతిమార్గ్యనన్ గనరనే? దర్పోద్ధతాక్షౌహిణీ
సేనుండక్బరదేడ? పల్లియులనార్తిన్ బ్రోచుమేమేడ; ఓ
భూమీశా! వలదిట్టియుద్ధమఖమున్ పోద్రోసి రక్షింపవే॥

అయినను నింతవఱకు క్షత్రియధర్మమూని, వైరివర్గములు మెచ్చ, సంగ్రామమొనర్చితిమి "హల్దిఘాటు" యుద్ధమున మనకపజయము వాటిల్లినను జగంబులకచ్చెరువు కల్పించి, యితరులార్జింపనేరని సనుగ్రియశమును సంపాదించితిమి! కానిసైన్యమంతయు నాశనమయ్యె. జయమన్న గగనకుసుమాయమానమయ్యె. కావున యుద్ధసమారంభ సాహసము నిరర్థకసాధ్యము. రాజనీతిననుసరించి గొప్పవారితో సంధికియ్యకొనుటయే ప్రకృతము మనకొప్పిన పనియని మదీయాభిప్రాయము.

ప్రతా—భామాసా! నీయభిప్రాయము వింటిని. ఇఁక చాలును. ఝూనాన్ రావ్! నీయభిప్రాయమేమి?

ఝూనా—దేవా! సమంచిత ప్రీతిభావిశేషమున నాదేవగురునకైన మంతనము నుద్బోధింపఁ జాలు తాము, మామకాశయమును వినఁగోరుట నాయందలి పరిపూర్ణాంతఃకరుణాభావ మహిమమున కాని వేఱు కాదు. అయినను భవచ్ఛాసనబలసముదీర్ణ వాక్యరసణి వాపఁజాలక నించుక విన్నవించెద. భీమసంగరభీరుత్వము శూరకోటికెంతయు ననర్హమని నాకునుఁ దెలియని విషయము కాదు. అయిన దేశకాలముల నారసి తారతమ్యములవిచారించికదా మనమే కార్యక్రమమునకైనను ప్రక్రమిం

వలయు? మనవాహినులు శాత్రవులతో నొక్కరీతిగఁ బోరాడి వీరస్వర్గమలంకరించె. శేషించినవీరయోధులందఱును, డస్సి, గాయములచే కాయములు పాయునివేదనా ధీనతనంద నతిభారముగ మోసికొని ప్రాణమాత్రావశిష్టులై యున్నవారు. కావుననిఁక మనకును జయసిద్ధికిని స్వర్గనరకములకున్నంతదూరము, ఇట్టిజయసిద్ధిలేని యుద్ధమునకు ప్రాణములనర్పించుటకంటె సంధియే వశికృతకరణీయమని నాకునుఁ దోఁచుచున్నది.

ప్రతా—ఝూవాన్‌రావ్! ఇదియా నీయభిప్రాయము? కాని మ్ము. సాగర్జీ! వశికృతవిషయమున నీనిర్ధారణమాకు తోడ్పడదా?

సాగ—మేవాడురమానాథా! ఈవిషయమున నేచక్కఁగ నాలోచించి నిర్ధారమునకువచ్చినాఁడ. శాత్రవదురాగతాపమానముల సైచిచేత కానియబలలవలెనూరకుంగుటకె శిశోదియావంశమున కీయపయశము చేకూర్చినట్లు—కావున వైరివినాశనవ్రతదీక్ష యవశ్యాకరణీయము, దానికి యుద్ధమవశ్యకరణీయము. లాభము చేకూర్చు సంధికి సమ్మతించు కాలము సమకూరినను సమంజసమే.

చ॥ రణమును కార్యమేయగును; రాజితసంధియు కార్యమేయగున్
రణమున కొంతదోషమును రంజిలు; సంధినికొంతదోషముగా
మొనయును, సంధియుద్ధముల మోఘగుణోజ్వలదోషయుక్తముల్
మనుజవరేణ్యా! యుద్ధహితమార్గమె యెంచియొనర్పవే జిదన్॥

మేవాడు రక్షణమహాకార్యము మాత్రము మనకవశ్యకరణీయము—ఇదియే నాయాశయము.

ప్రతా—మిక్కిలి సమంజసము జయసింగ్ యిందు నీమానస వితర్కమేపై పు రాజిల్లుచున్నది.

జయ—ప్రతాపసింహచంద్రా! నాయభిప్రాయమేమనివచింతు?

నామానసము డోలాందోళనమువోలె నీవైపు నావైపును తూఁగాడుచు ప్రాలుచున్నది. ఒకరీతినాలోచింప సముద్రతరంగములవలె పైపై వఱతెంచు శాత్రవచమూసందోహములు మన జన్మభూమిని ముంచుచున్నభంగి మహాదారుణమై, దుస్సహమైయున్నది. మఱియొకరీతి విమర్శింప స్వదేశగౌరవస్వాతంత్ర్యములు నశించుట కోర్వఁజాలక రణరంగమున శాత్రవుల చక్కాడి మేవాడును వీరసూమతల్లిఁ జేయుదమాయనియుఁ దోఁచుచున్నది. ఇన్నిదినంబులు మనము కాపాడిన స్వదేశవిద్యాకీర్తిధర్మంబుల పగతురకమ్ముకొనవలయునో? లేక, మనప్రాణములుండువఱకు పరిపంథుల కసిదీరఁ జక్కాడి, వీరవిహారము సలిపి రాజపుత్రదేహరక్తముచే కదనభూమికభిషేక మొనర్చి, స్వకీయమాంసకబళోపహారముల నొసంగి జగన్నుతమైన సత్కీర్తినందవలయునో? సార్వభౌములే నిర్ధరింపవలయునని వేడువాఁడ.

ప్రతా—జయసింగ్! మెచ్చితి నీవీరధర్మమునకు! భవానీదాస్! నీవేమందువు?

భవా—రాజేంద్రా! మదాశయవచనము సింహాసనపూజ్యమానసకమలమున కేమి వెగటుఁదోఁచునోయను సందేహము సమాక్రాంతచిత్తతయొప్పారుచున్నది. సమయము తటస్థించినతరి మిన్నకుండుట ప్రతిభావంతుని లక్షణము కాదు. కాన విన్నవించెద. ఏతావత్కాలపర్యంతము కదనమహార్ణవము నీద నుపక్రమించుటయేమనయువిచాగసంజాతావివేకభావమని వచించుటకు క్షమింపవలయు. వాచాళులగు కొందఱు విమూఢమంత్రాలోచకులఁగైకొని మహారాణాగారు రాజనీతివిరుద్ధయుద్ధోపక్రమణమున కియ్యకొనుట మూర్జాలసంతతిని మహోపహాస్యసంచయమని నమ్మినట్లయ్యె.

మ॥ ఘనమా కొండను త్రవ్వి, మూషకము నొక్కట పట్టుచందాన మా
కని సేయన్ ఫలమేమి? రాజతనయా బ్జాళిన్ సమర్పించి వే
చను బాంధవ్యము సేయు జోధపురరా జన్యాదులందెందఱో
కనరే దివ్యపథంబులో యధిప సం గ్రామంబు వేమాన్పవే॥

జయపూర్ జోధ్పూర్ మార్వారు సంస్థానాధీశులకన్న నీయుపదేశకులును మనమును నుచ్ఛ్రైఃపదముల విఱ్ఱవీగువారమా? వీరందఱతిశయాపరరమావల్లభుఁడన నలరారు నక్బరు మండలాధిపతితో ప్రేమలతావిజృంభితసంబంధ బాంధవ్యముల నలిపి సముంచిత సుధర్మసభను సైతము నిరసించు సభనలంకరించి మహావైభవవిభవులై, పరమానందసుధాఝురీవారమునఁ దేలుచు మనశిరములఁదన్నినట్లుండ లేదా మనము రణమొనర్చి, పరాజయమొంది స్వకీయజన్మదేశ రామామణినే లగోల్పోవలయు? కష్టములనుభవింపవలయు? నాఁడు మనము సార్వభౌమునకు అండియగు మానసింహుని సహాంజేత్ర్యయుని గ భావించినందునఁ గదా మనసేనల ప్రజలయుద్ధావనికి బలియొసంగి మనముకన్నయిఱుములఁ బడుచుండుట? సంధికిసమ్మతించితిమను నైదక్షరముల నుచ్చరించిన మాత్రమున మనదేశము పూర్వాధిక వైభవము నలరారఁగలదని ఢిల్లీశుఁడు వచింపఁడా? అదియునుఁగాక, సర్వజనానురంజనసమాన ప్రేమసమాలింగన మతవైషమ్యవిసర్జనాది లోకోద్ధారక ధర్మసంచయముల నుద్ధరించినవారమగుదుము. మనమందఱము నెదపైఁ జేయిడి నిదురింపవచ్చును. ఇదియే మామక నిరుపాధిక - నిరపాయక - నిస్తులసుఖదాయకమగు నాశయము.

ప్రతా — భవానీ! రాజపుత్రరక్తమునందలి క్షాత్రతేజోరేణువులు నేఁడునీరయ్యెనా? శ్రోత్రములారా! మీరుమిన్నకుండుఁడు. కమలాదాస్! భవత్సమ్మతని వెల్లడించి కృత్యమునుద్బోధింపవా?

కమ.—మహారాణా! ఏయాయాసమును లేక నగరంబరిమార్చు పరమోత్సవము సమకూరుచుండ నిరవధికశతధార చేకునూమదశమునుం గోయనెంచుట సెంతటియవజ్ఞతయో యోచింపుఁడు!

చ॥ కరతలకల్పకంబు నవ । గౌరవధిక్కృతి జేసినట్లు న
గ్బరువిభుకోటి బాంధవ । మహాస్త్రముఁ జేసెడి వెఱ్ఱిగల్గునే,
యరయనిమూర్ఖులన్ గలఁచి । యబ్బినస్వర్గము నట్టెద్రోసి నే
కరుణదలంపవే సమర । కర్మముమానిప్రతాపభూవరా!

అఖిలరాజమానసింహుఁడైనమానసింహుఁడుతనసోదరిని అక్బరునకర్ధాంగి గా నొసర్చినందున రెండవచక్రవర్తియన నెంతయునలరారుచున్నాఁడు. మనవారికందఱికిని సార్వభౌమప్రసాదజనక బాంధవ్యకరణమహోత్సవముఁ జేకూర్చిన,నస్మదీయదేశ పాలన వ్రతదీక్ష మనకులభించు. మనస్వాతంత్ర్యశైలము చలింపదు. మహారాజప్రేమభాసుర దృష్టిపాత సత్కీర్తియు మనకులభించును. కీర్తియొక్కటియేఁగాక నానారాజన్య ప్రాణసంజీవనపుణ్యమును మనకులభించును. ఇంతకంటె సేవచింపవలసినదే మున్నది?

ప్రతా.—శంకరీ! హైమవతీ! నేఁడెట్టిదుర్దినము! దుర్గాదాస్!

దుర్గా.—దేవా! ఈరాజపుత్రులందఱును చేతకానియబలల చందమున, వీరక్షత్రియకోటి కలయందైనఁదలంపరాని భీతిఁ గొని, నీచవృత్తిఁ గిలోనై, పగతురపాదములపైఁబడి జీవింపయత్నించియున్నవారు! అంతటఁజాలక శాత్రవులతో సంబంధబాంధవ్యములు సలుపవలయునఁట! తమపడచుల వారికప్పగించి, యప్పుడుపుకూడుభుజించి బ్రతుకుట కియ్యకొనవలయునఁట! ఇది రాజనీత్యనుసరణమఁట! ఇంతకన్న శాత్రవులతో పోరుట హీనకార్యమఁట! అక్కటా! వీరాధివీరక్షత్రియ వీరులని తలంచియుంటిమి కాని, వీరు కన్నబిడ్డల కన్నవారికిచ్చి కడుపు నమ్ముకొని జీవించుకఠినకిరాతకులని తెలియమైతిమి! దేవా! వీరి నేలనభిప్రాయమడిగెదరు? వీరిష్టమువచ్చినట్లు కన్నకూడు కుడుతురుఁగాక! మేవాడుమాత శాత్రవపాదతలస్పర్శమున తల్లడిల్లువఱకు, రాజపుత్ర

యోధవరులచేత కరవాలముందువఱకు మొగులకు లొంగనౌనే? అక్బరగు
గాక - ఆయుభవుఁడగుఁగాక! నిజఖడ్గధారఁ డీలువుచ్చి, యరివర్గముల రక్త
ధారలు వెల్లువలై పాఱఁజేసి, వారిశిరంబులు మేవాడుభూమికర్పించి,
మరల చిత్తూరుదుర్గమును విజయలక్ష్మినివాసస్థానముగ నొనర్తము.
లేకున్న నిజప్రతాపమార్తాండుని సమరభూమి నెనయించి, స్త్రీజన
ముల నగ్నికర్పించి పరాక్రమైకగమ్యమగు వీరస్వర్గమైనఁ జేకొందము.

ప్రతా — భళిరే! దుర్గాదాస్! నీవాదుర్గాదాసువే యగుదువు!
రాజపుత్రవీరులారా! మీవలన నేఁడిట్టిమాటలు విననౌనని నే కలయం
దైన నెఱుంగ! మీరింతటి యుద్ధభీరువులై, యింతటియనదలై, యింతటి
నీచవృత్తులై, యింతటిదేశద్రోహులై జీవింపఁగోరుదురే? ఊరకగాజులు
దొడఁగికొని మీయిండ్లయందున్న మిమ్ము నేమాటాడింపనుఁగదా!
మాతృదేశసాక్షిగ నవాచ్యనీచతరమాతృద్రోహసల్లాపముల నాడిన
మిమ్ముఁగాంచుటచే వీరక్షత్రియజన్మమే యపకీర్తిపాలయ్యె! హీనక్ష
త్రియులారా! పొండు! నాయెదుటనిలువక! కలియుఁడు తురకలతో!
దుర్గా! గైకొమ్ము! కరవాలకాండకాండాసనముల! సంశయింపక! భీతి
చెందక! కన్నులఁగాంచిన ఘనతరప్రధనకర్కశ పరిపంథివాహినీతరం
గిణుల నిజవిక్రమమార్తాండువేడిమిచే, పొడిమియడఁగించి, వాడిమఁగ
లమై, మముఁగాంచిపెంచిన మేవాడుమతల్లిని వీరసూమతల్లిఁగఁ జేయు
దము. విచ్చలవిడిచెలరేగిన మత్త ద్విరదము పేముల్లసత్కాంతనాళముల
ఖండించువగిది శాత్రవమస్తిష్కముల ఖండించి, జగతినిర్నామమై
పోవుచున్న క్షాత్రశౌర్యవృక్షమును భూమినంకురింపఁజేయుదము; హృ
దయమా! పరాక్రమలక్ష్మిక్రీడానిలయమా! అభిమానమూర్తి, గోబ్రా
హ్మణ దేశరక్షణ పక్షపాతివై, నీశరీరమును తృణప్రాయముగ నెంచి,
సిద్ధమై, నిరుపమానమై, నిరంతరవీరవర్గ సంస్తవనీయమైన వీరలక్ష్మి
ప్రముదవిలాసంబునంది శాత్రవమదానిలగ్రసన మహాయజ్ఞంబునకు
దీక్షాకంకణము ధరింపుము. రాజపుత్రవీరులారా! ఇదే నాశపథమా

లకింపుఁడు! నేను ప్రతిపక్షపక్షవిదారణ మహాయజ్ఞదీక్ష నిర్వహించు
వఱకు, అరికంధరమాలాసందోహముల విజయలక్ష్మికి నర్పించువఱకు,
మాతృదేశమునకు స్వాతంత్ర్యమనన్యసామాన్యప్రక్రియ చెలరేఁగు
వఱకుఁ రాజభోగంబుల నాశింపను. సువర్ణపాత్రభోజనపక్వాన్నభోజ
నాదుల నాశింపను.

మ॥ అరిసందోహ శిరంబులాజి నతిగ్రీవాలంకృతిన్ గూర్చుదా
క, రణోర్విన్ రుధిరాంబువాహినులు పీకన్ పారునందాక! నీ
వరమేవాడపురంధ్రిమాకెందువిమల స్వాతంత్ర్యమొప్పారుదా
కరహీన్ మానెదభోగముల్! విడెద సౌఖ్యాంబింక సత్యాసిసై!

భవానీ! శర్వాణీ! త్రిపురసంహారిణీ! నీకు సేఁజేయుకార్యము మదికెక్క
యున్న - నీదివ్యశాసనసామ్రాజ్యమున శాత్రవుల నురుమాడుటయు సనాతన
ధర్మపరిపాలనమును నిష్టమైయున్న రాజస్థాన తనయామణియగు
నీమేవాడనుకాపాడ నీకరుణావిలాసముల నొక్కచో నొక్క వర్షా
ణించి పుత్రదారాద్యభిమాన విషవల్లీకదంబమును నాయుండి తొలంగిం
పుము. మదీయహృదయ కనకపీఠమున శుంభనిశుంభాసురసంహా
కాలమున చూపరులచూపులు మిఱుమిట్లుగొలుపు నీరౌద్రరసమహి
మాంచితరూపమును నెల్లవేళల నెల్లదిశల విలసిల్లునట్లు చేయుము.
రాజపుత్ర భవ్యశౌర్య మహామహిమాంచిత రక్తమునజనించిన దేశ
భక్తిపరాయణ సంసిద్ధులగు శూరజనవతంసములారా! రండు! మన
మాతృభూమిని రక్షింప! హీనదాస్య మాతృవిక్రయ కిరాతక
రక్తమునజనించిన స్వధర్మవిక్రేతలగు రాజపుత్రకులపాంసనాధము
లారా! పొండు తురకలతోకలసి దేశస్వాతంత్ర్యసమున్నతలక్ష్మినిర్దగ్ధ
మొనర్పు! జయ్ - భవాని-

(అందఱు - జయ్‌భవానీ-యని కరవాలముల నెత్తి విన
మ్రిలగుదురు.)

(యవనిక పడును.)

శ్రీ

# మేవాడుశౌర్యాగ్ని నాటకము.

ద్వితీయాంకము—ప్రథమరంగము.



కొమల్మేరు దుర్గమునందలి రాజనగరు రాణాబాయి కూర్చొని యుండును. (అనుబంధము 8.)

రాణా—దీని నేమనవలయు? ఇదిమోహామా? లేక వనమాన మోహావిలాసమున కలిగినలజ్జాభరమా? అది యుఁగాకున్న నుభయపక్షముల డోలాందోళనము వోలె రాజిల్లుచున్న మానససందేహమా?

సీ॥ ప్రేమరసస్ఫూర్తి । మోము మోమునఁజేర్ప
మతినెంచి వెనుదీయు । గతమదేమొ
ఆదరాహ్లాదమో । దానురంజితనేత్ర
వీక్షణల్ అటునిల్వ । హేతువేమొ
గాఢసమాశ్లేష । కౌతుకభావముల్
రహినట్టెనిల్వ కా । రణమదేమొ
వాక్యసుధాధార । ప్రాణేశ్వరియనిబి
ల్వకనంత విరమింప । భావమేమొ

గీ॥ మలయసింహాసదంబింత । విలయలీల
కనఁగ గతమేమొ? వితమేమొ? । కతయదేమొ
వెతలు కనునేమొ మతియేమొ । వేడ్కయేమొ
ఏమొ యేమన్న నాగతి । యేమొ? యేమొ?

మొన్నఁగదా మన్మనోనాథుని ప్రతాపుని మోహాంకుర ప్రీతిభాసకములై, మామక మానసానందకరములగు పల్కుల నాలించితిని, మా తండ్రియుదంతము నెఱిఁగి, నా యేకాకినీత్వమును స్మరింపక నేవలచినది యేరత్నమనియు, నేకామించినదియే మహాభాగ్యకల్పతరువనియు నెంచి నాప్రతాపేంద్రు కరగ్రహణమున కుంకింప “మాజనకుఁడు మలయసింహుఁడు” అన్నమాట విన్నంతోడనె యారాణా యుచ్చరుపాటొందనేల? నను సంశయింపనేల? అంతట తనయనురాగమాలతీలతను వెనుఁద్రిప్పనేల? ఇందేమో యనర్థమున్నది? అహటా! యాకరుణామయుని కరుణాపూర్ణకటాక్షములుం ప్రేమరసవాహంబులై, నను ప్రార్థించుచో దైన్యరసఝరీవాహంబులై, నామాటల నాలించునపుడు నన్నుసైతము స్వకీయానురాగ మహారసంబున ముంచుటకై వన్నినవటుతర జాలవిసరంబులై, అచిరములై, అచిరవిలాసములై, చిరమానసశోషణములై, అచిరానంద ప్రోహదములై,యెప్పారెఁగా? నాకెంతయు మెప్పారెఁగా! ఆచోప్పారయుమిచే నేనిప్పుడప్పరమపురుషు రాకకై యెదురు చూచుచున్నదాన. ఇదియే మనుదాన! ఏమనక యుండిన నా భాగ్యమెట్లగునోయనుదాన! చూచినచూడనిభంగియు, చూడకున్న నెప్పుడు నుమానసమున చూచుభంగియు, లోకమునంతయునుకనరామికలుగుటయు,లోకము నంతయు కనుదాననగుటయుకలుగుచున్నదికదా? ఇదినాకే తెలియకున్నది! తెలియకుండియు తెలిసినదాననై మెలఁగవలయునా? తెలియదా? ఈవలతేనివలపులమహామహిమ నాకింతేని తెలియదా? పలువాదముల, పలుతలంపుల, పలుసంకల్పముల, పలుమోహావిచిత్రాంకురముల చింతించి చింతించి, తత్త్వవిచారముఁ జెంచి నాహృదయపతాకము సంచలించుచున్నది. సంచరించుచున్నది. కానిమ్ము. ఆమనోహరసుందరాంగుని నిజమానస సరోజాతశయ్యపై నిడి “యిది యెడరాయు

నియు, దీనినీవడలింపకున్న కడిదిమగంటమి. కుసుమకాండీరుఁడు నన్నడ రించుననియు ప్రార్థించెద. ఉన్నసంగతి నర్థించెద. మలయసింహ నామోచ్చారణ నీకింత వెగటాయని సమర్థించెద.నను నీవు విడనాడిన ప్రాణములే విడనాడుదునని విన్నవించెద.

శా॥ ఓకందర్పశుభాంగ! ఓహృదయపీఠీ మోత్తుంగ సారంగ భూ
షాకారానన! యోపవిత్రావనిలయా! యంభోజపత్రేక్షణా!
ఓకారుణ్యసుధాప్రసూన! ఘనభాగోత్తుంగ సాధాళిరా
వేకాన్వింపవె? దీన,నీరమణి పాలింపన్గదే సత్కృపన్.

(ప్రవేశము ప్రతాపుడు)

ప్రతాప—కలవాణీ! నీకు క్షేమమా?

మ॥ చెలువా! క్షేమమె? నీకు నీ చెలులకున్ చిత్తంబు మోదానుసం
కలితంబే? పరిచర్యలందు కొఱతేకన్ దానులర్పింతురే
కలవాణీ! రణకార్యదీక్షచెనిమన్ గాంచంగరానైతి నీ
విలపన్మానస సీమప్రీతినను మన్నింపన్గదే మానినీ!

ఈప్రాసాదము. నీమనఃప్రసాదనమున వెలుంగుచున్నదా? ఇందలి వైభవములన్నియు నీయవియేయని భావించి నన్నుఁ గృతార్థునిఁజేయుము!

రాణా—మహారాణా! ఈమందిరమును నిందలివస్తువులును నాయవిగా భావించుటకు వలయుస్వాతంత్ర్యముఁ దప్ప వేఱుకొఱంత నాచెంత చేరకుండుటయేకొఱంత. అదే యందుతిలకింపుఁడు. అకాల చంద్రోదయ మదికాదా?

ప్రతా—శశాంకానవా! నిరంతర పురుషమనఃకుముదచంద్రుఁడగు నీముఖచంద్రుఁడు కలకాలముదయించియుండ నిది సకాలచంద్రోదయమగుఁ గాక;యకాలచంద్రోదయమగునా?

రాణా—ఈచంద్రుఁడు, చంద్రకాంతశిలాసముదయముపైఁ బ్రసరించి కఱఁగింపకున్న నిదియకాలచంద్రోదయమే కదా కాఁగలదు.

ప్రితా—పూర్ణిమాచంద్రకిరణములు, చంద్రకాంత శిలలపైఁ బ్రసరించి ప్రచరించి మది నెంచరాని సంచలన మొందినకదా చంద్రకాంతశిలామణులు కఱఁగును?

రాణా—ఆర్యా! యది యే నాకును చోద్యముగ నున్నది. చంద్రకాంతశిలాసమితికే మానసచంద్రకాంత వశీకరణశక్తి లేదో? లేక చంద్రబింబమే యందందు సంచరింతమా? వలదా? యని తనకరముల సంకోచించి ప్రకాశము నప్రకాశముగాఁ గావించి యూరకున్నదో? తెలియక చింతించుచున్నదాన.

ప్రితా—(నిట్టూర్పువిడచి) మదవతీ! కలుములదేవి వైన నిను గాఢముగ పలచియు వలదను నంతటి మనోభిలాషాచంద్రోదయమునకు నొక్క ప్రబల కారణరూపమగు నమవస నిశియున్నది. అయ్యది దైవకృతము. అంతయేల? నిన్ను కుమారీ! యని సంబోధింపవలయుఁగాక "నా ప్రేమాదరీ" యని సంబోధింపఁజాల. అర్థిజనప్రార్థితుఁడగు దరిద్రదాతవోలె నేమియుఁ జేయలేమిచే, విధిలేమిచే, కుమారీభావబలిమిచే నూరక నిట్లాడితిఁ గాక నేనిట్లాడుట, నా భావి జీవితసౌఖ్యమునంతయు నా కాలఁదన్నుటయని నే నెఱుంగనని తలఁచితివా?

రాణా—(క్షణనిశ్చేష్టయై) మనోరమణా! నీవేమైన ననుము, ఇఁక నా యనురాగనిధానమును దాపఁజాల! ఇంకెంతయని నా నెయ్యంపులతను పెఱుఁగనివ్వక నిరోధింతును? నేను చిన్నతనమునుండి నీగుణవర్ణనాలకించి, ప్రతికదనరంగమున నప్రతిమానముగ హోమవేదిని వెలుంగు జాతవేదునిఁబోలెఁ జండతర వైరిమండలములవిదాహ మొనర్చుచు ప్రజ్వలించు నీవిక్రమచిత్రభానుని నా మానసమున ధ్యానించుచు, నిన్నే పరదైవముగ నెంచి, నిన్నే యాత్మేశునిఁగ చింతించి, నా మోహానమో

హానునిఁగ స్మరించుచుంటిని. మనోరమణా! నామానసకీరమును హరించితివి. అభిమానమును సన్మానమును హరించితివి. దేనిఁగాంచినను నిన్నే గాంచునట్లొనరించితివి. నీరూపలావణ్యముల నామానసమును ముంచునట్లొనరించితివి అద్ది మొదలు రమణీయపదార్థములు రమణీయములుఁగాక- సుమనోవిసరములు సుమనోవిసరములుఁగాక యుండ నీసుమనోదయారసనమాదరణమునమ్మియుంటి! మొన్న నన్ను తురుష్కుల బారినుండిరక్షించిన పిదప నీమోహంపుపలుకులను సుధామయబిందువులఁగోరియిదే నానెయ్యంబు ఫలించెననుకొంటి. నాచేఁబూజింపఁబడుచున్న నీచిత్రబింబమునకు జీవధారకలిగించిన యాదైవమును వేనోళ్లఁగొనియాడుచుంటి! ఇన్ని దినములు కన్నులయెదుటకట్టినట్లు కలకాలము వెలరారు నీరూపమే నేనైయుంటి! మాతండ్రి మలయసింహుఁడు వచించుచున్న రాణాచరణదాస్యము లభించెగదాయని సభక్తికముగ నెంచుచుంటి. ఎవ్వరినుండియైన, నేస్థలమునుండియైన, ప్రతాపసింహశబ్దము విన్నదియే సుసమయమని యెంచి ప్రత్యక్షరమును జపించి, లిఖించి, పూజించుచుంటి. నిద్రయందైన- మెలకువనైన, కలయందైన, నాత్మసాక్షాత్కారముగ, నిన్నేయానందముగ, సచ్చిదానందముగ, మహదానందముగ భావించుచుంటి. ఇట్లుమహామోహప్రవాహమునఁ బడిపోవు నొక దిక్కులేని యబలపై, యశనిపాతముఁబోలె, ప్రళయాగ్ని సన్నివేశముఁబోలె, నీపలుకులెట్టివంతఁగలిగించెనో యాదైవమెఱుంగు? రాణా! నాప్రియమోహరసనిధానా! ఇదిపరిహాసమునకు నామనసరయఁగోరి వచించితివి. గాక సత్యముకాదు. మనోరమణా! పరిహాసమునకైన నీ తిరస్కారమును సహింపఁజాల! నన్నుచులకనగఁజూడకుము. నీపదసరోజముల శిరమునధరింపఁగల్గుటయే పరమభాగ్యముగ నెంచునీస్వత్వమును, నీదారను- నీదాసిని తెగనాడకుమా? విడనాడకుమా? పరిపాలింపుమా?

వ్రితా — చంద్రవదనా? నేనేమనువాఁడ! ఏమనక యుండు వాఁడ. నీవాక్యములనాలించుచో నాయంతరాత్మ యెంత సంతసించుచున్నదో యాదైవమెఱుంగు! ఇది కాఁజాలదు. కారాదు. నీతండ్రి మలయసింహుఁడు నాకెంతయుఁగూర్పుసేసినాఁడు. యుద్ధమునకుతన ప్రాణముల నర్పించుచు స్వర్గము నందువేళ, తనకుమారియగు నిన్ను "నీకుమారిఁగ పాలింపు"మని వేడి తలచినయుదంతమునంతయు వచింపఁజాలక మృతిఁ జెందెను. నేనును నిన్ను మదీయకుమారిఁగ పాలించెదనని బాసయొనర్చితి. దానఁజేసి నీవునాకు పుత్రివైతివి.

రాణా — మనోరమణా! ఇదియా మీసందియము? దీనియర్థము తేటగనున్నది గాని మీరుతలఁచిన భావముంకురింపదు. మాతండ్రినన్ను కుమారిగ పెంపవేడుట నట్టిసుతాధిక వాత్సల్యమునఁ బ్రోవుమని యర్థము. కాని, కుమారీభావమునను ద్వాహమాడకూడదని కాదు. అంతయేల? నాజనకుఁడే నిన్ను జామాతగఁబడవలయునని యెంతయో సాభిలాషముగ సమయమబ్బినపుడెల్ల నాతో ముచ్చటించుచుండెను. భార్య పతికి పరిపాలనవిషయమున కుమారీసదృశయై యగును హితబోధయొనర్చుచో మాతృసమానయగును. మానసమును నానాచింతావిముక్తముగఁజేసి తనజీవితేశ్వరుని నభిరమింపఁజేయుచో ధర్మపత్నియగును. ఇదియంతయు తమశేముషీపరిపాటికిఁ దెలియని విషయము కాదు. ఇపుడిట్లు తాము వాక్రుచ్చుట లోకోన్నతకీర్తివిక్రమప్రాభవలతాశ్రియులగుభవాదృశసార్వభౌముల చరణదాస్యమున కే ననర్హనను నిరాదరణబుద్ధియనియే భావించెద.

వ్రితా — కామినీమణీ! ఏలనన్ను తూలనాడెదవు? నా సంతాపకళికల నెఱుంగ నేరవా?

“మ॥ రమణీ! యేమనువాఁడ నాహృదయమందో కేలాస్పందమెట్లాపువా
డ; మనోరాగవిహంగాంకబింబమసియా కే డన్ గాంచి సైరింపవాఁ

డు; మహిన్ మోహమువీడి పుత్రియనుమాటన్ బల్కు భీతిల్లువాఁ
డు; మనోహారిణి! యెట్లుసంశయము వీడన్ గల్గువాఁడన్నతీ॥

మ॥ మందారంబది కంటకాప్తికదు దుర్మానస్యంబు, నవ్యోన్యప్రే
మోదారామృతపల్లవంబు లిఁక నుద్భూతిల్లి రావెంచు, నీ
సౌదామిన్యను రాగవల్లరి వరత్నూకాంత వృత్నామ్నశ్రియా
మోదక్ జేసి ధరిత్రి, ధర్మతతినంభోజాక్షి పెంపక్ గదే॥

రాణా—జీవితేశ్వరా! సర్వకార్యసముజ్జీవనమునకు మానస మేకదా కారణము. అట్టిచో మీహృదయఫలకమున మాతండ్రికొసంగిన వాగ్దానముచే పితృపుత్రికాభావముదయింప వలయుఁగాక. మోహముదయింపవలయునన్న నదిదైవమునకు ప్రీతిదాయకమని యేకదా భావింపవలయు? ప్రాణవిభుఁడా! నేనింకేలదాఁపవలయు? నేనుభవదీయకరగ్రహణమొందనినాఁడు. తావకీనాపాంగావలోకనమెఱుంగని నాఁడు, ఈదేహము, యీప్రాణసందోహము, ఈసుఖప్రపంచపరిదేహముసంతయు నీకర్పించెద.

సీ॥ ఆబాల్యముగ నాథుఁ డంచనియెంచు నా
ప్రేమయే ప్రతిఫలం బెఱుఁగదేని
పొలుపారుభక్తి నే పూజించు దైవంబె
తా ప్రసాదింపఁగఁ దలఁపఁడేని
నా మోహలతయెందు వ్యాపింప నీభువి
వలయురసాలంబు వడయదేని
హృదయసీమవసించి వెలరారు విచిత్ర
పటము జీవత్వంబు వడయదేని
గీ॥ నాదుననురాగమంతంత నాశ మొందు
పగిది యీమాని నిమణి ప్రాణసమితి
తునియలై మంటఁగలసియై నినుఁజేరు
గాక నన్యులఁజేరునే తన్మతేంద్రా!

హృదయనాథా! నిన్నే నమ్మినభామామణిని, నిన్నే మోహించినరామా మణిని, నీజన్మమున నీమనసార, నీకరుణారస మొప్పార, నీవామభాగ

పరిభాసితుఁ గావించెదవో ? లేక జన్మాంతరమున నీవియోగదుఃఖముచే నూడిపక్కలై, తునియలై, రజములై, మిన్నక లెగయు నామానస జీవ ప్రాణముల నాదరించెదవో? నీచేనున్నది నేననన్యగాగతికను. తలిదండ్రులు లేనియనాథను. చుట్టములు కానని శూన్యభాగ్యను. దైవమునకు రోసినదానను, నీవుసిరసించినను, నన్నాదరణమొనర్చిపొమ్మన్నను, రమ్మన్నను, నీధనమేయనుదానను. నమ్మినదానను, చేకొమ్మనుదానను. దయరానిమ్మను దానను, మందభాగ్యయగునాపై నక్కటికమూనకున్నను, నీకొఱకై, నీదేశముకొఱకై, నీప్రాభవముకొఱకై, తనప్రాణముల కానుకగా నిచ్చిన, నాతండ్రిపై నెనరువహించి, యాతనికోర్కె నెఱవేర్పుమను దానను. నీధర్మపత్నిపదమున కేనెంతయు తగనిదాననైనను, నీకును నీవువలచిన ధర్మపత్నికిని దాస్యమొనర్చుటకైనఁ జేకొమ్మనుదానను. అంతటికినిఁ జాలకున్న నీచరణపద్మముల- నామానసమున నెంతయో పెద్దకాలమునుండి పూజించుచున్న నీచరణపద్మముల ధ్యానించి పూజించుస్వాతంత్ర్యమునైన కనికరమున నొసంగ వేడుదాన. విధాతయొసగిన నాయాయుఃకాలమంతయు మనసిచ్చుట నీచేనున్నదనుదాన. పాలకుఁడన్నను, రమణుఁడన్నను, రమారమణుఁడన్నను నీవేయనుదాన. నీవొక్కఁడవు నాపాల లేకున్నను నేనంతయు నీపాలనేయనుదాన. నీవే శరణనుదాన- పాహియనుదాన- (అని పాదములఁ బడును)

ప్రతా— మోహనాంగీ! కాదు-కాదు-మనోహరాంగీ! యీ హతభాగ్యు నేలవేడికొందువు! తరుణీ! వచనభ్రష్టత్వమను ప్రవాహమున తనంతనె పడనున్న నన్నేల నీదీనవాక్యబలిమిచే ద్రోసెదవు. క్షత్రియుఁడు వచనము తప్పుటకంటె తనువు తప్పుటయే యుత్తమమని యెఱుంగవా?

సీ. క్షత్రియశేఖరు । సత్యవచోనిష్ఠ
దుర్లంఘ్యమని యాత్మఁ । దోఁపవలదె

వరరసాలఫలంబు  కరమంద, భుజియింప
నేరవి నావంత  నెన్న వలదె
కటికరాల్కఱగించు,  కలికి, నీవలపుసూ
క్తులఁగొనవట్టినఁ  దలఁపవలదె
కుసుమభృంగంబుల  వెసనూన్పు విధికృతి
మకట దుస్తరమంచు  నరయవలదె

గీ. మాతృదేశసముద్ధర  మాన్యనిష్ఠ
యొక్కవైపు నీయనురాగ  మొక్కవైపు
నీద్వా మత్కష్టపరితాప  మెఱుఁగవలదె
తండ్రియానతి శిరమున  దాల్పవలదె!

నీతండ్రికి నే నొసంగిన వచనము పాలించుట నాకెట్లు కర్తవ్యమో, నీకును నట్లే కర్తవ్యము కాదే? ప్రతిజ్ఞాదూరుఁడ కాఁజాలమిచే కరుణాదూరుఁడ కావలసివచ్చెను. నాకును నీకును కుమారీ పితృసంబంధము కలగవలయుఁగాక, మోహసంబంధము కలుగరామిచే, కలుగఁజాలదని తలంపుము. ఇది దైవనియోగమనియు, దైవసంఘటనమనియు, నూరటఁజెందుము. నను తెగడకుము, విధిలేమిని తెగడుము. కామినీ? నీవు వివేకమహిమాంచితవు! క్షత్రియకులసంజాతవు! ధీరగుణోపేతవు! నీవే యోచింపుము! నాకును కర్తవ్యముపదేశింపుము.

మానవతి విక్రమ్మా! నేను నీవాఁడననియే తలంపుము ఇఁక నీపట్టు మానుము.

రాణా — హా! దైవమా! నాకు పట్టుకలదా! నాపట్టు నన్ను వదలదా! కట్టా! కలికియైపుట్టుటకంటె గుట్టలరాతిచట్టయైపుట్టుట మేలు కాదే? హా జనకా! మలయసింహా! నాకీగతి దెచ్చితివా! నీమాటయే నాకామోదముఁ గూర్చెను. నీమాటయే నను మనినంతకాలము దుఃఖమహార్ణవమున ముంచెను.

ప్రతా—భామినీ! యేమి నీవాక్యములు?

రాణా—నావాక్యములు- మందభాగ్యయగు నావాక్యములు- నావాక్యములేగాక వేదవాక్యములేగాక-ఓపితృవాక్యమా? నాపాలికి పితృపతివాక్యమైతివా?

ప్రతా—సారసాంగీ! యేలయిట్లు మాటాడెదవు? కూర్చొనుము.

రాణా—కూర్చొనుటయా! నాకు ప్రేమకూర్చువారెవరు? దైవమా! నామరదృష్ట దైవమా! పోయితివా! నీవెక్కడికి పోయెదవు? ఆహా! మఱల వచ్చితివా? రమ్ము! నిన్ను జేరిమూర్చెద (అనికరమెత్తి పోఁబోవ)

ప్రతా—కమలాక్షీ! యెందేగెదవు?

రాణా—ఎందేగవలయునో యందేగెదను.

ప్రతా—నీబంధువులకడకేగెదవా?

రాణా—నాజీవబంధుల కడకేగెదను.

ప్రతా—వారెందున్నారు?

రాణా—నాయందున్నారు! నాకనులయెదుటనున్నారు. అదే! అందున్నారు. ఇందున్నారు!! (అని వెడలి పోవును)

ప్రతా—అలివేణీ! పోవకుము! పోవకుము! అయ్యయో! యీతరుణీలలామ చిత్తచాంచల్యమున నేమియో పలుకుచు వెడలి పోయె. ఈతరుణి పరితాపము నెట్లుపరికింతు? ఘోరా! నేనేల నాయందే బద్ధానురాగయగు సుదవతిని పరిగ్రహింపరాదు? ఆమెతండ్రియభిలాషయు నయ్యదియేకదా! ఆతరుణి వచించిన తెఱంగున సర్వమునకును మానసమేకదా కారణము; అయ్యో! అదియెట్లు? నాసేనానికి మాటయిచ్చి తప్పుటపాడియా! తప్పకున్న నిప్పరమసాధ్వి జీవితము

దేహమునుండి తప్పదా? దైవమా! నాకెట్టి విషమసంఘటనముఁ దెచ్చితివి? ఆహా! లోకమున కామినులఁ కామమనస్సంకల్ప మెట్టిదనవలయు? రణరంగవీరధీరమానసములును, సాధ్వీమణులసుస్థిర ప్రేమానుబద్ధమానసములును నొక్కచోటనే యానలువ సృజించియుండఁబోలు నాఁ? కమలదళమృదులములగు బాహువులు కదనపరిపంథినిరసనకర్కశములగును. ప్రణయరసనవనీతసమానములగు నారులహృదయములు భీకరహాలాహలసదృశములగును. ప్రపంచమాయావైచిత్రి యంతయు మానినులయందే చూడనగు. సామాన్యతరుణులకే మనస్సంకల్పప్రభావ మధికమన్న వీరక్షత్రియకుమారి కెట్లుండవలయు?

(ప్రవేశము — భామాసా)

భామా — దేవా! జయమగుఁగాక. శాత్రవసైన్యములీదుర్గపరిసరమును సమీపించుచున్నవి?

ప్రతా — భామాసా! అట్లనా? పొమ్ము. రణసన్నాహమును సిద్ధపరపుము. ఇదె నేనువచ్చెదను.

భామా — భాగ్యము. (నిష్క్రమము)

ప్రతా — పరమేశ్వరీ! భవానీ! నిమిషనిమిషమునకు చరించుచు పైపైఁబరతెంచు వైరివాహినీకరకరవాలముల కంఠసీమ నోర్చికొందునా? అందందు కర్ణకుహరతప్తశలాకికా ప్రాయములగు ప్రతిపక్షులోనర్చు నత్యాహితంపుల మాన్పఁబ్రయత్నింతునా? శిశోదియావంశపరిపాలనమున దిగంతవిశ్రాంతకీర్తినిఁ గన్న మేవాడు మాతయుప్పుడు స్వాతంత్ర్యదేవతకై తనపుత్రికాపుత్రుల బలియొసంగి, విలపించుట చూచి యోర్తునా? అనన్యసామాన్య మోహబంధయగు నిలలనామణి ప్రాణాపాయరక్షణమున జాగరూకతవహింతునా? ఏదియు తెలియకున్నది. శంకరీ! హైమవతీ! నీయానతి యెట్లో యట్లాచరించువాఁడ (అనుబంధము 11. పాడుచు నిష్క్రమము)

# మేవాడు శౌరాగ్ని నాటకము

ద్వితీయాంకము ద్వితీయరంగము.

(ఢిల్లీనగరోపాంతమున-ప్రవేశము-సాగర్జి-గూఢవేషమున)

సాగ — ఇయ్యదియే ఢిల్లీపురము! ఇయ్యదియే మామకపాపకార్యఫలభూతమిూతిస్థానము. ఇయ్యదియే మదీయమాతృదేశవినాశనహింసాస్థానము. విజయమందిన రాజపుత్రసార్వభౌమబిరుదముతో నిందుజొచ్చి నిరంతరభారతసార్వభౌము దక్షిణభాగమలంకరింప వలసిన ప్రతాపసింహు ప్రతాపఛత్రము నీడ నిలువయోగ్యములైన వాచరణములు నేడు, నిగూఢముగ నిరస్తమాతృదేశప్రేమములై నిఖిలకల్మష కిల్బిషతంతువితానబద్ధములై, ఆత్మదేశవిద్రోహ, ఆత్మజనవిద్రోహాది ద్రోహకదంబకూపమున క్షణక్షణమునకొక సోపానము దిగుచున్నవి కదా ? ఇన్ని మణిదీపికలచే వెలరారుచున్నను నీనగరమేల నాపాలికి నేడు గాఢతామిస్రమై తోచుచున్నది! అకటా! ఇంతకాలము రజపుత్రయోధవతంసుల దినదిన విజృంభితనానావిక్రమక్రికలన ప్రకాశిత భయవిద్యుద్దీపికాసహస్రములచే నులికిపడుచున్న యీ నగరమున సమస్తయవనసేనాధిపుల మనోవిశాలశాలలయందు, రాజపుత్రప్రతాపజ్యోతుల నొక్కసారియే యార్పఁజనుచున్న యోసాగర్జి సాహసపురుషా! నీసాహసమందిరమున నొకచోటనైన పౌరుషకీర్తి దేశాభిమానదీపము కాన్పింపదా? ఏలకాన్పించును? ఆదీపశిఖ, ఆపవిత్రతర దీపదేవత నాప్రమదాభావనచే నాహృతమయ్యె. ఆయూరే? అనారతవీరవరేణ్యుల మానసదేవాయతనముల స్వకీయపావన శౌర్యాజ్యధారలచే వెలిగించిన దీపశ్రేణినార్పి, దీర్చి, పెంచి, నొంచి, నవత

రించిన ఝుంఝూమారుతమాలలుకదా లోకమున, బాలలు! తద్భాలికా రచితమార్గమేకదా, నన్నిందుఁ జేర్చె! అయ్యో! పితృ, భ్రాతృ, బంధు మిత్రప్రేమమయావర్ధిత సుధావల్లరులనట్టె త్రెంపఁజాలిన లవిత్రములే కదా! జగమున దుష్కళత్రములు! పురుషులకు దుష్ఫలసత్ఫలముల నొసంగ బ్రహ్మాదిదేవవర్గములే శరణ్యములని యెంతురు కాని, యది కల్ల. మనుజుని సత్కార్యసత్ఫల సంసిద్ధునిఁ జేయుటకును, దుష్ఫల దుష్టకార్యసిద్ధులఁ జేయుటకును, దుష్కళత్ర సత్కళత్రములే కారణ భూతములు. ఆహా! ఏమి యీ సకలావయవకంపము! నను నధీరునిగఁ జేయుచున్నది. నన్నొకనినే కాదు! ఇన్నిదినములు సకలజనహృదయ సీమలవసించుచుండిన రాజపుత్రకుల మానగౌరవకీర్తి ప్రాభవములనే కంపింపసమకట్టినది. కాదు. కాదు. నాకింత కాలము కామేశ్వరసింహాసనశైలమున మామకదాయాద భయంకర మేఘము వర్షించిన ఘోరాపమాన భీకరనిరసనఝంఝుడబంధుమిత్ర సముత్తూగౌరవరూపవర్షధారల నడలించి, యదలించి యొట్టినిలుప సమకట్టిన దీనసర్వాంగకంపమని భావింపవలయు. ఇంకేల యోచన! ఓనిగూఢ వేషద్యోతకనీలాంబరమా! నీవిట్లునన్నిపుడు సమాచ్ఛాదన మొనరించి యీసాగర్జని నవీనమాయామయ సంకల్పాంధకార గృహమున నాట్యమొనరింపఁ బిలుచుకొని పోగుచున్నదానవో యట్లే మామకవిపత్తుదంతియూథముల, వారి వైభవాహంకారముల, వారి రాజ్యగౌరవముల నెల్ల నిగూఢపరచిమదీయకృత్యశృంఖలముల బద్ధించి జగదమేయగాఢాంధతామిస్రముఖభూగృహమునఁ బడవేయుము. నీసంకల్పమును సత్వరముగ నిర్వర్తింపుము. ఎన్నడును తలంపని యాకస్మికఘనగర్జనముల మచ్ఛాత్రవులనాహ్వానించి నీయఖండశక్తికి బలియొసఁగుము. ఎసఁగుము. లోకమునమనలకుము దుర్భావనలచే—

(నిష్క్రమము)

---

## యవనిక నెత్త—ఢిల్లీ రాజనగరు

అక్బరు, ఖాన్‌ఖాన్, మానసింహా, పృథ్వీరాజు, బాదోనిరహీ ములుందురు.

అక్బరు—ఖాన్‌ఖాన్! అయిన నీయభిప్రాయమేమి? ప్రతాపసింహుఁడు మనతో నింకను సంధికియ్యకొనఁడగునా ?

ఖాన్‌ఖాన్-దేవా! తనజన్మదేశమునకై, తనస్వాతంత్ర్యమునకై, ప్రతాపుఁడు తన మేన ప్రాణము లుండువఱకు, చేతకరవాలమును, నధిరోహించుట కొక్క తురంగమును నుండువఱకు, నిజప్రతాపాగ్ని వెలయించి శత్రువసానముల దహించి, వీరస్వర్గమైనఁ జేకొనునే కాక బాప్పరావు కాలమునుండి తనపూర్వికులచే రక్షింపఁబడుచున్న తన దేశమును పరులకప్పగించి జన్మదేశవిక్రయధనమున జీవింప నొల్లఁడు. ప్రభూ! తమసన్నిధిని శత్రువునుతించు నాసాహసమును క్షమింపుఁడు. సేనాసంపత్తి లేకున్నను, మిత్రులును, సామంతులును శత్రుపక్షమవలంబించి తనతో వైరముసాధించినను, తనశత్రుఁడు భారతసామ్రాజ్యరమారమణుఁడగు నక్బరుసార్వభౌముఁడైనను, యక్షౌహిణీమహాసేనలే కార్చిచ్చుభంగి, తన్ను దహింపఁజనుదెంచుచున్నను, నిశ్చలుఁడై, నిర్భయుఁడై, నిరంతరరాగరంజితదేశభక్తిపరాయణుఁడై, సంధికి సమ్మతించితినను నొక్కపదోచ్చారణచే నేరాజ్యభోగంబుల యుద్ధావసకితాధారవోసెనో, నయ్యవి పూర్వముకన్న సహస్రాంశము లధికముగ తనకు సంప్రాప్తింపనున్నను, నిరాకరించి పరుషమానప్రతాపనిధియై, మింటవెలుంగుమంటదొరచందమున వెలుంగు నమ్మహావీరు, శూరాధిశూరుఁగన్న తల్లియే వీరసూమతల్లి.

మ॥ తరగెన్ సేనలు; అశ్వముల్ నవిసె; హా కే ధవాశ్రితుల్ నాశిలెన్
ద్విరదాళుల్ నశియించె; సన్నగిలెనా కే విత్తాదిగేహంబులున్

అరివారంబునెదిర్చి అత్మఘన ధైర్యస్ఫారసాహాయ్యుండై
ఘోరమున్ సల్పు ప్రతాపుజన్మమిల సంస్తోత్రార్హమై వెల్గదే!

దేవా! వీరును గుణపక్షపాతులు. మతవైషమ్యముల మానసమునం జొరనివ్వని మహోదారులు. హిందూమహమ్మదీయులు తమతమ ద్వేషములమాని తమకెంతయు నాశ్రయము నొసంగినిర ఫలసస్యాదకాదులచే తమకు జీవసత్త్వము నొసంగి, కన్నతల్లికంటె నేమి టనుతక్కువ కాని యీభరతఖండమునకు కూర్చునందలనుట స్మరించి యందఱును కలసిమెలసి కమనీయసౌహార్ద భావమున మెలంగుటయే, దేశప్రజాక్షేమ మనుబోధకు మార్గదర్శకులు, తామేకదా? కావున నేనేనింతవచింప సాహసించితి. ఈయుద్ధము కొనసాగింపనే వలయునా? మీరే యోచింపుఁడు.

అక్బరు—ఖాన్ ఖాన్ ఇందు నేతుమింపఁదగినదెయ్యది? శూరుఁడగువాఁడు, తనప్రతిపక్షుఁడైనను, మఱియొక శూరవతంసుని ప్రశంసించుటయా? అదియెంతయు నంస్తవనీయంబగుగాదే! ప్రతాపుని దేశభక్తి శౌర్యాదుల నీవొకండవేల యీరాజపుత్రస్థానమెంతయు పొగడుచుండుట నేనెఱుంగనా? ఆప్రతాపుఁడు మనయవన పారశీకుల పారదోలి తన భర్తమానమును, మేవాడురాజ్యసిరిని కాపాడిన యామీరాబాయి నందనుండు కాఁడా? అతండు వంశపరంపరాగతమగు చిత్తూరురాజ్యమునకెట్లధికారియో, యట్లే చిత్తూరుపూర్వరాజన్యులగు, బాప్పారావల్ సామర్సి కుంభరాణాదుల శౌర్యపరాక్రమదేశసేవా స్వార్థపరిత్యాగాదులకును నధికారియనుట క్రొత్తవిషయమా? అయిన ప్రారంభించిన కార్యమును కొనసాగింపక మానుటయీయక్బరుజాతకమున వ్రాయనివని, ఇంతకాలము యుద్ధముజరిపియుభయపక్షములనెందఱెందఱో సైనికులు మడ

సినను మేవాడురాజ్యమునుజయింపకున్న నీఢిల్లీసింహాసనమునకే తలవంపులు కదా? ఇదియుంగాక, మనము దక్కనురాజ్యములపై దండువిడల నిర్ధరించితిమిగదా! అప్పుడుమనకు సమీపమునశాత్రవుండొకండు స్వేచ్ఛనుండుట రాజనీతి విరుద్ధము కాదా? కావున మనకీ యుద్ధమవశ్యకర్తవ్యము. ఇందుకేమియోచన?

మాన— దేవా? ఇందు కాలోచన కావలయునా? కుక్కలకొసిం దీర్ప సింగము విచారింపవలయునా? ప్రతాపుఁడనంగ నెంత? వాని ప్రతాపమనంగ నెంత? వానిన్రోహటించుటకు బంపఁబడిన సేనానులు సైన్యములును, యుద్ధనిపుణులేయైనను, కొండలదాగి హఠాత్తుగ పైఁబడు నీవిచిత్రయుద్ధమొనర్పఁ జాలుఁగరు? కావుననే మనకు సంపూర్ణజయము లభింపదయ్యె. దీనికై తామింత యోచింపనేల? నేపో మొద నీయుద్ధమునకు. వానినచిరకాలముననే తమపాదాక్రాంతునిం జేసి తమసన్మానమునువడసి, నేమానసింహుఁడనుట సార్థకపరచెద. నాఁడువాఁడు నానపంక్తిభోజనమే యపవిత్రముగ నెంచి, నన్నును నిమ్మును, దూలనాడించిన పరిభవమింకను నను బాధించుచున్నది. దానికి నర్హప్రతీకారమొనర్చినంగాని మీచెంతనున్న రాజపుత్రులకు నూరటజనింపదు. వానిను పేక్షించితిమా మనయందఱికిని యపమతిగల్గినట్లగు.

అక్బరు— మానసింహరాణాజీ! మీయుత్సాహము మిక్కిలి సమంచితముకాని, అదికాదు—

బడోనీ— అదికాదననేల? దేవా! కాఫరులనా మీరింత ప్రశంసించుట? వారినడంచుట మనకెంతయుఁ గర్తవ్యమగు ధర్మము కాదే? మీప్రభావమింకను మేవాడునందు చక్కఁగ వెలుంగలేదు. కావుననే వానిశూరత్వమింతవఱకు చెల్లినది. పలాండువనమున జోరీగకోకిలయే కదా! మార్వారు, జయపూరు, జోధపూరు, బుందేల్, బంగాలాఘూ

ర్జర దేశాధీపులకన్న నీ ప్రతాపసింహుఁడు యెక్కువయా? మానసింహ-రాణాయు నేనును పోయెదము చూచెద వాని ప్రతాప మెట్టిదో ?

రహీం—దేవా! యింతవఱకు జరిగిన యుద్ధమున కొమల్మేరాదికొన్ని దుర్గములు తప్ప నన్నియు మన స్వాధీనమయ్యె. హల్దిఘాటుయుద్ధమున మేవాడు సైన్యమంతయు నశించె. ఇట్టిచో మనము కొంచెము పట్టుదల వహించితిమా మేవాడు సంపూర్తిగ మనస్వాధీనమగును. అంతయేల యా ప్రతాపసింహుఁడే సంధికియ్యకొనునట్లును యుద్ధము నాపవలయుననియు రాయబారిని నొకని పంపియుండ మీకు నివేదించి మీ యాజ్ఞ తెలిపెదనని యతని పంపితిని.

అక్బరు—ఏమీ! ప్రతాపుఁడు సంధికి సమ్మతింతునని రాయబారమంపెనా? నిక్కమా? ఏల వానిని నా సమ్ముఖమునకుఁ దీసికొని రావైతి?

రహీం—దేవా! నిక్కము. ఆజ్ఞయొసంగిన వాని నిందుదోడ్తెత్తును. క్షమింపుఁడు. ప్రతాపుఁడు మనకులోఁబడుటకు నాలోచించుచున్నాఁడనియు, నందుకై యుద్ధము కొంతకాలము మిమ్ము ప్రార్థించి యాపవలయుననియు నన్ను వేడె. అపరాధియగుటచే మీ చెంతకు పంపవెఱచి కాఁబోలు యిట్లొనర్చె.

పృథ్వీ—రాణా ప్రతాపసింహుఁడా! సంధికియ్యకొనుటయా! మాతృదేశ స్వాతంత్ర్యమును విక్రయించుటకు సమ్మతించుటయా? కల్ల. నేవిశ్వసింపఁజాల!

అక్బరు—పృథ్వీరాజ్ జీ! యిందు సంశయమేల? అతఁడు ప్రతాపసింహుఁ డైనమాత్రమున వైరిబలతారతమ్యముల విచారింపఁడా? ప్రజాక్షేమమును తలఁపఁడా?

రహీం—దేవా! ఈ పృథ్వీరాజు ప్రతాపపక్షపాతి. కావుననే నతఁడే మొనర్చినను పొగడుచుండును.

పృథ్వీ—పాదుషాజీ! నాసాహసమును క్షమింపుఁడు. మీ రెంతఁ జెప్పినను ఆ ప్రతాపసింహునిమేన ప్రాణములుండువఱకు మనకును నతనికిని సంధిపొసఁగునని నే విశ్వసింపఁజాల.

ఉ॥ సింగము నాకటం గృశతఁ జెందిన, వార్ధకదిగ్ధమైన, స
ర్వాంగములాడకున్న, విపదంబుధి మున్గిన కుంభికుంభ తా
సంగతమాంసభుక్తి మనఁ బారగఁ గోరునుఁ గాని, తుచ్ఛమౌ
చెంగటనున్న శుష్కతృణఖండములం గ్రసియింపఁ గోరునే॥

ఈరహీంఖాను వచించుట సత్యమే యగు—నెవ్వరో, ద్రోహులు, ప్రతాపుని శాత్రవులీకృత్రిమతంత్రమును పన్నియుండవలయుఁ గాక! ఇది యథార్థమైయుండదు. అంతయేల ? దేవా! ఇందఱ రాయోధన పండితులు మనసభనున్నారు! ఇందఱు మహమ్మదీయశూరాగ్రేసరులు నేను నేనని తలలెత్తుచున్నారు! ఇందఱు పారశీకవీరులపార బలంబున ప్రొద్దుతమనొసటిపై పొడిచినదని విఱ్ఱవీగుచున్నారు! ఇందఱు రాజపుత్రప్రథనకర్కశమహాయోధవరిష్ఠులు శాత్రవసేనాసముదయంబులఁ దరికొనుటకై కాలుద్రవ్వుచున్నారు! మొగలులో మిగులవాడిమగలమని పేరువాడి యరివాహినినిడీకొన నుంకించుచున్నారు. ఇందఱిచే నలంకరింపఁబడుచున్న యీనిండోలగమునందు నెవ్వరైన, నేవీరుఁడైన, నేశూరుఁడైన, నే రాజనీతిపారంగతుఁడైన, తుదకే చక్రవర్తియైన, యీపాదుషాసన్నిధానమున, నెదపైఁ జేయిడి, జంకక, తడబాటులేక, సంశయింపక, నోరార, యాభువనాలోకదుర్లోకప్రతాపుని, సురాసురమానసవిభేదనవిచక్షణప్రకోపుని, దుష్టలోకసంతాపుని, ఆశ్రితజనప్రాపుని, ప్రతాపుని, యీసార్వభౌమునికి పాదాక్రాంతునిఁ గఁ జేసెదనని యుచ్చరించుటకైన ధైర్యముకలవారున్నారే! ఏటిమాట—

చేతకరవాలముధరించి, ధైర్యముననో, బలిమినో, యాత్మగౌరవరక్షణార్థమో, కొన్ని యుద్ధములందు శాత్రవులకొందరతి జంపినంత నేనతఁడొకశూరవతంసుఁడగునా? మీరు లతనిఁ బ్రశంసింతురా! అసహాయుఁడై, కష్టపారావారమేతన్ను ముంచినను, తనమిత్రులు, సామంతులు, నాప్తులు తన్ను దూరీకరించినను, పవిత్రోద్దేశమునకై, పవిత్రతర దేశస్వాతంత్ర్యోద్ధారమునకై, యాత్మీయ ప్రాణధనము నర్పించ కంకణముకట్టుకొని, శూరాధిశూరుఁడగు నీయక్బరు పాదుషా యంతటివానిచే సైతము "భళీ" యను ప్రశంసాపాత్రుఁడైన యా ప్రతాపసింహుని పుత్రునిఁగఁ బడయుటచే మనభరతదేశమీతల్లి యే పరమ పావనియయ్యె. దేశమాతా!

భారతాననీ.

మ॥ శా॥ నీగర్భంబునఁ బుట్టి రెందఱో సుతుల్ - వీరప్రభాశోభితుల్
భోగాఢ్యుల్ వినుమా స్వతంత్రఁగను సం - పూజ్యాభిచారిత్ర స
ద్యోగానందను చేయఁగల్గిరె? ఘనా - యుఃప్రాణముల్ నీకునై
నీగర్భంబున ప్రతాపసింహుఁడొకఁడే - నీపుత్రుఁడా! నీస్వతం
త్రాగారముఁ బ్రోచువాఁడు వగపే - లా భారతాంబా! యిఁకన్.

అతనివరాజయమే, మీరు సాధించిన యుద్ధవిజయములకన్న సహస్రాంశములధిక తేజోవంతమై యొప్పారుగాదే! రణమునకై ప్రయత్నించు ప్రతిరణశూరుఁడును, విల్లును కేలునఁబూను ప్రతివిలుకాఁడును, నాప్రతాపసింహుని తొలుదొల్త ధ్యానించిమించినఁగదా, గుణపక్షపాతత్వ సమభావత-చక్రవర్తిత చెలఁగును. పెరవాఁడే, పరుఁడే-వీరపరుఁడేయని యసూయయుంచకుఁడు. అతనినిపొగడుఁడు-గణింపుఁడు-ప్రశంసింపుఁడు. అనుకరింపుఁడు-అపుడు మిమ్ము జయలక్ష్మి వరించును!

ఖాన్—భళీ! పృథ్వీసింహాజీ! నీకాకవిరాజనామమెంతయు సార్థకమే యగును.

రహీ—దేవా! అప్రతాపుఁడు పరాక్రమవంతుఁడేయగు-దాని నెవ్వ రంగీకరింపరు. అయిన నతనికి సేనాసముదాయము శూన్యము; ఆయుధసామగ్రియుండదటూ? శశివిషాణము-దీనికొక చిన్నయుపాయముఁ గలదు. అద్దాని మండలేశ్వరుఁడేకాంతమున వినఁగోరెద-అదియనుకూలమయ్యెనా? మేవాడురమానాథుఁడు తమపాదాక్రాంతుఁడగు టకే నుత్తరవాదిని.

అక్బ—రహీంఖాన్—! నీవు రాజనీతికోవిదుఁడవనుట నిక్కము. ఇఁక నీసభాసదులందఱు నుచితజ్ఞులేకదా?

అంద—భాగ్యము(నిష్క్రమము- ఖాన్ ఖాన్-రహీములుతప్ప)

రహీ—సార్వభౌమా! మేవాడునుండి తమదర్శనార్థమై సాగర్జీయువరాణావచ్చియున్నాఁడు?

అక్బరు—ఏమి! సాగర్జీయా! మనచెంత కరుదెంచెనా! అతఁడుప్రతాపుని సోదరుఁడు కాఁడా? ప్రళయాగ్నికీలలయందొకటి నీరసశీతలతనందుట కడునబ్బురముఁగదా?

ఖాన్—దేవా! ఇదిదూరముగ నాలోచన యొర్పవలసిన విషయము. అగ్నిబూఁడిదచే కప్పఁబడినదని స్పృశించితిమా, అది మొదలంటమసలనే దహింపకమానునే?

అక్బ—కానిమ్ము, ప్రత్యక్షముసంభాషించిన నంతయుఁ దెలియఁగలదు. రహీంఖాన్! నీవాతని నిందుతోడ్తెమ్ము.

రహీ—భాగ్యము—(నిష్క్రమము)

ఖాన్—(స్వ) సాగర్జీహాతకా! నిన్నేమనవలయు? వీర్యరమావరావతారయగు వీరబాయిగర్భశుక్తిరపారావారమున నుద్భవించి యభిమానైకధనుఁడగుప్రతాపసింహుసంతటివానికి సోదరుఁడవై, శౌర్యధనైకనిలయమగు రాజపుత్రవంశమున నుద్భవించి, తుదకు రాజద్రో

హామునకు గడంగితివా ? నీవాయుదయసింహునికి తగిననందనుఁడవే యగుదువు.

చ॥ తరువున నగ్ని పుట్టి, యది దానినె కాల్చెడు భంగి, నీచుఁడై
యరులకు కోటనమ్మి, జననావని వైరుల కప్పగించి, దు
స్తరమగు నాపదల్ మనుజసంతతి కుంచెదె ! యసూయచేకటా
దురితవిచార మెంతటి పని దుఃఖముల్ గలిగించు ధారుణిన్॥

ఈయసూయయే కదా హైందవస్వాతంత్ర్యవినాశనమునకుఁ గారణము.

అక్బరు—ఖాన్ ఖాన్ ! ఏమియాలోచించుచున్నాఁడవు?

ఖాన్—దేవా ! ప్రతాపసింహసోదరుఁ డెట్టి కార్య మొనర్పఁ బాల్పడి యెనని యోచించుచున్నాఁడ.

అక్బరు—ఇందేమి యాశ్చర్యముకలదు. ప్రతాపసోదరుఁడైన మాత్రమున లోకసహజమగు రాజ్యలోభ ముండుటయబ్బురమా? అదియుఁగాక, ఇతనిఁదప్పించి, ప్రతాపుఁడు మేవాడుసింహాసనము నధిష్ఠించుట సోదరద్వేషమునకుఁ దగిన కారణముగాదా? రాజ్యమును ధనమును, సుందరియగు తరుణినిఁగాంచిన యాదైవమైన నాశించుట యాశ్చర్యమా-అదే వారును వచ్చిరి.

(ప్రవేశము పహీంహు-సాగర్జి)

సాగర్జి—తురుష్కచక్రవర్తియై, శ్రీమాధవావతారసంభూతుఁ, భారతసామ్రాజ్యరమావిలాసుఁడైన డిల్లీసార్వభౌముని కభివానములు.

అక్బరు—ఉదయపురభావి చక్రవర్తియగు సాగర్జీరాణా ! ండు! మీకు సేమమా !

సాగర్జి—ఇంతవఱకు లేకున్నను ముందు సార్వభౌములక్ప్రవచే కలుగుననుటకు సందియము లేదు.

అక్బ—చిత్తూరువిప్లవ మెట్లున్నది?

సాగ—ప్రస్తుతము తమచే విప్లవమణఁగి సమంచితస్థితికి రానున్నది.

అక్బ—దానికంతటికిని మీరే కారణభూతులు కావలయు.

సాగ—ప్రభువాజ్ఞశిరసావహించి భవితవ్యకార్యసాగరమును వేర్మిడినీదఁ గల్గుదును.

అక్బ—దుర్గసంపద చిత్తూరునకు నతిదృఢమైనదికదా?

సాగ—దృఢమగుటయు, నదృఢమగుటయు నాప్రయత్నసాహసములపై నాధారపడియున్నది.

అక్బ—కానిండు. అయిన మేవాడుసేవానియగు దుర్గాదాసు మనలబాధింపునా?యని యోచించుచున్నాఁడ!

సాగ—అదియే నేనును యోచించుచున్నాఁడ.

అక్బ—ఆతని దేశబహిష్కృతి మనకు ముఖ్యము. (లోనఘం టాధ్వని "సార్వభౌమునకుజయమగుఁగాక" యని)అదె కాల్యకార్యములువార్కైయెదురుచూచుచున్నవి. పోదమురండు.

(నిష్క్రమణము)



# మేవాడు శౌర్యాగ్ని నాటకము.

ద్వితీయాంకము-తృతీయరంగము.

చిత్తూరు-రాజనగరు-ప్రవేశము-ప్రతాపుఁడు

ప్రతా——మోహమా! కృత్యాకృత్యవిచారవిమోహమా!

ఉ॥ మానసవల్లరిన్ జననమంది, హితాహితకృత్యమాపితో
హీనవిమోహమా! యణఁగియించుక హృల్లతయందు, దేశర
క్షానవనిష్ఠ, దేశవిలసత్పరతంత్రవిభావనాశనా
నూనమనీష పెంపుసు! ఘనోద్యమమిత్త్యదె నీకు నెల్లెడన్॥

భవదీయనిరంకుశప్రసరణమునకు మామకహృదయాంతరాళసౌధము ముద్రితకవాటమై యున్నది. నీవు వినుముచ్చావచముగతరంగతరంగములుగనీను నాహృదయవల్లరియందు, నిర్లీనవై, యామానసప్రసవనీలతనుండి స్వదేశరక్షణ, భారతీయగౌరవధర్మపరిపాలన, దేశస్వాతంత్ర్యోద్ధారాది సకలధర్మకుసుమంబులఁ బ్రసవింపఁ జేయుము.

ప్రవేశము సాగర్జీ-భవానీదాసులు.

సాగ——భవా——మేవాడుసామ్రాజ్యరమాఖండలునకు విజయమగుఁగాక.

ప్రతా——సాగర్జీ——రమ్ము- చిరకాలములు దేశవాధర్మమున ప్రమాదమందవుకదా?

సాగ——మహారాణా! కార్యైకతత్పరులకు ప్రమాదాలసత్వ

ము లెందైన బాధించువా ? అది యుండనిండు-ప్రకృతము తమతీవ్రా వణ వేడవచ్చితిమి.

ప్రితా — సాగరా ! నీపేరు సాగర్జీయని యుచ్చరించిన వారికే నాయభయ దానముండ నీవభయమడుగవలయునా? భవానీదాస్-నీవిం దేల వచ్చితివి?

సాగ — దేవా ? అది నిక్కవమేయైనను, ప్రభువులచిత్తములు క్షణక్షణమునకును మారుచుండును. రాజులచిత్తములు క్రూరభుజంగో పమానములు. అట్టిచో నేదివచించినను దోషమేయగును.

ప్రితా — సోదరా ? నన్నెఱుంగవా ? నిర్భయముగ వచింపుము. ప్రితాపుఁడెన్నడును తగరమును వెండిగా తలంపఁడని నమ్ముము.

సాగ — భాగ్యము. అయిన మహారాణాగారీ దుర్గమును రక్షింపనెంచినారా ? తద్రక్షణార్థమెవ్వరిని నియోగించినారు ?

ప్రితా — ప్రభుభక్తిపరాయణుఁడగు దుర్గాదాసును-ఇదియేమి?కొ్రత్తగనడుగుచున్నావు ?

భవా — అయిన మనమీకోటనువిడచి పోవుటయేకదా యుత్తమము.

ప్రితా — ఏమి- శత్రుజనభీషణమగు నీకోటమనకు ప్రాపుగనుండ, పెట్టనికోటలై మీరెంతయు నుత్సాహముండ, మనమీకోటను వీడి పోవలయునా ?

భవా — కోట బూటకమే, కాన. శీఘ్రబుద్ధి పలాయనమేకదా మనకు కర్తవ్యము.

ప్రితా — కామళ్నేరుకోట బూటకమా? ఏమి నీమాటలు నేఁడుచోద్యముగ నున్నవి.

సాగ—చోద్యమంతయు ముందున్నది. దానివిత్తుదివఱకు తిలకింపనెంచితిరేని మిక్కిలిప్రమాదమగు.

ప్రతా—సోదరా! ఇట్టిబాలయాపనచే నామానసమునూరక కలతఁజెందింపకుము. ఇట్టిమహత్తరకార్యములయందు పరిహాసము తగునా! విషయముల వచింపుము.

భవా—ప్రభుచంద్రమా! మనదుర్గమున రాజద్రోహియొకఁడు శాత్రవులతో రాయబారము జరుపుచున్నాఁడు.

ప్రతా—ఏమి-ఏమి- మనదుర్గముననా! రాజద్రోహియా! రాజపుత్రరక్తమునజనించి, యిన్నిదినములు మేవాడునస్యోదకములజీవించి నాపరిపాలనమున మెలంగినవాఁడెట్టివాఁడైన రాజద్రోహమునకుఁ బాల్పడునా?

సాగ—రాణాజీ! నేనేమివచింతు; లోకమున స్వార్థపరాయణత లోకుల కార్యాకార్యములకు, కారణమగునంతవఱకు, దురాశాద్వేషములు మానవులహృదయములు బాయక బాధించువఱకు నెట్టియుద్దేశమునైన పలువురు పలువిధంబులభావించుట లోకసహజముకదా! మీరు రాజద్రోహమనియు, దేశద్రోహమనియు నెంచుకార్యము మరియొకఁడు సర్వజనక్షేమకర దేశోద్ధారణ పుణ్యకార్యముగ నెంచుటయు సంభవమా?

ప్రతా—సాగరా! ఏమి నీనోట నేఁడిట్టివింత మాటలవింటిని? శాత్రవులతో రాయబారము జరుపువాఁడు రాజద్రోహి కాఁడా! జన్మదేశవిక్రయహీనతర కిరాతకకృత్యమెవ్వఁడైన, యేకాలముననైన పుణ్యకార్యముగ నెంచునా?

భవా—దేవా! ఈసాగర్జీ యువరాణాగారు కరుణాతరంగితహృదయులగుటచే ప్రకృతాపరాధమునందలి రాజద్రోహియెడమీరు

గాలివహింప నిట్లు నుడువుచున్నారు. అందును రాజద్రోహి తమయాం తరంగికులలో నొక్కఁడగుటచే—

ప్ర—ఏమి రాజద్రోహి నాయాంతరంగికుఁడా? అయినవాని దుపరాధము మిక్కిలిఘోరము! వచింపుము, తొలుతవచింపు మెవఁడు వాఁడు?

భవా—తమ కెంతయుఁ గూర్చువాఁడు. తమవిశ్వాసపాత్రుఁడు.

ప్రతా—ఆలస్యమువలదు! చెప్పుము?

భవా—తమ-సేనాని! తమ - దు - ర్గా - దా - సు-

ప్రతా—దు-ర్గా-దా-సు! దుర్గా-దాసు !!

భవా—దేవా! వానినిదుర్గరక్షణార్థము నియమించుట మార్జాలమును మూషకరక్షణార్థమై నియమించినట్లు-

ప్రతా—దుర్గా - దాసు - రాజ - ద్రోహి -కల్ల - నమ్మఁజాల విశ్వసింపఁజాల.

భవా—దేవా! క్షమింపుఁము -నేఁడొలుత నే వచింపలేదా? పైత్యరోగికి జగమంతయు బంగారముగ కనుపించునని ?

ప్రతా—దుర్గాదాసు-శాత్రవపక్షముచేరెనా? రాజభక్తి నిమానెనా! వచింపుము? నిక్కమా -వివరమంతయువచింపుము.

భవా—దేవా! నేనేల తమదివ్యచిత్తమునకు సంక్షోభతకలుగఁ జేయవలయు. నేనునుదలివలెఁగాక రాజభక్తియు దేశభక్తియుకల వాఁడనగుటచే రాజద్రోహివాదంతము మనసున సైపఁజాలక వచించి తగుప్రతిఫలమందితి.

ప్రతా—భవానీదాస్! నామది యల్లకల్లోలముగ నున్నది. చెప్పుమా? జరిగినయుదంతమంతయు వచింపుమా!! ఎట్లైననాకర్ణించెద.

సాగ—దేవా! నాకుమాత్రము దుర్గాదాసు పగతుఁడా? ప్ర

థమమున నేనును దీనివిశ్వసింపనైతి. పిదపనీకమ్మనుగాంచి విధిలేకవిశ్వసించితి. నామానసమునందలి సంతాపము నాదైవమెఱుంగు! ఈకమ్మను పరికించిన విషకూపమంతయుఁ దెలియఁగలదు.

ప్రతా.—(జాబుఁగైకొని) అక్షరములు దుర్గాదాసువనుటకు సందియము లేదు. ఇందేమున్నది. "(శ్రీ) యద్యవనసార్వభౌముఁడగు అక్బరు పాదుషా చరణసన్నిధానమునకు - మేవాడు సేనానియగు దుర్గాదాసు వ్రాసికొన్న మనవి. (జాబుక్రిందపడును)

భవా.—దేవా! యేలచాలించితిరి?

ప్రతా.—(ఊరకుండును.)

సాగ.—(జాబుఁగైకొని) నేఁజదివెద నాలకింపుఁడు. "దేవా! ఢిల్లీచక్రవర్తి యేడ? పల్లియలదొర యేడ? పైపైపొంగివచ్చు మహాసాగరమేడ? రొచ్చుకాలువ యేడ? మేవాడు రాజపుత్రులు తమతో తెలివిలేక పోరి మడయుచున్నారు. మావారు ప్రాణమాత్రావశిష్టులై తమసేనలతో పోరఁజాలకున్నారు. వారిసంతాపమును చూడఁజాలక నేనాలోచించి దేవరవారికీకమ్మవ్రాసినాఁడ. నాకార్యముసత్కార్యమగుటయు. బహుమానార్హమగుటయు, నుదారగుణభూషితులగు తామెఱుంగని విషయము కాదు. రేపు బహుళచతుర్దశి భవానీదేవియుత్సవము. కావున మావారందఱు ప్రమత్తులైయుందురు. అపుడు తమసేనకోటఁ బ్రవేశించుట సులభము. దక్షిణపైపుకోట బురుజువద్ద యీలవైచినంతనే దుర్గద్వారములు తెఱువఁబడును. చిత్తగించవేఁడెద.

సేవకుఁడు - దుర్గాదాసు."

ప్రతా.—(ఊరకుండును)

గసా.— దేవా! దీనికింత యోచింపవలయునా? కాని కాలమున కన్నకుమారుఁడునై తమ శాత్రవుఁడగుట వినమా?

ప్రతా—సాగరా! ఒక్కింతసేపు నన్నువిడువుము. నాహృదయమీవిషయము పట్టఁజాలకున్నది.

భవా—మాకీకమ్మయెట్లులభించెనో యాలకింపుఁడు. దక్షిణదుర్గద్వారముచెంత సేవకవేషధారియొకఁడు నాప్రశ్నలకు చక్కని ప్రత్యుత్తరముల నొసంగఁడయ్యె. అందుపై నేను వానినిబంధించి పరిశోధింప నీకమ్మదొరకెను.

ప్రతా—హా శంకరా! ఏకలింగేశా! అప్రతిమానరాజభక్తిపరాయణుఁడనియు, నిరుపమానదేశసేవాతత్పరుడనియు, నెంచినదుర్గాదాసు-నాసోదరునిఁబోలెనున్న దుర్గాదాసిట్టికృతఘ్నావృతకూపమైన నింకెవ్వరినినమ్మి దేశసేవామహాదీక్ష నిర్వహింతు? ఎవ్వరినివిశ్వసింతు?

సాగ—దేవా! ఇదియా యోచించుటకుసమయము, తొలంత దుర్గరక్షణవిషయమున జాగరూకత వహింపవలయుఁగదా!

ప్రతా—నిశ్చయము - ఎవరక్కడ-?

సేవ—(ప్రవేశించి) దేవా! ఏమానతి?

ప్రతా—ఓరీ - నీవీక్షణమునఁబోయి-దుర్గాదాసును-। న్నవానిని నున్నట్లే పిలచికొనిరమ్ము. (సేవక నిష్క్రమణము)

సాగ—దేవా! ఇట్టి యనురక్తులనమ్మియా మనము దేశసేవచేయఁబూనుట? అందుకై కాదె నాఁడు నిండోలగమునసే నట్టియభిప్రాయమును నొసంగనైతి లేకున్ననాకు దేశభక్తి లేదా? పౌరుషహీనుఁడనా?

ప్రవేశము దుర్గాదాసు.

దు—మహారాణాకు విజయమగుఁగాక.

ప్ర—దుర్గా! నాకు విజయమగుఁగాకయని మనసారవచించితివా?

దుర్గా—దేవా? మిమ్మే దైవముగ నెంచికొల్చు మీదాసునకు, మీయభ్యుదయమును, విజయమును, మనసార కోరఁదగినదికాదా? ఏల మీమాటలు నేఁడు వింతగనున్నవి!

ప్రతా—నిశ్చయము! నాకంతయు నేడు వింతగనేయున్నది. ఈ ప్రపంచమే వింతగనున్నది. ఏదీ-ననుచక్కఁగ వరికింపుము. కొన్ని నిగూఢాంశములు నీచే బాహిరవడ వలసియున్నవి.

దుర్గ—సేవకుఁడు సిద్ధముగనున్నాఁడు. ఈదాసుని మనోపేటిక యే నిగూఢశూలములను ధరింపఁజాలదని నమ్మేఁడు.

ప్రతా—నీవు రాజభక్తుఁడవా? లేక పరరాజభక్తుఁడవా?

దుర్గా—దేవా! ఇదియేమిప్రశ్న? నేను రాజభక్తుఁడనగుటయు కాదనుటయు ప్రభుపాలకులగువారెఱుంగరా? దేవా ? ఏల మీప్రశ్నలు నేఁడతిదారుణముగనున్నవి?

ప్రతా—ఉండనిమ్ము. నీవు రాజద్రోహ మొనరింపఁ బాల్పడ లేదా?

దుర్గా—రామ-రామ! ప్రభుచూడామణీ! యెట్టియపరాధమును దానునిఁయందు - మీరు సోదరునిఁబోలె నారయు నీదుర్గాదాసునందు నారోపించితిరి? సర్వకాల సర్వావస్థలయందు రాజభక్తినిమానక, చిత్తారుసింహాసనమే దైవముగనెంచి బూజించు, నీదుర్గాదాసుభక్తివిశ్వాసము లెఱుంగరా?

మ॥ అనుగున్ పుత్రునిబోలె పెంచితివి! సై న్యాధిశతన్ గూర్చితీ వ
 ననుజానీకమునందు జేర్చితి! మహా హార్యప్రతాపోన్నతిన్
 మన మందావహిలంగఁ జేసితిపుడీ మానాపహారంబు నా
 ఘనపాపావహ మైనద్రోహమిడినన్ గారింపఁ గాఁ బాడియే॥

ఎవరైన యీాకనరాని, వినరాని, యవాచ్యదోషారోపణనాపై నొసర్చిన మాత్రమున మీరైన విశ్వసింపఁగలిగితిరా?

ప్రతా—ఏదీ. ఈకమ్మ నింతపరికింపుము?

దుర్గా—(చదివి) ప్రభుచంద్రమా! అక్షరములుమాత్రము నాయక్షరములఁ బోలియున్నవి. కానియిది నేనువ్రాసినది కాదు. శాత్రవులెవ్వరో?—

ప్రతా—ఛీ - పాతకీ! యింకను నీయనృతముమానవా? నీయట్టిరాజద్రోహికి సత్యాసత్యవిచారణ యొక్కటియా? ఇన్నిదినములు మేవాడుసేనానివై, నమ్మినబంటులలో నెల్ల మేటివై,యీప్రతాపునిబహిఃప్రాణమై,తుదకుస్వామిద్రోహమును చేయఁ బాల్పడితివా? నిన్నేమందును. నీవు చేయఁబాల్పడిన నీస్వామిద్రోహమున నిప్పటికంటె నీకు సమున్నతగౌరవప్రాభవాదులు లభించునని తలఁచితివా? నీపైనుంచినగౌరవము - అభిమాన మేసామంతులయెడగాని, తుదకు నాసోదరునందుగాని యుంచి యెఱుంగననుట మఱచితివా? నా ప్రేమకు - నాయభిమానమునకు సముచితప్రతిఫలముఁ జూపితివి.

చ॥ మనమున, నంగమందు, సుఖ । మంజరియందు, ననుప్రతానమం
దు, నిఖిలవేళలందు, ఘన । దోస్తటసత్వమునందు, నేనీ నె
వనగ నభేదరీతి మని, । యంతటనున్న మహాగ్నికీలవై
నను దహియింప, చెల్గితే! య । నారత పాతకమహోగ్రభావనా॥

మ॥ సిరికాసించితి; వానుఁగాక; ప్రభుతా । సిద్ధిన్ ప్రకాంక్షించి, తౌ
సరి; భోగంబుల కోరితౌ సుహితమే; । సంపూజ్యజన్మావనిన్
పరపాదావళిఁ జేర్చి మ్లేచ్ఛజనతా । వాంతాన్నమాశించి, త
చ్చరణాధోగజ ముత్తమాంగమున నా । చ్ఛాదింప నెట్లోర్చితో?

ఇట్లొనర్చిన నాకుండరాని కలుఁగునే, యొక్కఁడు కీడువాటిల్లునే, మీఁదు మిక్కిలి కలుషముకలుఁగునేయని యోచింపవైతివి. స్వకీయ తేజోవిలాసమేవాడురాజ్యవిభూతికే ధూమకేతువైతివి. దుర్వార క్షత్రియక్షాత్రవిద్యోతమునకే వినాశకుఁడవైతివి. దుస్సాధప్రతాపసింహా నామము

నకే భీకర హాలాహలమైతివి. క్షత్రియపాంసనా! క్షత్రియాధమా! అస్మదీయ బాహుదుర్గ పరిపాలితుఁడవైయున్న నీకీ రాజద్రోహ మెట్లు పట్టుపడియె? అస్మదీయ మానాటవీదవానలమా! రాజ్యగౌరవపర్వతదంభోళినాళమా! రాజకులసౌఖ్యప్రభంజన కాలాహివాలమా! సమస్త పాపనిచయకఠోరతరుప్రవేష్టితాలవాలమా! దుర్గాదాసనామకప్రచ్ఛన్నకరవాలమా! మారుమాటాడక సంకోచింపక తెరలుము నాదృష్టిపథమునుండి! తొలఁగుము నారాజ్యసీమనుండి! పెద్దయుంగాలము సుతాధికప్రేమచే పెంచిన కతన నిను వధియింపక విడచినాఁడ. కనికరించినాఁడ.

దుర్గా—(కన్నీరుగార్చుచు) ప్రభూ! తమయానతి శిరమునధరించెదగాని, ప్రభువునకు కీడురానున్న చో మానావమానముల లెక్కించువాఁడను కాను. ఎవ్వానియందు మా ప్రపితామహాదివంశీయులెనలేని భక్తి నిప్రకటించిరో, ఏప్రభువతంసులకై తమమానప్రాణంబులనే తృణప్రాయముగ నెంచి, తమరక్తధారల నవారిగ ధారవోసిరో, ఎవ్వారి గాంచిన నేనును, మామకవంశీయులును. పరదైవముగా భావించి పూజించి, కొలుచుచుంటిమో, అట్టిచిత్తూరుప్రభువుల కెడరుకలుగనున్నతరి, మానావమానములును, గౌరవాగౌరవములును, లెక్కింపను. ఇందఱిమెదుట వారు తామొనర్చిన యవమతిని యెంతైన లెక్కింపను. కాని దీనినుండి మీకును, మీరు పాలింపసమకట్టిన మేవాడు స్వాతంత్రలక్ష్మికిని యనర్థము వాటిల్లనున్నదే యని చింతిల్లెద! దేవా! యిది కృత్రిమపత్రిక, తమదివ్యమానసమునకు కృత్రిమము తెలియనికతన దీనిని నమ్మి నన్ను రాజద్రోహిగ నెంచితిరి. ఇదియంతయు రాజద్రోహుల కపటనాటకము. ఇందలిసూత్రధారులనైతమే నెఱుంగుదు. ప్రభూ! నామానసమెఱుంగరా? చిన్నతనమునుండి నను పెంచి పెద్ద జేసితిరి. మదీయ మానససంకల్పములన్నియు నెఱవేర్చితిరి. ప్రకృతము మాతృదేశ

సేవయు రాజసేవయు మానసమున తృణమైన భాయక, దానికై యూమాషక పంచప్రాణముల సమర్పించి ధన్యత జెందనున్న నను దూరీకరించితిరి దేవా! వలసిన కఠినశిక్ష విధింపుఁడు. పరమసంతసమున భరించెద. సకలోద్యత్కాలకూటపూరపన్నగశ్వేళప్రవాహమున నను ముంచినను నెవ్వగనొందను. లోకానీక భీకరప్రభంజనప్రేరితరౌద్రత్ర్యక్షసంక్షుభితనిటలాక్షుజ్వాలనజ్వాలల నిడి నను దహించినను, నది ప్రభుదాస్యమని సంతసమున భరించుచుంటిని, కాని, ఏ నాలుగక్షరములనంతకుండలకుండలితపణాదంష్ట్రాంచలములో, యే నాలుగక్షరములు, ప్రత్యక్షయాక్షమృత్యుజిహ్వాగ్రప్రత్యగ్రసమగ్రగ్రసరములో, యే నాలుగక్షరములు, నిర్నిద్రనిస్తంద్రసప్తార్చిసమర్చిప్రావణజ్వాలావిపణములో, యట్టి రాజద్రోహ సమక్షరములచే నక్షతక్షత తుత్తుమురౌనర్చి, నీచే నేల నన్నింతవానిఁ జేసిన మీ దయాభావమున హేయపాపసలిలముల కలిపి, కాలరాచి, వేఁగించుట మాత్రమోర్వఁజాలను. దేవా! మీ సత్యవిమర్శనకటాక్షముల సత్యదేవత వాహ్వానింపుఁడు. మీ వివేకవివేచన సుధావృష్టి యీ ద్రోహమును వారయుఁడు. నీనందనుని పరామర్శింపుఁడు. దూరీకరింపకుఁడు. (అని మోకరించును)

ప్రతా— ద్రోహీ! పొమ్మావల! ద్రోహకర్మమలినమగు నీశరీరమును నాపవిత్రాంగముల స్పృశింపకుము. (అని త్రోయును)

దుర్గా— దేవా! హరింపుము. నా పంచప్రాణవాయువుల హరింపుము. నా తనుమానజీవధనముల- కాని నీచరణనళిన దాస్యసౌఖ్యమును, దేశమాతృచరణసేవామహాసౌఖ్యమును మాత్రము హరింపకుము. నిండుమనమున దుర్గాయని కలయందైన పిలచుచుంటివే? దానిని మరచితివా? నీతనయులకంటె నేమిటను తక్కువ కానిమక్కువ బెంచుచుంటివే? ఆప్రేమ నెందుపోద్రోలితివి? దేవా! యింకను కరుణవహింపవా? మీయా

ష్టస్వప్రాంప నేవలయొకదా? హో! యెంద. నాకతికాలఁదివో మొదమీపడ సేవ జాసి, జన్మదేశము వీడిపోవనున్న యీహతభాగ్యునిమాటయొక్కటి పాటింపుఁడు. నేనున్నను, చన్నను, నొక్కటియే కాని, మేవాడుస్వాతంత్ర్యరక్షణముపై సకలరాజపుత్రగౌరవమానధనములే యాధారపడియున్నవి. కానయీదుర్గరక్షణవిషయమునమిక్కిలిజాగరూకతవహింపవలయు. ఇట్టిమహత్తరకార్యమున నట్టివారిని విశ్వసింపరాదు. తుదకు సోదరుఁడే యని యీసాగర్జియువరాణానుసైతము విశ్వసింపరాదు. ఎట్టివారి హృదయక్షేత్రముల నెట్టివిషబీజాంకురములుత్పన్నములగునో యెవ్వరెఱుఁగుదురు.

ప్రతా—చాలు నింక నీయుపన్యాసములు. నీవపరాధివగుటచాలక పూజ్యులగువారినిసైతము దూషింప సమకట్టితివా? ఇదినీయపరాధముకాదు. హెచ్చైన చనువొసంగుట నాయపరాధము. రేపుసూర్యోదయమున కీదుర్గముననుంటివానీప్రాణములు నీవికావు. హెచ్చరిక!

దుర్గ—ఇదియా? కలయందైన మాననినా స్వామిభక్తికి మీరొసంగుబహుమానము కానిండు! ఆదైవమునకు మేవాడుమాతపై నింకను కరుణకలుగకున్న మీరేమిచేతురు. రాజద్రోహులు చిత్తూరు రాజ్యమును నాశన మొనర్చువాఁడు, శాత్రవవాహినీనికురంబములు చుట్టుముట్టి మిమ్మనాథుల జేసి బాధించినవాఁడు, మేవాడు రాజ్యలక్ష్మి, అనాథయై, దిక్కులేక పరితపించువాఁడు, నావాక్యముల స్మరింతురుగాక.

సీ. సత్యంబ సత్యంబు । సలిపి, రాజద్రోహ
విషజంతువులు, పైన । వెడలువాఁడు
మనయింట, మనసభ, । మనలోన మెలఁగెడి
చిచ్చరపిడుగట్టి । చెలగువాఁడు
సామ్రాజ్యసౌధాళి । సకలంబుఁగాల్పంగ

నగ్నిమునుంగున నలరువాఁడు
ద్రోహంబు, ద్రోహియు, ద్రోహజాలంబును
బంధించి మిమ్ముల వరగునాఁడు,
తే-గీ. ఘనపతివ్రిత మీతల్లి గర్భసుధను
బిట్టు హాలాహలంబు తా పుట్టువాఁడు
వెతలఁగనువాఁడు, మే వాఁడు వెడలువాఁడు
తలఁతు నామాట తథ్యంబు ధరణిపాల.

వ్రితా—ద్రోహీ చాలింపుమిఁక నీదురితాలాపముల- నీమోముచూడ మహాపాతకము. (నిష్క్రమము)

దుర్గా—భవానీదాస్! ఇంతటితో కార్యమంతయుముఁగిసెననితలఁచితివా? నీద్రోహ మే నెఱుంగననుకొంటివా? నీదుశ్చింతనములు, నీస్వామిద్రోహములు, నీమాయానటనలు, నీహాలాహలసదృశ గుణములు బయలువడి తత్ఫలానుభవమునకుఁ పాల్పడఁ జేయకమాననని తలఁచితివా? మీకీ మేవాడు మాతకాదు. యవన్మాత పాదతలపరాగ లేశమైనంబా దుర్గాదాసుమేన ప్రాణములుండ మీకు దక్కునా?

సాగ—(తలవంచియూరకుండును)

భవా—చాలు నీధర్మోపదేశములు. రాజద్రోహియగు నీవా మాకు ధర్మోపదేశకుఁడవు?

దుర్గా—ఓరీ! రాజద్రోహియెవ్వరగుటయుదైవమెఱుంగఁడా; నీవెఱుంగవా! మీమానసముల సంపూర్తిగ చావక యింకను ప్రకాశించుచున్న మానససాక్షిణీ దేవత తెలియదా? అంతయేల కాఁతిహీనములై, తెల్లబారి, తమయపరాధమును చెప్పక చెప్పుచుండుమీముఖములే మీద్రోహమును తెలుపవా?

శా. లేదే! మానససాక్షి! ద్రోహులను నా । లింపన్ గనన్ లేదె? లో
కాదే? యంతరసాక్షి! పాపఫలదుః । ఖంబివ్వగా లేదె; తా
లేదే? యాత్మపరోక్షసాక్షి! ఖలులా । ర్తిన్ గుందశిక్షింపదే
యీ దుష్టాత్ముల కేలశిక్ష? హరి మే । యీక్షించు నిక్కంబిలన్.

కానిండు! మీరేమి చేయఁగలరో చూచెద! భవానీదాస్! ఎందో మూలఁబడిన నీచదాసీపుత్రుఁడగు నీవీ యువరాణా చెంత జేరి నన్నునైతము పరకు సేయవా? నేనీ రాజ్యమును బాసినంత నే మీ కార్యములు నిరాఘాటముగ కొనసాగునని తలంచితివా? నేనెందున్న నేమి, మీరెందు జూచిన, నెందు సంభాషించుచున్నను, ఎంతద్రోహ మొనర్చుచున్నను నీదేశ సేవాదురంధరుఁడగు దుర్గాదాసు మీ సమక్షముననే మీ చర్యనవలోకించుచుండునని విశ్వసింపుఁడు! దేవాధిదేవా! శంకరా! నీ కృపాపాత్రమైన యీ దేశమును, నీ ప్రియనందనుఁడగు మా ప్రభువును మా ప్రభుకుటుంబమును నే హానియుఁ కలుగకుండగా పాడుము! జననీ! భరతమాతా! నీకూర్మిపుత్రియగు నీ మేవాడును రక్షింపనీ వే సమర్థవు. మా జననిస్వాతంత్ర్యరక్షణము నీదాసుఁడు నీ కేయప్పగించి పోవుచున్నాఁడు.

సీ. రసపుత్రవిక్రమ । రాజితభిత్తులౌ
ఆరావళీపర్వ । తాళులార
క్షాత్రశౌర్యజ్వాల । కైవడి, గగనాబ్ధి
గ్రోలు సధ్వజపతా । కంబులార
మేవాడుసత్కీర్తి । మిసిమిమీఁగడఁబోలె
తనరారు రాజసౌ । ధంబులార
రాజన్యగౌరవ । రక్షణచేయఁగా
నవతరించిన కాన । నంబులార
గీ. లలితస్వాతంత్ర్య జలపూర । ములవహించు
నవ్యబానాసు, చాంబలు । నదములార

పోయివచ్చెద సెలవిందు! శ్రీ పుడమివిభుని,
మాతృభూమిని మేవాడు మనుపరయ్య.

(నిష్క్రమము.)

భవా—(కరతాళధ్వనిచేయుచు) చూచితిరా! ఉదయపురమహారాణా! వీనిదురభిమానము?

సాగ—(రిచ్చవడి)భవానీదాస్! అపుడే యుదయపురమహారాణాయని యేల సంబోధించెదవు? ఇంకను ప్రతాపుఁడు జీవించియుండు టెఱుంగవా?

భవా—ఉన్న నేమి? రేపటితో నతనియాయుఃకాలము సమాప్తి కాఁగలదుకదా? నేటియర్ధరాత్రిముననేకదా! యీదుర్గమునుమానము మొగలుల స్వాధీనమొనర్ప నిర్ధరించుట! ఈదుర్గాదానుపోవుటచే మనకర్థము పీడవీడినట్లయ్యె! కావుననే యట్లు సంబోధించితిని. దేవా! మీరే మో మేవాడురాజ్యరమానాధులు కాఁగలరు. అపుడు నేను—

సాగ—చెప్పవలయునా! సచివచంద్రుఁడేయగుదువు. అయిన మనమీనాఁడే— యీయర్ధరాత్రిమునే—మేవాడు స్వాతంత్ర్యలక్ష్మిని—మొగలులకు—విక్రయింప—వలయునా ?

భవా—నేనంతయు వచింతు రండు.

(నిష్క్రమము)



# మేవాడు శౌర్యాగ్ని నాటకము

## ద్వితీయాంకము. — తురీయరంగము.

కొమల్మేరుదుర్గము - రాజప్రాసాదప్రాంతోద్యానము.

రాణాబాయి - చింతాకులితయై.

రాణా — అక్కటకటా! నా ప్రపంచప్రియాణ వినోదక్రీడనమిం తటితో నశించెగా? నా యైహికసుఖ మధురఫలసారము నేఁడట్లెటుపిష్కిం చనీరయ్యెగా? స్త్రీసామాన్యప్రశస్తమైన మోహానురాగసుధాకరబిం బము నేఁడు రాహుగ్రహణపీడితమై, శాశ్వితాస్తమయమునందెగా? ఓనిరర్థకనిష్ఫల రాణాబాయిశరీరమా! నీకీ యానందమయభూవలయ మున తావులేదు. నీకు కార్యమూను లేదు! నీయభినవసౌందర్యవిలాస మనోరథములు ప్రళయీభూతములయ్యెను. నీకీ జగద్రంగమున నేమి పని? నీవీకర్మమయశరీరము నిందు బాసి జననమరణరహిత జగదీశ్వరస న్నిధానమున మోక్షానందసౌధమున విహరించెదవుగాక? ఓవ్యర్థతర రాణాబాయి రుచిరాంగమా! నివు నిమాతృభూమియందేకీభవింపుము!! (ఖడ్గమెత్తి.) ఆ! ఆ! ఏమిది! ఈ మధురకంఠస్వరము నన్నేమియోపల కరించుచున్నది! నామానసనికేతనమున నేదియో పలుమారు పలుక రించుచున్నది! ఆహా! వలదా? నాకీశరీరహింసనము పాపమా! ఆత్మ హింసపాపమా! లేదా! నాకు పరమేశ్వరసన్నిధాననివాసభాగ్యము! ఆహా! యేమీ! యీశరీరము నాయదికాదా! మాతృభూమిసంవర్థిత ములైన నీయవయవ రక్తేంద్రియ నాడీమాంసముల నాశన మొనర్ప నా

కెట్టియధికారమును లేదా? నాజన్మదేశజననీ, ననుకన్నతల్లి, నన్నింతదాని గఁజేసిన మేవాడుదేశోద్ధార సలలితపుణ్యపవిత్రదీక్ష వేచియుండ నాకీజగద్రంగమున కార్యము లేదనుట యపరాధమా? ఆహా! అదే! ఆనంద ప్రకాశమండలమధ్య సింహాసనమూర్తి యెవ్వరు? అదియే మామకసకలవిలసిత పుణ్యఫలలలిత తపోభాగ్యరాసి? మదీయజన్మజన్మాంతరసమర్చిత జగదీశ్వరావతారప్రతిమ ! ప్రతాపసింహ జీవితేశ్వర మూర్తి! నాకు సాక్షాత్కరించె! నానేత్రజ్ఞాన జీవజ్ఞానచంద్ర చంద్రికాంతరాశివిలాససౌధమున ప్రకాశించె! నాతోడ సీభారతాంబగర్భమునజనించిననాసోదరులకు, నా దేశీయమిత్రులకు నా మోపినంతచక్షుర్మానస శరీరబలసాహస కష్టములనందిమైన సేవయొనర్చెద ! ఆత్మార్పణమొనర్చెద! నాప్రాణేశ్వరు మాతృసేవా మహాకార్యదీక్షకునేనంకు రార్పణభూతనై జగతిచరించెద ! వ్యర్థతరరాణాబాయి జన్మకుసార్థకతకల్పించెద ! జననీ ! మేవాడు మాతా ! నీతనయాధమమైన, యీయనాథబాలిక, యిదే నీకు నాత్మార్పణమొనర్చుచున్నది. నీసేవయేనాకు పరమపురుషార్థపేటిక ! నీసేవయే నాజీవనలతికా జీవనము ! నీసేవయే మామకకృత్యాకరణీయకృతార్థకల్పకుసుమము ! వివాహాశృంగారవిలాసకా మానురాగవిలాస సౌఖ్యకదంబమా !
దుమునన్నిక! నను నీయంతరమున దింపకుము. ప్రతాపసింహాసుందర
త్రాపగుణసముదార జగదుద్ధారసంచరన్మామక హృదయకీరమా!
భ్యంతరాంతరంగిక ప్రణయేశ్వరునందే లీనమైయుండి నీసకలప్రియుత్న సకలకార్య సకలవ్యవసాయముల దేశసేవకై, జన్మదేశారాధనకై వినియోగింపుము. లెమ్ము ! నిన్నా దేవి యాహ్వానించుచున్నది. ఓసుకుమారపీతాంబరసువర్ణమణి భూషణఘనసారచందనచర్చలారా ! మానుఁడు-ననుమాని, యింకెందైన, యేసుఖినీకుటుంబములనైన నుండి మరల మరియొక జన్మమున నన్నావహింపుఁడు. పొండు.

సీ॥ నా, ౼రాశవమానసంబు ౼ చేకూరె; అయిన నీ
తనువు నీ శేవకై ౼ దాల్తునమ్మ
చక్రివాకాంగనా ౼ సరణి, రాతిరిపొల్చి;
యీపాణిమీరుఁగ ౼ ర్పింతునమ్మ
ఆనంద భైరవి! ౼ యానవనిని; ౼ స్వాతంత్ర్య
సింహాసనాసీనఁ ౼ జేతునమ్మ
విభవకల్యాణి! నీ ౼ వినుతనుతాళికి
కీర్తి జయంబు ౼ చేకూర్తునమ్మ

గీ. బిలహరి సమాను, నావ్రతా ౼ పేండ్రిఁజేరి
సిద్ధసంకల్పు, కృతకృత్యుఁ ౼ జేతునమ్మ
ఘనరసావేరితంబైన ౼ మన మొసంగు
దాన, మేవాడు జన యతి, ౼ ధర్మగాత్రి.

ప్రవేశము-ప్రమద.

ప్రమద—(స్వ) మహత్తర కార్య నిర్వాహణమునందు, బాంధవ్యమును, వావివరుసలును గణనీయములు కావు ! అనవసరరక్తపాతము కార్యనిర్వాహణధౌరేయతకే కళంకమాపాదించుటసత్యమేయైనను, శత్రుశేషము నిష్కంటక వైరి వినాశనసమ్మోదరాజ్యానుభూతికి నంతరాయముకలిగించును ! కావున ప్రతాపుఁడు సకుటుంబముగ నీలోకముబాయనేవలయు! చూచెద నీమోహాతిరస్కృతయగు రాణాబాలనాకెట్లు సాయపడియెడినో ? ౨౪

రాణా—అమ్మా ! విచ్చేయుము! యీయాసనమలంకరింపుము.

ప్రమ—నీవు మలయసింహశేఖాని పుత్రివి కావా ?

రాణా—ఔను—?

ప్రమ—నీతండ్రి రసపుత్రయోధాగ్రేసరుఁడు కాఁడా ?

రాణా—అయిన ?

ప్రియ—అతఁడు శత్రుకృతావమానముల సైచిగాజులఁదొడఁగి కొని యెన్నఁడైన మూలకొదిగియుండెనా!

రాణా—ఇది యేటిమాట ? అయిననది యిపుడేల?

ప్రియ—ఏమియును లేదు ! నీవు మహారాణాగారిని వరించితి వికదా ?

రాణా—దేవీ—?

ప్రియ—వారు నిన్ను నిరాకరించిరికదా!

రాణా—ఆవిషయము తమకేల ?

ప్రియ—నిక్కమే ? యిదిక్రోధార్హమగు విషయమే ! సహనగుణము సజ్జనులయెడ ప్రశంసనీయమగు నేమోగాని, యదిసామాన్యముగ దుర్బలులనే నాశ్రయించును.

రాణా—దేవీ! మీమాటలేమియు నాకర్థము కాలేదు-నేను—

ప్రియ—ప్రత్యక్షముగ నాలకించి, తిలకించి, యనుభవించుచున్నను, నర్థము కాకున్న నది నాయపరాధము కాదు.

ప్రవేశము-విక్రమబాయి.

రాణా—మహారాజ్ఞికి స్వాగతమగుఁగాక !

ప్రియ—మహారాజ్ఞుల కెందైన స్వాగతమునకు కొఱంత యుండునా ?

విక్ర—సోదరీ! యిది యేమి క్రొత్తమర్యాదల కుపక్రమించితివి?

ప్రియ—లోకమున మర్యాదలు క్రొత్తవియా ? రాజకీయకా ములయందును, ప్రభువులయెడను, బంధుత్వమును, వావివరుసలును పాటింతురా ? అదియుండనిండు ; దుర్గాదాసు విషయమేమైన వింటిరా ?

రాణా—దుర్గాదాసు విషయమేమి ? అతఁ డెందున్నాఁడు ?

ప్రియ — దుర్గాదాసా ? మహారాణాగారు సవిమర్శగ నొసంగిన దేశబహిఃష్కృతిశిక్ష నిర్వహింప మేవాడు దేశమును వీడిపోవనున్నాఁడు

రాణా — దుర్గాదాసునకా — దేశబహిఃష్కృతియా ? అతఁడేమపరాధ మొనర్చెను ! నిష్కళంకసుధకు విషసమారోపణము కడుంకడు ననర్థముకాదా ?

అతఁడు దేశవిద్రోహి — ?

రాణా — ఏమీ ! ఏమీ ! దుర్గాదాసు దేశద్రోహియా ? నిర్మలదర్పణమున కెంతైనకలుషారోపణము నైసర్గికము. ఇదిచోద్యము.

ప్రియ — ఇదిచోద్యమా? ధరరాజ్యలాలసత్వశృంఖలముల కెంతశక్తియున్నదో తెలియదా ?

రాణా — కల్ల! కల్ల! ఇదియసంభవము! ఈరాజద్రోహారోపకుల స్వార్థబలము వర్ణనాతీతము.

విక్రి — అదేల ? మహారాణాగారే నిదర్శనపూర్వకముగ విమర్శించి యపరాధము నిర్ధరించినారు.

రాణా — మహారాణాగారీ కృత్రిమప్రపంచము సత్యఫలకమున నారోపించిరా ? విశ్వాసశైలసముద్ఘాటనమున కదిచాలునాయని యోచింపరైరా ?

ప్రియ — ప్రత్యక్షప్రమాణముకన్న విశ్వసనీయమగు విషయమేది మికలదు ?

రాణా — రాజ్ఞీమణీ — సమక్షమింపుము — నాహృదయ మీవిమర్శకమున నెన్నియో యంశములను గ్రహింప సమకట్టినది. లోకోత్తర దేశభక్తి రాజభక్తిధురంధరుఁడగు దుర్గాదాసే యట్టిదుస్సంభవనిందారోపణలకు దావలమైననిక నెవ్వరిజగమునవిశ్వసనీయులో తెలియఁజాల.

సీ. ఖరకరుం డెవ్వానికే ఘన విక్రమక్రమ
రేఖ ద్వాదశరూపు లీనుఁడయ్యె
స్వర్ణాద్రి యెవ్వానికే స్ఫారధైర్యత్రపా
భరత గీర్వాణాంఘ్రి కే చరత నొందె
ప్రభుభక్తినిష్ఠత కే వదయాది సద్గుణ
రాసి యెవ్వానికర కే రత్నసమితి
గిరిశుండు నెవ్వాని కే పరపురనాశత
ధరణి కపాలైక కే ధారియయ్యె.

గీ. సుగుణవానుండు, ధీలీలా కే సుంషు, భువన
భాసుఁడరి వినాశుఁడు, కీర్తి కే లాసుఁడెన్న
దుర్గదాసు రాజద్రోహ కే దుష్టపంక
మలినుఁ డేనాఁడు కాఁడు, నో కే మందమాన.

ప్రమ—దేశభక్తి-దేశభక్తి-ఎందు విన్నను దేశభక్తియే-దేశమెవ్వారిది ? ఎందున్నది ? దానికి పేరెవ్వరిచ్చిరి ? ప్రపంచమే దేశము గాదా ? ప్రపంచాంతరమున నొక భాగమగు దేశమును ప్రపంచమున నేరలపుట దేశద్రోహమా ? ఇదియంతయు మానవకల్పితము, ఇది మానవుల చేతనే మరియొక విధముగ కల్పితమేల కా కూడదు ?

విక్ర—సోదరీ ! ఇదేమి నేడు నీవచనముల నేకార్థబోధకము లున్నవి.

రాణా—మహారాణీ ! అదియుండనిమ్ము-ప్రకృతము దుర్గా ందున్నాఁడు ?

విక్ర—రేపు సూర్యోదయమగు నప్పటికతఁడీ దుర్గమునను ండకూడదు.

(ప్రవేశము-అమరసింహుఁడు)

అమ—జననీ! మనదుర్గాదాసు నేఁడేటికో యానతవదనుఁడై కన్నీరునించుచు-నెందో చనుచున్నాఁడు-నే నెంతయో పలుకరించితిని. కాని తన ప్రేమ సమాదరభావముల నెంతయో కనపరచుచు నేమియు ప్రత్యుత్తరమియ్యకయే యెటికో చనియెను. కారణమేమియో చెప్పవా?

విక్రమ—కుమారా! అతఁడు శత్రుపక్షావలంబకుఁడైన రాజద్రోహి! అతని దేశద్రోహమే యతని దేశబహిఃష్కృతునిఁ జేసెను.

అమ—హరిహరీ! తల్లీ యెట్టిమాటలాడితివి? అంతటిపూజ్యాచారిత్రుఁడు, అంతటి శూరలోకవతంసుఁడు, రాజవిద్రోహహ్రదమున నెన్నటికిని మునుఁగఁజాలఁడు! ఇందేదియో రహస్యముగు నంతర్నాటకమున్నది. అమ్మా! ప్రమదా! దేవీ! యీనాటకమునకు నుపక్రమోపసంహారములు నీవును నూహింపఁజాలవా?

ప్రవేశము-లీల.

లీల—కలదు-కలదు-ఉపసంహారమును కలదు, ప్రారంభమును కలదు. ప్రకృతమీ మేవాడు రాజ్యతంత్రమంతయు, ననేకనిగూఢ శస్త్రములచే, ననేకరహస్యవిషజంతువులచే నిండినిబిడీకృతమై యున్నది, ఇందెన్నియో, మనోహర క్రీడాశైలములు భీకరాగ్నిపర్వతములుగ వెలువడనున్నవి.

ప్రమ—ఔను. ఇందు దేశరక్షణమునకును, వినాశనమునకు కారణభూతులనేకులున్నారు, లేకున్న నచ్ఛినబంగు దుర్గాదాసి వాఁడగునా! ఇంతయేల! త్వరలో నేనంతయు బయలుపడఁగలఁ అయిననిది రాజద్రోహకపటనాటకమైన నిందలి సూత్రధారులెవ్వరో తెలియవలదా!

లీల—ఏల తెలియదు? దుర్గాదాసు పరాభవమును, దేశబహిః

ష్కృతియు నెవ్వరికి యావశ్యకములో-వా రీ-యిందలి సూత్రధారులు!

విక్ర—కుమారీ ! అట్లు మాట్లాడరాదు మీతండ్రియొనర్చిన కార్యముల యందెంతైన ప్రమాదములుండునా ?

రాణా—కుమారీ ! నీవేమియు యోచింపకుము. నిజమునిలు కడమీద బయలుపడఁగలదు. రాజద్రోహులఁ దుష్టతంత్రదుర్బుద్ధులకు చక్కని ప్రాయశ్చిత్తము లభింకపోదు! సర్వసాక్షియగు జగదీశ్వరుఁడు ద్రోహుల శిక్షింపక మానఁడు.

ప్రమ—అదియంతయుమూఢవిశ్వాసము ! ధీశాలు లెట్టి కార్యము లొనర్చినను నిజప్రతిభావిశేషమున కార్యజయముసందుట ధ్రువము ! సత్యాసత్యవిచారణధర్మశాస్త్రముల యందు దప్ప రాజకీయ కార్యముల యందవ్వియుంపదు!

లీల—ఏమీ ! సత్యమునకు జయసిద్ధియీలోకమున కలుగదా ? ధర్మదేవత నామమాత్రావశిష్టయయ్యెనా ? అధర్మకరణమే జగదీశ్వరునకు సమ్మతమా ?

ప్రమ—సమ్మతమగుఁగాక. అసమ్మతమగుఁగాక- దైవమునకు మానవులకృత్యాకృత్యముల విచారించిశిక్షించుటయొక్కటే కార్యమా?

లీల—సోదరా ! యిదికడుజాగ్రతతో నిరీక్షింపవలసిన విషయము. మన శేనావారమును, దుర్గమును, సప్రమత్తతో రక్షింపవలయు ! రమ్ము ! పోవుదము. (లీలా-అమరసింహులు-నిష్క్రమింతురు)

(లోపల మహారాజ్ఞీయని)

విక్ర—అదే-నన్నెవ్వరో బిలచుచున్నట్లున్నది-నేపోయివచ్చెద.

(నిష్క్రమించు.)

రాణా—దైవము శిక్షించినను, శిక్షింపకున్నను, ధర్మోద్ధారకులు కొందరు ద్రోహశిక్షణమును, శిష్టరక్షణములనే తమజీవితముఖ్య

కార్యములంగ నిర్ధరించియుండు వారు లోకమున నుండిరా !

ప్రియ— అట్టివారికై భీతిల్లి స్వకార్యదీక్షాబద్ధులు స్వీయకార్యప్రారంభమును మానుదురా !

రాణా— కానిమ్ము, లోకమున ధర్మమట్టే ప్రళయీభూతమగు నేమో చూచెద! నాజీవితమును, ధర్మస్థాపనకై కాకున్నను, నధర్మశిక్షణమునకైన ధారవోసెద! లేకున్న తత్ప్రయత్నమున నా ప్రాణముల నేని బాసెద!

ప్రియ— తథాస్తు! అభీష్టసిద్ధిరస్తు. (నిష్క్రమించును.)

రాణా— నౌకసముద్రమున నేనుండఁగలను. సముద్రమున నే మునుఁగగలను. కాని, మహార్ణవసంచరమైన, యీ నౌకను పట్టుట మదీయోద్యమునకు ఫలభూతము. కార్యతంత్రము నతిజాగరూకతతో కాలవిళంబము లేక, ప్రవర్తిల్లఁజేయవలయు. ఏదియెట్లున్నను, వీరలోకసంస్తవనీయుఁడైన దుర్గాదాసు, యీ దేశమునకు పెట్టనికోటయై యుండక తప్పదు. ఈయన సత్యాపవాదహిమానీసంచయము పటాపంచలు కావలయు! అంతవఱకు, దుర్గాదాసు స్వర్గముననే పరిరక్షింపబడవలయు. ఈతంత్రమునకు, ముఖ్యఫలము రాజ్యాపహరణమును, ప్రతాపసింహ ప్రాణాపహరణమును నై యుండవలయు. ఈ రెండర్థములకయ్యే దుర్గాదాసు నపవాదారోపణమున కడుంగడు ప్రతాపసింహాహృదయమునకు, సామీప్యమునకును, దూరుఁడయ్యె. ఆరెండనర్థముల బాపుటకయ్యె దుర్గాదాసు శౌర్యాద్భుత సాహసము లావశ్యకములై యున్నవి. కాన నేనిపుడే దుర్గాదాసును సమీపించి కర్తవ్యసోపానముల నధిరోహించెద! మేమిరువురమును పవిత్రతర మేవాడు స్వాతంత్ర్యోద్ధారణ నాటకమునకు సూత్రధారులమయ్యెదము.

(నిష్క్రమించును.)

---

# మేవాడుశౌర్యాగ్ని నాటకము

## ద్వితీయాంకము - పంచమరంగము



(సాగర్జి భవనము- సాగర్జి యుపవేశించియుండును)

సాగ- ఇదెచనుదెంచెనా | హృదయగుహాసుప్త
శౌర్యశార్దూలంపు | కామ్యసిద్ధి
ఇదెపొడసూపెనె | మన్మదవైరసంశుద్ధి
విస్ఫులింగోత్కర | వేదికన్య
ఇదెపైనపరతెంచె | విదితమేవార్నాశ
వృష్టిమేఘాగమ | వేళయిపుడె
ఇదెవ్యోమవ్యాపించె | హృదయ సంతాపార్క
గ్రసనకేతూదయ | గ్రహణవేళ
గీ॥ ముంచెనరిభూమి, నూర్మి వ్యా | పించెజగతి
పెంచెమద్యత్నగ్రాహాళి | మించెబడబ
విలయజలరాసి విమతాసి | ప్రళయకాసి
ఇదియెప్రాపించె మేవాడు | విస్ఫురించె॥

నావైరివినాశనవ్రతదీక్షయందలి ప్రథమాంకము సమాప్తమ్యో! ద్వితీయాంకమీనాఁడే ప్రదర్శింపఁబడఁగలదు. నాశాత్రవు నొక్కఁడగు దుర్గాదాసునకు చక్కనిపరిభవముగలిగె. దుర్గరక్షణభారమునాయందుంచఁబడియె. ఇఁకమిగిలినదెయ్యది? ఈదుర్గము మొగలుల స్వాధీనముఁ జేసంగి, వారిచే మాప్రతాపుని నంతమొందించుట నేకదా కర్తవ్యశేషము! ఆహా! యిదియేమిచిత్రము! నాకార్యజయ

మునన్ను వరించుకొాలఁది, ప్రతాపపాలితమగు నీదుర్గమునందు శిశోదీయావంశసంపూర్ణస్వాతంత్ర్యపరిణామకాలము క్షణక్షణమునకుఁ జేరువయగుచున్నది, మేవాడురాజ్యము నాకరగ్రహణమునకై నమీపించుచున్నది, నాహృదయమునఁ జేయిపెట్టి కలఁచినరీతి సంతాపమెక్కువయగుచున్న దేల! హృదయపంకజమునఁ దెన్ని యో శతసహస్రవిపాతంబు లుప్పతిల్లుచున్నవి! హృదయమా! భవత్సమీపముననున్న సంకోచవికోచశబ్దములు, నీమేవాడురాజ్యసార్వభౌములు గాలచ్ఛిని రాజపుత్రస్థానభూమినుండి తొలగించు హుంకారశబ్దంబుల ననుకరించుచున్నవి కావా? నేఁడున్న దిత్వదీయ ధైర్యస్థైర్యవిభూతి! అకటా! అగణ్యపన్నగదంష్ట్రాదంశనవేదనముఁబోలె, నాయాత్మసాక్షి, నామనస్సాక్షి, నను బాధించుచున్నదిగదా? ఆహా! ఇది దుర్భరము- దుర్భరము- అయ్యో! మానససాక్షిణీదేవతా! నీచిత్తూరురాజ్యపిమామణి, రేపటిసూర్యోదయమునుగాంచనేరదని ప్రతిలవలవమునఁ దెలుపు, నన్ను నుద్బోధించెదవా? కట్టా! నే ఘోరపాతకిని, నాకిహపరలోకములు దూరములని నిందించెదవా? ఇదితగదు, ఇదియన్యాయమని సదయముగ నివేదించెదవా? ఔరా! సియట్టియ చైతన్య, అరూప, అనుభవైకరూపమగుదు స్సాక్షిని, నరకుగొని, యీసాగర్జి, స్వసహోదరబద్ధవైరిప్రతీకారపుణ్యవ్రతమూనుననుకొంటివా? ప్రళయకాలరుద్రానీకరౌద్రవిజృంభణమెక్కపెట్టునఁ జేనాపైఁబడినఁ బడుఁగాక! లయకృత్యనియోజిత, ప్రాణిప్రాణహరణ, కాలముకాలదండచండఖండనములకే దావలమైన యగుదునుగాక! నదహానవాలుతాశాగ్ని ప్రజ్వలనజ్వాలలేనను దార్కొనునుగాక! గర్జికరపంజరబద్ధమగురాజ్యమా, పరజనకరకమలముఁ బ్రాలకతప్పదు, అక్కటకటా! తప్పదా! తప్పదా!! —ఈబాప్పారావుపంశశంసిత, ప్రశస్తశౌర్యరక్తమింకను జగద్విదితమైయొప్పారుచుండ, మాస్వాతంత్ర్యలక్ష్మిని, మామాతృదేశస్వాతంత్ర్యమహాధననిధానమును,

మా వంశపూర్వికరాజన్యశౌర్యపణసమార్జితప్రాణధనమును, నీనాఁడు
యీపాపపునాఁడు- యీయనర్థమునాఁడు- నేను- వీరాభాయినందనుఁడ
నగునేను- పరులకప్పగించుటతప్పదా! తప్పదా! పరలోకరౌరవనరక
కూపనిశ్రేణిక తప్పదా! దుర్భావనుస్పృహ దుష్కీర్తియీలోకము
నతప్పదా! అయ్యయో! మాపూర్వికరాజమార్తాండులు, నిజరక్తధా
రాసారబలశక్తిసాహసములకానుకగనిచ్చి యీమేవాడురాజ్యరమాబా
లిక నెట్లో స్వాతంత్ర్యపీఠినిలిపి, యజగామరశాశ్వతకీర్తిచంద్రికనార్జిం
చి, తమవంశీయులకు నిదర్శనప్రాయముగనుండుటకై కీర్తి జయస్తంభా
దులనిర్మించిరి. వారిసంతతిని, వారిరక్తబిందుసంతతిని, వారిచక్రప్రతిద్వం
ద్వవిక్రమ ధురీసంతతిని, నుద్భవించిననేను, నీమేవాడుసామ్రాజ్య
సుస్థిరయగురాలచ్చిని,యస్ఖలితస్వాతంత్ర్యసత్తాశక్తిని,నాశమొనర్చి, తు
త్తుమురొనర్చి, పరరాజన్యరక్తగంధమునకలవి వారికివీరగంధావలేపన
మొసఁగుదునా? ఆహా! అదియేమి? చిత్తూరుస్వాతంత్ర్యమహాలక్ష్మి! నేత్ర
శతపత్రములనుండి నిరర్గళాశ్రుధారలువ్రాల, నెమ్మోమున విన్నందన
ము మూర్తీభవింప, వివర్ణకృశీభూత వికారచైతన్యవిహీనదేహావల్లరివ
ణంకుచుండ, నేడ్చుచు, నన్నుశపించుచు, నాసన్నిధానమునుఁ బాసిపో
వుచున్నది! జననీ! నేను నినునాశిలఁజేయను. ఇప్పటిసమున్నత వైభవవి
...నస్యసంపదలకంటెవేయిరెట్లెక్కువప్రాజ్యవిభూతినీకుచేకూర్చెద,
...గ్య! వలదా! నీకాసార్వభౌమ కరలాలితమహాపదవివలదా? నీ
...ంత్ర్యవినాశనమున లభించుమహేంద్రపదవియైన నిరసించెదవా!
...హో! కనుల శోకవిస్ఫులింగములుగదుర, వాకోశసంస్థితిహస్తతల
విరాజితకపాల ధారిణివై, యూత్తేతుణవీతుణకాతరితశాత్రవసందోహ
వై, నానాకరవాల పరశు ధనుర్బాణాదిశస్త్రాస్త్రహస్తవై, నాపైపర
తెంచెదవా! ఇట్టికులనాశక, కులనిందక, క్షత్రియకులనాశక, స్వదేశ

స్వాతంత్ర్యనాశకుఁడనుండుటకుఁబై ముంచుటయేమేలని శోకాశ్రు ధారాసంతతిగలితకరవాలధారా సహస్రముల మ్రిందింపనే తెంచెదవా? ఆహా! ఇదియేమి మాయయో! లేక మతివిభ్రాంతియో! కానున్న నైంద్రజాలిక విద్యామహిమయో! వీరాబాయి! మదీయజననీపదపవిత్రి భూషితయగు వీరాబాయి? మహాదృశపుత్రినహస్రశౌర్య ప్రబోధిని వీరాబాయి! అమ్మా! యిదియేమి! వీరస్వర్గమునుండి నీనందనునిచే ష్టాకృత్యాదులఁ బిలకింపఁ జనుదెంచితివా? నీపూర్వికులు, యేడిల్లీశుల, యవనచక్రవర్తులజయించి, జయస్తంభముల స్థాపించి మేవాడుపాలించిరో యట్టివంశమునజనించి, యదే డిల్లీశ్వరులకు యవనసార్వభౌములకు, పూర్వరాజన్యశౌర్యనిదర్శనాదులకు నిలయమైన యీదుర్గమునువిక్రి యించెదవా?" యని నాపైకోపమా! యీపైత్తి, నార్తి, నామరణము నకై వేచియున్న శిశోదియా రాజ్యలక్ష్మిని కాపాడఁజనుదెంచితివా? నేను నీనందనుఁడఁ గాను. భ్రాతృవైరదూషితుఁడను. దురంతాసూ యాభోగానమాక్రాంతచిత్తుఁడను. స్వమాతృ, స్వదేశ, స్వగౌరవ, స్వ రాజ్య, స్వవైభవ స్వప్రాణమాన ధనములపరులకు, శాత్రవులకు, విక్రి యింపనెంచిన బలుకూళను. ననుస్పృశింపకుము, చేరకుము. పరమపవి త్రితరమై, సర్వభువనపాలనవ్రతదీక్షాబద్ధకంకణమై, యిట్టిఅశ్వరునంతటి వారిపదిపేవ్రసనిజనఖరాగ్రరేణుశకలముఁ నిలువరింపఁజాలుసీయమోఘ భక్తాభయదాననిపుణమైనకరంబున ననుస్పృశించినందున కలిగినయా పవిత్రతాదోషమునుచేకూర్పకుము? ఆహా! ఎదియీజననియుదయాహో లక్ష్మీసహితమై, నిజకరుణాకటాక్షనిస్సరత్కృపారసపూరంబువెదసీ చు, మేవాడుభూమి నాశీర్వదించుచు, క్రేగంట నస్తోక కృధారసస్ దుసందోహములనాపైనవారిగ ప్రసరించుచుపోవుచున్నది. అయ్యో యో! కన్నతల్లికిసైతము కానివాఁడనైతి. ఔరా! ఇంతేల యోచింపవలె యు? అపుడేలోకమస్తమించెనా? గడపయలికినంత నేకంజాక్షుపూజనలి

పిసినల్లయ్యోనా? క్రోధమా! యింక నా చెంతకు రాకుము! పవిత్రతరక్షత్రియ కులోద్ధారకమైనయీజన్మమును ధన్నము, మన్నను, మఱంతదురధిగమ్య, దుష్కీర్తిరౌరవనరకపాత్రముగ నొనర్పకుము. ఇంతవఱకు నీమిత్రులగు నసూయాద్వేషాగ్నులు బలిమిచే నన్ను మాతృబద్ధకనకసాలభంజికవోలె నీయిచ్ఛవచ్చినట్లాడించితివి. ఇప్పుడీసాగర్జి పరమసత్త్వగుణమయుండై, అఖండవిజ్ఞానమనస్సాక్షిప్రకాశిత తేజోవిన్యాసుండై నిక్కంపురాజపుత్రుఁడన నలరారుచున్నాఁడు. (ప్రవేశము ప్రమదము రుగున, శాత్రవులకా! సోదరులకు, యేకమాతృసంజాతులని, సోదరధర్మంబుల పాటింపక మమ్ము పరిభవింపనెంచిన మొగలులకా మేవాడుస్వాతంత్ర్యము నప్పగింపుట! అదియంతయుకల — అదియంతయుకల్ల - అదియంతయు మనోభ్రమ - మానెద మానెద.

ప్రమ—(సాగర్జిఁబోఁబోవ - చేయిపట్టుకొని) ఏమి మానెదరు? నాఁడుమిమ్ము నిండోలగమునక్రిందికీడ్చి పారవైచి మీరాజపుత్రినామమునకే కళంకమాపాదించిన మీశాత్రవులమీఁద ప్రతీకారచింతనవా? మీకై, మీకరగ్రహణమునకై వేచియున్న రాజ్యరామామణిపరిణయమునా? లేక, క్షత్రియవంశమునజనించిన పురుషసింహుండనుట సార్థకపఱచెద ననుమీప్రతినయా?

సాగ—ప్రమదా! దుర్గ్యమర్మదా! మత్కులనాశనప్రమదా! తృదేశగౌరవహారణపిశాచపదా! పొమ్ము నాదృష్టిపథమునుండి! హీనదుష్కర్మ దురాకృతకార్య హాలాహలమునదిగినది చాలక ము దానముంచెదవా? తొలఁగుమావల?

ప్రమ—నేతొలఁగెదనా? మీరు ప్రాణములనుండి తొలఁగెదరా! మీకిట్టి పిరికితనములవచుట నాదౌర్భాగ్యము. మీచేనవమానితుఁడైనదుర్గాదాసేమిచేయుచున్నాఁడని తలంచితిరి? నేఁడో, రేపో మీకు

త్రిమము బయలువఱచిమీకొంపలార్ప రానున్నాఁడు. అప్పుడెవరుండ లేఁగెదరో చూచెదరఁటలెండు.?

సాగ—ఏమీ ? దుర్గాదాసింకను నీదుర్గముననున్నాఁడా! రేపు సూర్యోదయమగునప్పటి కతఁడీదుర్గముననున్న మరణదండనకుపాత్రుఁడు కావలసివచ్చుకదా!

ప్రిమ—వాఁడూరక మీకేమియు ప్రతీకారమొనర్పక చేతగానివిందవలె తలమీద బట్టవేసుకొని పోవునని తలఁచితిరా!

సాగ—ఎవరున్ననేమి? ఎవరుచచ్చిననేమి! ఉన్నయుదంతమాత యుమా యన్నకువచించి మన్నింపవేడెద. మరల మేవాడుస్వాతంత్ర్య దేవత నీదుర్గమున సుస్థిరగానిలపెద.

ప్రిమ—ఏమినిలపెదరు? మేవాడుస్వాంతంత్ర్యము నాకిఅది మీరు కాదు. మీవంశీయు లందరునువచ్చినను కాఁజాలదు. నేఁడు మీనుండి కాకున్న, రేపో, మరునాఁడో సార్వభౌము సీచలీదుర్గమునుసాధింపగలవు. మేవాడుస్వాతంత్ర్యదేవత యాయుఃకాలము కొన్నిఘడియలకు కాకున్నను కొన్నిదినములకైన నంతమగుట విధివిధానము.

సాగ—నిక్కము. అక్బరుపాదుషామానసమున నీరాజ్యమును సాధింపవలయు ననుబుద్ధిజనించినతఱిణమే యీదేశస్వాతంత్ర్యదేవత యాయుఃపరిమితిదినములపైనున్నది. అయిననది నాచేజరుగవలయునా ?

ప్రిమ—మీయోచనకు నాకు నవ్వువచ్చుచున్నది. మీరున్న సంగతి యెప్పికొనిన మీయన్న మిమ్మూరక విడచునా? మీయన్న మీయగ్రజుఁడే, "వీఁడు రాజద్రోహి;వీనిమనవివ్వరాద"నితఱిణమే చర్మమొలిపింపఁడా! అపుడు మీకునిలచునదేది? దుష్కీర్తియే. ఉరిశిక్షమరియొకటి! మేవాడు రాజ్యశ్రీ శిశోదియావంశమును బాసి మొగలులవశమగుచుండ, మీరు కనికరించి, మీశేముషీప్రభావమున దానిని మీయందే, మీవంశమునందే సుస్థిరగనొనర్పుటద్రోహమా ?

## ద్వితీయాంకము.

మీప్రతాపుఁడు స్వపరబలతారతమ్యములవిచారింపక దేశస్వాతంద్ధారమను మూర్ఖాభిప్రాయమునకై వేలకొలంది ప్రజల, రాజపుత్రుల బలియొసంగి, రాజపుత్రస్థానము నేనిర్మానుష్యముగ నొనర్చుచుండ, కరుణాతరంగితహృదయులై, మీరు ప్రజలకు ప్రాణదానమొసంగి, దేశమాతను గాపాడనున్నారు. ఇది దేశద్రోహమా? మీరే యోచింపుఁడు!

సాగ—ప్రమదా! సత్యము! నీవాక్యము సత్యము! మోహనాంగీ! నాకేమియుఁ దోపకున్నది. నాయొడలంతయు దురంతదవాగ్నిచ్ఛటాసందోహముల పొదలుచున్నట్లున్నది. హృదయమున ననేకసహస్ర వృశ్చికము లొక్కపెట్టున నన్నావేశించి, కరచినపగిది మహావేదనకలుగుచున్నది. నాశిరము నాపైనిలువకున్నట్లున్నది. ఆజయస్తంభము నన్నుఁజూచి “నీవు ఘోరపాతకివి! నీకీబాధయెంతయు తగినదే” యని పరిహాసించుచున్నట్లున్నది.

ప్రమ—ఈపిచ్చియే మీకార్యభంగమునకు కారణము. ప్రతాపుఁడును, నతనికుమారుఁడును జీవించియుండువఱకు మేవాడునకు క్షేమముకలుగదు. ప్రజాబృందమునకు సుఖముకలుగదు. మీప్రతాపుని యొక్కనికొఱకై దేశమే విధ్వంసమగుట సమంజసమా? రండు? నేనంతయు సమకూర్తు. పాదుషాకడ మీరు సమ్మతించిన తెఱంగున క్రమమును సార్వభౌముని వశమొనర్ప నిదియేకదా సమయము-రండు

(నిష్క్రమము)

శ్రీ

# మేవాడుశౌర్యాగ్ని నాటకము

## తృతీయాంకము — ప్రథమరంగము.

రాజభవనము; ప్రతాపగోపీనాథులు ప్రవేశించియుందురు.

ప్రతా — గురుచంద్రమా! మీమాటలు సత్యములేయైనను నేనో ర్పంబూనిన మహాకార్యమున నెట్టివారి కేకాలమున నెట్టిబుద్ధిపుట్టునో యెవ్వరెఱుంగుదురు? నాకు దేశసేవా మహాకార్యమునసాయమొనర్చు వారపవాదమునకు నైతము బాహిరులుగనుండవలయు.

మ॥ సతియైనన్, సుతుఁడైన, భ్రాతృసముఁడౌ నస్మిత్రుఁడైనన్ సుధీ
గతిమేవాడుపురంధ్రిపై, దొసగులన్ కల్పించునీచాధముం
డతిశత్రుండగునాకు, దేశజనప స్వానందస్వాతంత్ర్యమున్
మతిచేకూర్చెడువాఁడు మిత్రుఁడెపుడున్ మాన్యుండు ఖాకీధరన్॥

కావుననే వానిచంపకవిడచినాఁడ. వానిభావిప్రవర్తనమే వాని శిక్షావిధర్తనిగ నొనర్చుటకును, వాఁడెట్టివాఁడనుటకును, కారణమగును.

గోపీ — ఒకవేళ నిరపరాధియగు తన్నవమానమునకు గురిచే యన్యాయముగ శిక్షించినప్రభువునెడ కోపముచే నకార్యము చేయఁ ల్పడిన?

ప్రతా — ఆర్యా! అతఁడు దేశభక్తుఁడేయైన, నేను సవిమర్శ నొసంగిన శిక్షకై కోపగించి దేశద్రోహము చేయఁ బాల్పడునా! ఈవిషయమునఁ ననుమరల మరల ప్రశ్నింపకుఁడు - అదే సాగర్జి వచ్చుచున్నాఁడు.

(ప్రి. సాగర్జీ—యుద్ధసన్నద్ధుఁడై)

సాగ—ప్రితాపసింహ రాణాకభివాదనములు.

ప్రితా—సోదరా! ఇది యేమిట్టి వేళసైతము యుద్ధసన్నద్ధుఁడవై చనుదెంచితివి?

సాగ—యుద్ధమునకుఁబోవుచో యుద్ధ సన్నద్ధుఁడుగనుండవలదా?

ప్రితా—ఇంకను తెల్లవారుటకు రెండు ఘడియలుండ నిప్పుడు యుద్ధమెక్కడ?

సాగ—దేశరక్షణార్థమై దుర్గద్వారము చెంతకుఁబోవుచున్నాఁడ!

ప్రితా—దుర్గద్వారముల చెంత సైనికుల ప్రమత్తులై యున్నవారో లేదోయనిచూచుటకేగుచున్నాఁడవా? నిజాగ్రితయెంతయు ప్రిశంసనీయము. అయిన మనసైనికులందఱు రాజభక్తిభూషితులు. ఈదుర్గరక్షణముపై మేవాడుస్వాతంత్ర్యిదేవతరక్షణ మాధారపడియున్నదని యెవ్వరెఱుఁగరు?

సాగ—సత్యము. మేవాడు రాజ్యశ్రీ యీదుర్గముపై నాధారపడియున్నది.

ప్రితా—సోదరా! నీవలనఁగదా! దుర్గాదాసును రాజద్రోహిగ నెఱింగితి. నీవులేకున్న నెట్టిప్రిమాదమగుచుండెను.

సాగ—ఒక్కగురుతించుటయేనా! నావలన దేశమునకింకను ...మము కలుగనున్నదో ముందు తెలియఁగలరు.

ప్రితా—సాగర్జీ! నీయట్టిసోదరుఁడుండ నీదుర్గరక్షణవిషయమున ట్టిచింతయుఁ గలుగదు.

సాగ—ఈదుర్గవిషయమున నేగాకయీ మేవాడువిషయమున నే యెట్టిచింతయు మీకుఁ గలుగకుండ నొనర్పుటకై కాదె నేనింతశ్రిమిం చుట?

ప్రతా—నిక్కము. అయిన మనమీదుర్గమును నాల్గుదినములు కాపాడఁగల్గితిమా మనభిల్ల సైన్యమిందు రాఁగలదు. మనకపుడు శత్రు బాధయుండదు.

సాగ—నేనుండ మీకు శత్రుబాధ యు లేదు. మిత్రుబాధయు లేదు. అంతయు నే నెఱుఁగుదు.

చ. అలమట లేసి శాశ్వత ♦ సుఖానుభవంబొనగూర్తు మీకు; కా
ర్యలవము నైనచుండ దభీ ♦ రామత పూర్వికులున్నచోట నిన్
నిలిపెద; నీకు,మారకుఁడ ♦ నేననుమాటయె సత్యమయ్యెడున్,
కలుగదు యింతకంటె మరి ♦ కాంక్షిత మీభువి నాకు భూవరా!

ఇఁక నాకు సెలవిండు. మరల త్వరలో నన్నుచూడఁగలరు.

(నిష్క్రమించును)

గోపీ—మహారాణా! నేనెంత ప్రయత్నించినను యీసందేహము నను బాయకున్నది. నాకు నిన్న రేయికలిగిన దుస్స్వప్నమునకుఁదోడు యీసాగర్జి పలుకులన్నియు భావగర్భితములై యున్నవి. అర్థాంతరమును సూచించుచున్నవి. ఏదియో యనర్థము వాటిల్లనున్నదని నామనస్సాక్షి చెప్పక చెప్పుచున్నది. ఈసాగర్జిని విశ్వసింపకుఁడు. దుర్గరక్షణభారము ను మీరే స్వయముగ వహింపుఁడు.

ప్రతా—శాస్త్రిజీ! మీరు సందేహించున దెవరిని ? సాగర్జి నా సోదరునా? వాసమేన పావనశిశోదియావంశరక్తమింకను ప్రవహిం చుండుట మఱచితిరా? దుస్స్వప్న భయమునను, దుర్గాదాసునెడ న్న గలవాత్సల్యమునను, మీమానసము కలతఁజెందియున్నది. (వెను నున్న కవచము భయంకరశబ్దముచే నేలఁగూలును.)

గోపీ—మహారాణా! ప్రతాపా!! కుమారా!!! నామాటయొకటి పాటింపుము! అదే-యీదుశ్శకునమునుగంటివే? ఈనాఁడేదియో యనర్థ ము తప్పక వాటిల్లనున్నది. లెమ్ము-ఆలసించిన ప్రమాదమగు. ఈసాగర్జి

ననుసరింతము- సైకొమ్ము నీకరవాలమును- లేకున్న- నాకుసెలవొసం
గుము.

ప్రతా—గురురాజ్! ఏలనేడిట్లు భీతిల్లుచున్నారు, శిశోదియా
వంశగురుపీఠ మలంకరించిన మీకును భీతియా? కానిండు- మీరుపొండు-
నేనును సత్వరముగవచ్చెద.

గోపీ—శీఘ్రముగ రమ్ము- నేనుదక్షిణద్వారము చెంత కేగెద.

(నిష్క్రమించును)

ప్రతా—ఆహా! ఏమి! నేఁడు నాహృదయమున నైతమేదియో
తాపముకలుగుచున్నది. బాప్పారావువంశీయులు కలయందైన తలంప
రానిభీతి హృదయమున పొడసూపుచున్నది. మానసమూహదనే శంకిం
చుచున్నది.

మ॥ తొలఁగెన్ ధైర్యము; శౌర్యసారమవిసెన్; తూలెన్ సముత్సాహము;
కలఁగెన్ మానసమేటికో? కలిగెనం గాకంపమాశ్చర్యమై;
చెలఁగెన్ భావము లెన్నియో మదిని! నాశిల్లెన్ భుజాసారమీ
ఫలితం బేమగునొక్కొ? దేశజననీస్వాతంత్ర్యమెట్లౌనో!

గురువర్యుని వచనములయందు సత్యముండునా! ఈసాగర్జి దేశ
ద్రోహి యగునా! ఔరా! శిశోదియావంశమున జనించి, నాయట్టివానికి
సోదరుఁడైన సాగర్జియా ద్రోహమొనర్చుట! కల్ల! కల్ల! కల్లయైన నీమళ్ళ
ఁల నేమనవలయు? హృదయమా! వీరలక్ష్మినివాసస్థానమా!
ఏము. ఈదుర్గమొక్కటి సురక్షితమైయుండ నెట్టిశాత్రవుఁడును,
ర్వభౌములును నిన్నేమియు చేయఁజాలరు. (లోనకలకలము)
అదేమి కలకలము! సైనికకోలాహలముఁబోలెనున్నది. నేశంకించి
నదయేనిక్కువమైయుండునా! రామరామ! అట్లెన్నటికిని సంభవింపదు.
అదేదియో విచారించెదఁగాక. సేవకా! (ప్రతిశబ్దము రానిచో, కోపమున)
సేవకా! సేవకా! ఆహా! యిదియేమి- సేవకులొక్కరును లేరా! నామా

టపాలింపనుక్కరుసులే—! (లోనదీన్, దీన్, శబ్దము ల)హా! భవానీ అంబా! అంతయు, నేశంకించినదంతయు, నేనూహించినదంతయు,కలుగఁజేసితివా? రాజపుత్రయోధవరుఁడెంతయు తలవంచుభంగి యొనర్చితివా?

(ప్రవేశము-శీఘ్రయానమున భామాసా)

భామా—మహారాణా! అపాయము- అపాయము-శాత్రవవాహిని సముద్రతరంగములవోలె లోనఁజొచ్చుచున్నది. ప్రాణములకు తెగించి, మనసేనపోరుచున్నది. జయము దుర్లభము.

ప్రతా—భామాసా! కోటకావలివారెవరు ? కోట యెట్లు మొగలులస్వాధీనమయ్యె? మీరుండియు నీయుమ్మలమెట్లుకలిగె ?

భామా—దేవా! మాటాడుటకవకాశములేదు. శాత్రవులెదవైనున్నారు. ద్వారములు సాగర్జియువరాణాగారిస్వాధీనమునందుండెను. (లోపలసాగర్జి-రహీం-కలకలము) అదే-అందుచూచితిరే సాగర్జిశాత్రవమతమువలంబించి మంచిసేన నురుమాడుచున్నాఁడు. లెండు-మేవాడును రక్షింప మీరొక్కరు సురక్షితస్థానము చేరుఁడు.

ప్రతా—హా! దుర్గాదాస్! నీసమంచితహితవాక్యముల నాలింపమికి ఫలముచిరకాలముననే యనుభవించితిని. భామాసా-హమ్మ-నాకైయోచింపకుము. (కరవాలమొరనుండిదీసి) చేతకరవాలముండువఱకు నీప్రభువునకెట్టిహానియు కలుగదు! ఎట్టిశాత్రవులకును చ్చి పరువెత్తఁడు. హమ్మ! మనసేనల రక్షింపుము. మీమీప్రాణ రక్షించుకొనుఁడు. తొత్రిమిప్పుడు ఫలకారి కాదు.

భామా—దేవా—

ప్రతా—మారుమాటాడకుము- యిదినీప్రభునాజ్ఞ! దుర్గనాశనదుఃఖమునకుతోడు, మిత్ర, సైనికమరణదుఃఖమును సైతము మీప్రభువునకు చేకూర్పకుము.

భామా— దేవా! తామేమైనర్చెదరు?

ప్రతా— నేనా! శాత్రవులీదుర్గమున ప్రవేశించి నుక్షణమే నా యైహికేచ్ఛ ముగిసినది. ఈదుర్గముతోడనే నా ప్రాణములనైతము శాత్రవులుఁ గైకొందురేమో చూచెద లుత నీవుపొమ్ము. మనసైనికులర క్షింపుము. (భామసా నిష్క్రమము.)

కరవాలమా! యీప్రతాపునిమానప్రాణములు నీపైనున్నవి దేశజననీ నాయవివేకముచే నీస్వాతంత్ర్యరక్షణ మొనగ్పఁజాలనైతి ఇదే! యీపాపి శరీరమును బాసి వీరస్వర్గము జేరియైన నిన్ను సేవించెద.

(ప్రవేశము శాత్రవ సైనికులు.)

శాత్రవాధములారా! ద్రోహముచే దుర్గమును ప్రవేశించినంతనే యీదుర్గమును సాధించినట్లయ్యెనా! రండు మోసమునకును జయలక్ష్మికిని బాయనిచుట్టరికము కలదేమో చూచెద - (యుద్ధము, ప్రవేశము దుర్గాదాసు.)

దుర్గా— దురాత్ములారా! మేవాడుసేనాని మేనప్రాణములుండువఱకు మాప్రభువును శాత్రవులు త్రేరిచూడనగునా? అదే అందుపరికింపుఁడు మీసైన్యము లెట్లుపలాయితములగుచున్నవో!

(సైనికులు పరువెత్తుదురు)

ప్రతా— దుర్గా! దుర్గా! మఱల నన్ను చేరితివా! స్వామిభక్తిప ...రుఁడవై, నమ్మినబంటువైన నిన్ను నరానిదుర్భాషలాడి, యవమాన ...ాలమిడిన చండాలుని మఱల చేరితివా? నీదయాగుణ మెంతపూ ...ము. దుర్గా! నివు మన్నారక్షించితివన్న కాని నాకూరటకలుగదు. అపుడు నాకు నిక్కముగ ప్రాణదాన మొనరించిన వాఁడవగుదువు. (మోకరించును.)

దుర్గా—(లేవనెత్తుచు) ప్రభూ! నీవిట్లాడనగునే? తండ్రులు కోపగించిన పుత్రకులు తండ్రుల వేడవలయుఁగాక తండ్రులు వేడుదురే? దేవా! యెట్లున్నాడవు. రాజరాజమార్తాండుని చందమున వెలుంగువాఁడవు తేజమువాసి రక్తపూరముచే కెంజాయరంజిలు మేనున చూడరాకున్నాఁడవు. దైవము నేమనువాఁడ! గోబ్రాహ్మణద్విజపతివ్రతా బాంధనంబులకే మనువాఁడ! మేవాడు రాజ్యాభిమానంబు నేగతిఁ బాయువాఁడ! సాగర్జిదురాలోచన కాలకూటమున మఱల మిమ్ము చేరసాహసించితి—

ప్రతా—ఆచండాలుని పేరు నాయెదుట నుచ్చరింపకుముఁ ఇఁక నీరక్షణోపాయ మెద్ది?

దుర్గా—దేవా! నావిషయమటుండనిండు. అంతిపురమున మాతృవర్గము గతియెయ్యది. తొలుత దాని సమర్థింపవలయు, నే వెడలెద నా కార్యమునకు! రక్షించెద మహారాజ్ఞీపతన మాతనయుల శాత్రవుల నురుమాడియైన! మహావంచనలఁ బడవైచియైన నా దేహరక్తమాంసకబళముల ప్రతి కరవాలమానకు నింతింత నాహుతియొసంగియైన! నాకు సెలవిండు.

ప్రతా—దుర్గా! పొమ్ము. నీమానసమున శౌర్యాగ్ని బాయక ప్రజ్వలించుచుండుఁగాక. ధైర్యస్థైర్యములుఁ బాయకుండుగాక- సర్వధర్మములు నిన్ను కాపాడుఁగాక. బ్రదికినవారు నారావళీ పర్వతసీమల చేరుదురుఁగాక- (ప్రవేశము ఝూనాస్ రావు-సైనిక సహాయుఁడై-ప్రతాపసింహ వేషమున- దుర్గాదాసునమ్ర-మము) ఝూనాసరావ్! యిది యేమి? నా వేసమూనితివి. ఓహో! తెలసె! నా వేసమున- శాత్రవాలముల నీపై నాకర్షించి, నను రక్షింపనెంచితివా? స్వామిభక్తశిఖా యణా! శూరవతంసమా! నిన్నేమని ప్రశంసింతు? రమ్ము శాత మేవాడుశౌర్యాగ్నిరుచి యింత ప్రకటింతము.

ఝూనా—దేవా! వలదు - వలదు - తొలుత మీరు సురక్షిత స్థానమును చేరుఁడు. మీరు సురక్షితులైయున్న మేము నిశ్చింతత శాత్రవుల నురుమాఁడగలము.

ప్రతా-ఏమీ- శాత్రవులకోలాహలము ననురణమున కాహ్వానించుచుండ, సైనికుల రణధ్వనులు- "నీకుపౌరుషమేయున్న- యుద్ధమునకు రమ్మ"ను రీతి-పై పైపర తెంచుచుండ,నన్ను, పలాయనుఁడ కమ్మంటివా? మీయందఱికన్న యీప్రతాపునికి మాత్రము ప్రాణమంతతీపి యని తలఁచితివా? శిశోదియా వంశరక్త రేణువులనెంత వెదికినను లేనికదనకాందిశీకతనాకు బోధించెదవా? ఈప్రతాపుఁ డీయుద్ధభూమినుండి తొలంగవలయునన్న- శవవాహకుల భుజాసీమలనైన-విజయలక్ష్మియాహ్వానమునైననని విశ్వసింపుము.

ఝూనా— దేవా! మము బోలువారెందఱు మడసిననేమి- మీరొక్కరు జీవించియున్న మేవాడు మాతయే సుపుత్రవతియై చల్లగనిద్రించును. ధర్మదేవత సంతసమందును. మేవాడు స్వాతంత్ర్యదేవతరక్షింప భూమినవతరించిన మహామహులు కదా మీరు!

సీ. పరరాజపదచార ♦ బాధలజన్మభూ
దేవికిమాన్పుభూతిలకుఁ ♦ డెవఁడు
పరులు, నందనుల ♦ చెరపట్ట, పగనొందు
జన్మభూచిత్తరం ♦ జనుఁడెవండు
ఐహికసుఖరాసి ♦ నావలద్రోసిదే
శానందుఁడైనమ ♦ హాత్ముఁడెవఁడు
జన్మభూస్వాతంత్ర్య ♦ సత్కీర్తి తనజీవ
మునవిల్వమదనమో ♦ హనుఁడెవండు
గీ. అన్నిరూపములతనరి ♦ యాత్మదేశ
ముద్ధరించెడుమాన్యులు ♦ నుర్వినెవరు?
నీవుదక్కఁగ విక్రమో ♦ న్నిద్ర, సర్వ
భూపగజసింహ, రాణాప్ర ♦ తాపసింహ.

సైనికులారా! మీ మీప్రాణములనైన సరకుగొనక- నేబోధించినకృత్యమును నిర్వహింపుఁడు-

(సైనికులు ప్రతాపుని పట్టుకొందురు-)

ప్రతా—ఝూనాస్‌రావ్-ఇదియేమి-సైనికులారా విడచెదరా! లేదా! ఇది యీ ప్రభుపదభక్తి కోరక వికసనము,

ఝూనా—దేవా! ఆయపరాధము నాయది! బలాత్కారణమున కాని రణభూమి బాయనని మీరేయానతిచ్చుటచే మిమురక్షింపనియుపాయము నేవాశ్రయింప వలసివచ్చెను. మీజీవితమే-మేవాడు జీవితము-మీమనుగడయే సకలమేవాడు స్వాతంత్ర్యదేవతమనుగడ- కానమీరు జీవింపనే వలయు. లోకకల్యాణకిరణుడైన మార్తాండుడస్తమింపరాదు.

ప్రతా—సైనికులారా! విడువుడు నన్ను. మీకు రాజభక్తియే యున్న! మీకు దేశభక్తియేయున్న! ఝూనాస్- ఇదియంతయు నీకృత్యము.

ఝూనా-దేవా! క్షమింపుడు, సేవకుడొనర్చినయపరాధమును వీరస్వర్గమునుండియైన- మీమన్ననవడసెదగాక- సైనికులారా! ఏలచూచుచున్నారు. ప్రభూ! యిదే సేవకుని కడపటియభివాదనము. బ్రదికియున్న మఱలమిము చేరగలను. అప్పుడు మీరు విధించినశిక్షకమునంతయు భరింపగలను. మీకు సర్వదేవతలును, సర్వధర్మములును, శుభమొసంగుగాక! సైనికులారా! ఇక మీరుపొండు.

(సైనికులు బలవంతమున, ప్రతాపుని నీడ్చుచుందురు. ప్రతాపుడు తప్పించుకొనయత్నించుచుండును. ఝూనాస్‌రావు, మందహాసముననుండును, తెఱవ్రాలును.)



# మేవాడు శౌర్యాగ్ని నాటకము

## తృతీయాంకము—ద్వితీయరంగము.



అంతఃపురమునందలిగది—విక్రమశాయి యుపవేశించియుండును.

(అనుబంధము 9)

విక్ర.—ఆహా! ఎందుచూచిన, నీయర్ధరాత్రిమున నీకలకలమే మిరియో తెలియకున్నది. ఇది యుద్ధకోలాహలమైయుండునా ?

(ప్రవేశము అమరసింహుఁడు లీలాకుమారియు చెరియొకవైపు నుండి యుద్ధసన్నద్ధులై—)

(అనుబంధము 10)

అమ—తల్లీ! నాకానతిమ్ము. ఈయర్ధరాత్రిమున వైరులు మన పైఁబడుచున్నారు. నేనును నిచే కరవాలధనుర్బాణములఁగొని, శాత్రవుల నురుమాడెద.

విక్ర—కుమారా! ఇదికడు సాహసకార్యము, వలదు. నీవు పోవలదు.

లీల—అమ్మా! ఇపుడు సాహసకార్యమే కావలయు. ఇట్టి సమయమున, క్షత్రియకులభూషణులగు మేమూరకుండుట పాడియా? రాజపుత్రకరవాలము లూరకనలంకారమునకేనా?

విక్ర—కుమారీ, కుమారులారా! మీరుపసిపాపలు. మీకేల యుద్ధము?

అమ—జననీ! కన్నతల్లికి కలిగిన యాపదలఁబాపలేని తనయుఁడొకతనయుఁడగునే? మాతాత యుదయసింహమహారాణా కాలమున,

మొగలాయిలు చిత్తూరుదుర్గమును సాధించిరఁట. అపుడు క్షత్రియకులభూషణులగు, "పుట్టా, జయమల్లు"లను నిద్వీరు, రసపుత్రయోధులు నిస్సహాయులై, పాదుషాసైన్యముల నెదురించిమడిసిరఁట. ఆహా! ఏమివారి పరాక్రమము. ఏమివారిస్వార్థపరిత్యాగము !

లీల—అట్టివారు కొందఱైన భారతాంబగర్భమున జనించుటచే తనఁగదా భారతీయగౌరవాభిమానము లింకను భూమిపై పేరునకైన నున్నవి.

విక్రి—కుమారా! వారిశౌర్యసాహసముల నక్బరుసైతము మెచ్చుకొని ఆగ్రానగరమునువారి శిలాప్రతిమలచే నలంకరింపలేదా? అట్టివారు మడిసినను కీర్తికాయములచేనింకను జీవించినట్లేకదా?

అమ—నిక్కము. అదియే మాదాదిసైతము చెప్పెను. జననీ! మొగలులు చిత్తూరు దుర్గము నాక్రమించినపుడొనర్చిన నత్యాహితములనాకర్ణించినప్పటినుండి మావంశమునకుకలిగిన యువమతినితొలఁగింప నిర్ధరించినాఁడ. నాకుమాతృము సెలవొసఁగిన మేవాడుభూమినుండి శాత్రవుల పారదోలెద. మఱల చిత్తూరుదుర్గమును సాధించి స్వాతంత్ర్యల క్ష్మినందునిలపెద! ఢిల్లీని సైతమాక్రమించి యానగరమును మొగలః ప్రజానహితముగ యమునాతోయములఁగలిపెద!

విక్రి—భళీ ! కుమారా ! నీయాశయము మిగుల ప్రశంసనీయము.

లీల—జననీ! అయిననిరపరాధులగు ప్రజలను బాధింపవచ్చునా? వారేమపరాధ మొనర్చిరి ?

విక్రి—కుమారీ! ప్రజలను బాధింపరాదు.

అమ—తల్లీ! ఈయుద్ధమునమాతృమేలనేను దుర్గాజానుగ్రహిన శస్త్రవిద్య ప్రకటించి శాత్రవుల నురుమాడరాదు?

ఉ. వైరుల వార్పలేక, పర ♦ వాహినిఁ గూల్పఁగ లేక, తండ్రికిన్
చేరువనుండి, సుద్దులవి ♦ శేషము చెప్పి ప్రమోద భావమున్
గూరిచినంత కల్గునె? యు ♦ కుంఠితకీర్తియు దేశసేవయున్
ధీరు ప్రతాపనందనుఁడి ♦ దే రిపుపంక్తుల రూపుమాపెదన్॥

అమ్మా! మా తండ్రియనుజ్ఞ యుద్ధమునకై వేడనతఁడు నీవింకను, బాలుఁడవనియె! అమ్మా! నేను శాత్రవుల చక్కాడఁజాలనా! నేనింకను బాలుఁడనఁట!

లీల—ఏమి! దేశరక్షణమహాకార్యమున నా బాల్యవార్ధక విచారణ! బాలుఁడగుఁగాక, వృద్ధుఁడగుఁగాక, దేశస్వాతంత్ర్యదేవతకై ప్రతియొకఁడును తన ప్రాణముల నర్పింపవలసినదే !

(ప్రవేశము—దుర్గాదాసు శీఘ్రయానమున)

దుర్గా—జననీ! లెమ్ము! లెమ్ము! కోట శాత్రవుల స్వాధీనమైనది! ఇట్టియాపత్సమయమున నంతిపురముఁ జొచ్చిన నా సాహసమును క్షమింపుము. ఆపత్కాలమగుటచే నిట్లు సంభవించె !

విక్ర—కోట యెట్లు శాత్రవుల పాలయ్యె. మీరందఱేమొనర్చుచుంటిరి ?

దుర్గా—జననీ! దీర్ఘసంవాదమున కిది సమయము కాదు. శౌర్యమున శాత్రవులు నన్ను జయింపలేదు. రాజద్రోహమున నీయాపద వాటిల్లె !

విక్ర—హా! దైవమా! నీకు దేశరక్షణమహాకార్యముపై కరుణ కలుగదా? ఈమేవాడు నిర్నామమైపోవుటయే నీకు సమ్మతమా! ఇఁక నీవు గుణపక్షపాతివి! శిష్టరక్షకుఁడవని యెవ్వరు విశ్వసింతురు । ఎవ్వరు పూజింతురు!

దుర్గా—జననీ! దైవము నేల నిందించెదవు? మన మొనర్చినదిమ నమే యనుభవింపవలయును గాదే ?

విక్ర—అన్నా! మీమహారాణా! యెందున్నారు? ఎట్లున్నారు?

దుర్గా—క్షేమముగనున్నారు ! నీక్షేమమునకై పరితపించుచున్నారు! పురము చేజారెఁగాక! మాకపజయ మేకలుగుఁగాక! రాజ్యమే నాశనమగుఁగాక! అంతఃపురసతీమతల్లుల, రాజపుత్రదేశమతల్లుల మానధనమును రక్షించుటయే ముఖ్యధర్మముగ భావించి, దేహమందంతటను నినృత్యమాడు ఖడ్గంబుల నరకుఁగొనక, నీయనుగ్రహముకలిమి యిందు చేరఁగంటిని. ఇఁక పదువాల్గులోకము లెత్తివచ్చినను నీదుర్గాదాసుమృతకళేబరముపై నడచిఁగాని మిమ్ము తేరిచూడనసాధ్యము. జననీ! గైకొమ్ము కరవాలమును! ధరింపుము పురుషవేషమును! అనుసరింపుము నీనందనుని ! అభవానీదేవియే మనల్మరక్షింపఁగలదు.

విక్ర—దుర్గా! నిన్నెంత నువ్వనాడియున్నను, నానెవ్వగమినము న నుంచక రాజకుటుంబమును రక్షింప కంకణము ధరించిననిన్ను నోరారస్తుతించుటకైన నియ్యదిసమయము కాకున్నదే. మానరక్షణమహాకార్యము మాకు ముఖ్యకర్తవ్యమనుట నేను నెఱుంగుదు. శాత్రవులు విజయోన్మత్తులగుటచే నంతిపురధర్మంబుల పాటింపరు. రణరంగమున హాహారావారిపోరాడి వీరస్వర్గమలంకరించుటయొకటి, చితిఁజేర్చి, జోహారొనర్చి, కామినీజనభూషణాయమానమానధనమురక్షించుకొనుటమఱియొకటికదా! క్షత్రియాంగనలకిత్తరిపాలనీయధర్మములు. అయిన మీ భార్యాపుత్రపుత్రికలవిషయ మేమి ? ఈకుమారునిగతియెయ్యది! నా లీలాకుమారి నెటు రక్షింపవలయును. వీరందఱు మనల ననుసరింతురు కదా ? నిర్గమనము నిరపాయమా?

దుర్గా—జననీ! నేనేమందును! వీరిరక్షణమునకై నాప్రాణముల నతిసంతోషమున నొసంగెద కాని నాప్రాణసమర్పణమాత్రమున నీ కార్య

ము సాధింపనగునా! రహస్యమార్గములనన్నియు శాత్రవులెఱుంగుదురు. తెలియకున్నను వచింప సాగర్జిశేఁడా ? కాన మనమందఱము కలసిపోయిన ప్రమాదము సంభవించుట నిక్కము. మాయపాయమునకై వెఱచువారము కాము. కాని, రాజపుత్రదేశమాతయగు నీగౌరవరక్షణమునకు భంగము కలుగునేమో యని భీతిల్లెద.

విక్రి—అక్కటకటా! నాకుమారీకుమారులనైతమునిందే విపక్షకరవాలముల కప్పగించి నేనుపోవలయునా? వీరి రక్షించువారెవ్వరును లేరా ?

లీల—జననీ! మమ్మొరులేలరక్షింపవలయు? రసపుత్ర శౌర్యాగ్ని సంజనితులమై, ప్రతాపసింహు సంతతివాని గర్భమున జనించిన మమ్మొకరు రక్షింపవలయునా ? జననీ! నాకై చింతింపకుము. నేనునీతనయను కానా! క్షత్రియ లక్షణాంచిత కరవాలము నాచేత ప్రకాశించునపుడు శాత్రవులు నీతనయనేమియు చేయఁజాలరని విశ్వసింపుము. ఒకవేళ వారికిజిక్కినను నీతనయామృతకళేబర మొక్కటియే యని విశ్వసింపుము. ఇఁక నాలస్యమొనర్పకుము.

ఉ. భారతమాతగర్భమున ♦ భాసిలువిక్రమదీప్తిరేఖచే
ధారుణి జన్మమొందుదురు ♦ దారనృపాంగన లాఢ్యవీరులా
పూరుషులట్లుక్షాత్రగుణ ♦ భూషితలై దురితారివార సం
ఛేదితదుష్కృతాత్తినటు ♦ వీడుదురంచుఁదలంపుమమ్మరో.

అమ—జననీ! నాకొఱకుమాత్రమేల చింతిల్లెదవు? పూజనీయ బాప్పారావు వంశమున జనించి, సకల వీరాధివీర శిరోభూషణుఁడగు ప్రతాపసింహ రాణాకూర్మి తనయుఁడనై, వీరసూమతల్లియగు నీగర్భమున జనించి, నేను మాత్రము వెనుదీయుదునా! నా యోపినంత పగతురఁబరిమార్చి వీరవిహారము సలిపి, వీరశిఖామణుల సంస్తవమునకుఁ బాత్రుఁ

డనయ్యెద! అమరసింహుండను నామము సార్థకఁబరచెద. తల్లీ మూకై
రోదింపకుము. క్షత్రియాంగనాధర్మరక్షణ మహాకార్యమునకు బూ
నుము. రాజపుత్రినామమునకే, కళంకమూపాదింపకుము. దేహములశా
శ్వితములు.బ్రిదికియుండిననీనందనుఁడు మరలనీపదసన్నిధానమును చేరఁ
గలఁడు. లేకున్న, చచ్చి,వీరస్వర్గముననైన, నీసేవకై వేచియుండఁగలఁడు.

విక్రి—కుమారీ కుమారులారా! మీమాటలు నాకెంతయునా
మోదముఁగూర్చెను. అయిన చిన్నారివనిపాపలే! కరవాలమూనియుద్ధ
మెట్లొనర్తురు? తల్లికౌఁగిటవశింపఁజాలుమిమ్ము శాత్రివులకప్పగించియె
ట్లుపోవుదు. కుమారా! రాజ్యసుఖముల ననుభవింపఁ జేయఁజాలకున్న
ను, చెంతనిడి పోషింపఁజాలకున్నను,చూచిననరుకాదు పగవారికప్పగిం
చి నేనేమని యీభువిజీవింతు! నాతనయుఁడేడీ- నావంశోద్ధారకుఁడేడీ
యని మీతండ్రియడిగిన నేనేమని ప్రత్యుత్తరమొసంగుదు ?

అమ—తల్లీ! అంతటి యనర్థమే వాటిల్లునేని, నాసాహసమునకు
మరణమే ప్రతిఫలంబగునేని- నాతండ్రితో-

ఉ. ధర్మముకే పరాభవమ ♦ ధర్మముకున్ జయమాటఁజూచి, తా
నిర్మలభక్తి ప్రాణముల ♦ వీడెనుస్వర్గముకేగ నెంచి,నీ
కూర్మినుతుండు,దైవమును ♦ గొల్చి, తదీయకృపారసంబుచే
ధర్మమునే జయించునటు ♦ ధారుణిఁ జేయగనంచుదెల్పుమా.

జననీ! యివియా క్షత్రియాంగనల కుండఁదగిన - గుణములు!
ట్టిసమయములయందు తుచ్ఛవ్యామోహమెందైనఁ దగునా! మొన్న
బుందేలు ఖండమున రాణీదుర్గావతి యొనర్చిన సాహసమువినవా! ఆవీ
ర జనని- తనయేకపుత్రుఁడు, రణమున,తనకన్నులయెదుట మడయుచుం
డుటఁగాంచియుశత్రుమథనమహా క్రీడమానక, యాశవముపైననేతనయు
శ్వమునుబఱపి-ఘోరరీతియుద్ధమొనర్చి,వీరస్వర్గమలంకరించెనని నీవేనాకు

వచింపవా? ప్రేమవాత్సల్యాదులన్నియు కల్ల! క్షత్రియాంగనలకు కీర్తి యొక్కటియే స్థిరము! మానరక్షణమే భూషణము! పరాక్రమమే యలంకారము. ఇదే- నేనిందుండు కొలంది నితుచ్ఛవ్యామోహమావరించి కార్యభంగ మొనర్చుచున్నది. కావున, నేపోవుచున్నాఁడ. ఇదేకడపటి యభివాదన మాచరించువాఁడ. శత్రుసాగరము నీదుచో, నాకపాయము వాటిల్లినను నాధైర్యస్థైర్యములు నను బాయకుండునట్లును,నీనందనుఁడ నుటసార్థకమగుచునట్లును నాశీర్వదింపుము. మాతండ్రికి, ప్రతాపసింహరాణాకు, నేనచిరకాలముననే తన పాదసరసీరుహముల చెంత చేరఁగలననియు, నాతని ధర్మరక్షణదీక్షయే నను రక్షింపఁగలదనియు, నొకవేళ నాకపాయము వాటిల్లినను నేనది పరమసంతోషమున భరించితిననియు వచింపుము. సత్వరముగ నాకనుజ్ఞ యొసంగుము- (నమస్కరించును)

విక్ర —భళీకుమారా! యిపుడు నీవు నాకుమారుఁడ వనుటయు, రాజకుమారుఁడవనుటయు సార్థకమయ్యె.సింగము కడుపునసింగ మేకదాయుదయించును. అయిన బాలుఁడవే! శత్రుసైన్యవారాసినినురక్షించువారెవరు? నీకుదిక్కెవరు?

అమ —జననీ! నేనసహాయుఁడనని తలఁచితివా?

సీ. నరసింహు నిర్భీతి ♦ నొరసి పోరాడిన
ఘనహిరణ్యాకసిపుఁ ♦ గనిన తల్లి
కులవైరి శ్రీహరిఁ ♦ దలపడిమార్కొన్న
మధుకైటభుల యాత్మ ♦ మనిన తల్లి
ఇరువదియొకసారి ♦ ధరణిపాలురగూల్చు
పరశురాముని యాత్మ ♦ పరగుతల్లి
హరినె రాముండని ♦ నరసియు ననిసేయు
దశకంఠుమదిలోన ♦ తనరుతల్లి

గీ. భారతావనిరక్షింప ♦ ప్రాణమొసఁగు
పృథ్విసింహాదిశూరుల ♦ బెంచుతల్లి
వీరవర్యులమానస ♦ వీధినలరు
దేవి- ఆశౌర్యలక్ష్మియే? ♦ దిక్కు-నాకు

లీల—భళీ! సోదరా! యిపుడునీవు నాసోదరుఁడవనుటసార్థకమయ్యె. జననీ! యేలతామసించెదవు? లెమ్ము తెగువవహింపుము! ఆలస్యమొనర్చితివా మనయందఱిప్రాణములు చనఁగలవు. మనలో కొందఱైన జీవించి యుండుటమేలు కాదే- ఇదె- నేనును నమస్కరించుచున్న దాన- నీభవ్యతరాశిషమొసంగుము. ప్రాణహానికలిగినను మానహాని కలుగకుండునట్లాశీర్వదింపుము-

విక్ర—కుమారీ! నిక్కము- ఇదే నేనును నిక్కం క్షత్రియాంగనాధర్మమును పాలించెద! పుత్రపుత్రికాదిహీనప్రేమలతను ఛేదించెద! కుమారీ కుమారులారా! పోయిరండు! మీకుసర్వశుభములు కలుగుఁగాక! అమరసింహా! నీధైర్యమేనిన్ను రక్షించుఁగాక! అచిరకాలముననే మీతండ్రినిచేరుదువుఁగాక!

సీ. వైరికంధరసీమఁ ♦ జేరి నీ తరవారి
యొల్లవేళల విహ ♦ రించుఁగాత
క్షాత్రవిక్రమదీప ♦ కలికనీమానస
వీధి నిశ్చలమగుచు ♦ వెలయుఁగాత
వంశీయపూర్వీక ♦ బాప్పరాయల యశః
కౌముది నీపైన ♦ గ్రాలుఁగాత
జన్మదేశోద్ధార ♦ సన్నుతదీక్ష ను
స్థిరలీల నీపైన ♦ చెలఁగుఁగాత
గీ. శరశరాసన లక్ష్యసం ♦ స్ఫురణనెందు
తప్పకుండగ నీమది ♦ తనరుఁగాత

విజయలక్ష్మి నీభుజసీమ ♦ వెలయుఁగాత
అమితశాత్రవగజసింహా ♦ అమరసింహా.

అమ—తల్లీ! నీయాశీర్వచనకవచరాజము నను రక్షించుచుం డ నెందైననాకాపదఁగలుగునే? యోచింపకుము. నేశుభమున మరలివత్తు.

(నిష్క్రమించును.)

విక్ర—కుమారీ! లీలా! యింక నీగతియెద్యది?

(ప్రవేశము- శీఘ్రయానమున- రాణాబాయి)

రాణా—జననీ! లీలాకుమారికై నీవుచింతింపకుము! నావృద్ధసేవకుండగు కమలాదాసు సాయమున నీకుమారి సురక్షితస్థానమును చేరఁగలదు.

దుర్గా—జననీ! యోచింపకుము- నిన్ను సురక్షితస్థానమునుఁ జేర్చినపిదప నీదాసుఁడు మరల నిందురాఁగలఁడు. ఈదుర్గాదాసు మేన ప్రాణములుండువఱకు మాప్రభు కుటుంబమున కెట్టిహానియుఁగలుఁగదు-లెమ్ము.

లీల—జననీ - నీవీదుర్గాదాసు ననుసరింపుము. కోటయంతయు మొగలులస్వాధీనమైయున్నది. అదేశాత్రవులు మహాద్వారము నతిక్రమించిరి. అల్లదే కవాటములు భేదించుశబ్దము వినవచ్చుచున్నది. నేను కమలాదాసుసాయమున రహస్యమార్గమునఁ బోయెద - నీవును వీర జననివికమ్ము.

(నిష్క్రమణము)

విక్రమ—సోదరీ! రాణాసతీ! నీగతియెయ్యది? నీవేమొనర్తువు? అయ్యో! మమ్ము చేరివకలన కదా నీకిట్టిపాటుకలిగె!

రాణా—మహారాజ్ఞీ! నాకై చింతింపకుము. నాకిందు కార్యముఁ గలదు. నేనును క్షత్రియాంగనను కానా?

చ॥ కలఁగకుమమ్మనాకొఱకు; ♦ కర్కశశాత్రవదంతియూథముల్
నలఁచెదనమ్మ; తౌత్రికిర ♦ ణమ్ములు దేహముగ్రమ్మియుండనే
కలఁతయుకల్గదమ్మ; నృప ♦ కామిని గౌరవమానసంపదల్
కలసనసువ్రతానమునుఁ ♦ గైకొన కేగునఁటమ్మసోదరీ!

విక్ర—సోదరీ! విధిలేక పోవుచున్న దాన! ఎట్లునీసౌశీల్యమును రక్షించుకొనియెదవో? ఎట్లుమఱల మమ్ము నీపతిమున చేరఁగలవో? దైవమెఱుంగు! నీకుశుభంబగుఁగాక! సర్వదేవతలు నీకుసాయమొనర్తురుఁగాక.

(నిష్క్రమము - దుర్గాదాసుతో)

రాణా—ఆహా నేఁడు మేవాడురాజ్యలక్ష్మి నశించె! నేఁడు చిత్తూరుమహాగౌరవమెల్ల శాత్రవులపాలయ్యె! అయ్యో! యీసాగర్జీనిబోలు నన్యాయాపరులు - స్వార్థతత్పరులు భరతభూమినిజనించినకతన కదా దేశమాత యిట్టి పారతంత్ర్యాంధకారమున మునింగితల్లడిలుట!

సీ॥ మణిహేమభాగ్య సా ♦ మ్రాజ్యములంది తా
నేతల్లి మిన్నయై ♦ యెనసెజగతి
విద్యాసువిజ్ఞాన ♦ విపులైకమత్యత
నేతల్లి మిన్నయై ♦ యొనఁగెజగతి
కారుణ్యధర్మాళి ♦ ఘనరఘురామాదు
లనుగాంచి యేతల్లి ♦ యెనసెజగతి
స్వార్థపరిత్యాగ ♦ వరగాంధిసుమయుక్తి
నేతల్లి మిన్నయై ♦ నెనసెజగతి
తే॥ గీ॥ వరగలోకమాన్యుల దేశ ♦ బాంధవులను
ఆత్మగర్భంబు ననుదాల్చి ♦ యలరుజనని
భారతావని నేఁడు తా ♦ పారతంత్ర్య
శోకమరశనందెన ♦ సూయకతన!

ఇట్టివేళ, యిట్టియాపద వేళ - నాజనకుఁడుఁడిన పరిభవమునకును, ప్రభు కుటుంబమునకును, తనప్రాణములనైన నర్పించుచుండెగదా! అట్టివానితనయనై నేనుమాత్రము మేలయూరకుండవలయును? నేనును, ననాథ రాజయువతీ బాలబాలికా రక్షణమునకు నాయావచ్ఛక్తినిధారవోసెద. వేషాంతరధారణమొనర్చి మహమ్మదీయసైనిక వేషమున కార్యసాఫల్యమందెద.

(ప్రవేశము - గోపీనాథుఁడు - శీఘ్రయానమున)

గోపీ—అపాయము - అపాయము - అమరసింహుఁడు శాత్రవులచేఁజిక్కెను.

రాణా—యువరాణా! - అమరసింహుఁడా? ఎప్పుడు? - ఎట్లు?

గోపీ—మొగలుసైనికాధములకు గొందఱికి వీరస్వర్గసౌఖ్యమునుఁ జేకూర్చి భవానీదాసు హంతకునిచే పట్టువడియె.

రాణా—లెండు - గురూజీ! యింకతడయనేల? తొలుంత మేవాడుయువరాణాను రక్షింతము.

గోపీ—కుమారీ - ఇదిసాధ్యమా—?

రాణా—ఇట్టి మహత్తరకార్యమునను సాధ్యాసాధ్యవిచారణము? - అంత మితిమీరిన నీతుచ్ఛప్రాణములుకదా! వానికైమనము కర్తవ్యముల మానుదుమే?

గోపీ—కుమారీ! ప్రాణహానికి నేనావంతయు శంకింపను- నీవుక్షత్రియాంగనామణివి - అందునా-

రాణా—గురూజీ - అదియా - మీసందియము (గుప్తఖడ్గమునుదీసి) దీనినిచూచితిరే - ఈఖడ్గరాజము నాచెంతనుండువఱకు నీరాణావతి కెట్టిహానియుఁ గలుఁగదు - అయినను మనమీవేషములఁ బోవరాదు - (లోపల దీన్ దీన్ శబ్దములు) అదే - శాత్రవులే మనకు

మార్గమునుకల్పించుచున్నారు. లెండు వారిని యమలోకమున కతిథులఁజేసితిమా వేషధారణమువలయుపరికరములు లభించు. గురువర్యా! యిదే నాప్రతిన నాలకింపుఁడు!

చ. హరిహరులాన! మీపాదు చ ♦ రణాబ్జములాన! సురాసురావళుల్
వరగిననైనశత్రునికర ♦ పంజర మధ్యగరాజ పుత్రినిన్
నరుదుగ మత్ప్రతాప విభ ♦ వంబులమ్రోలనుఁజేర్చుదాననే
నరితతిఁగూల్చి; బాసిదను ♦ నంతకుఁబాలకయున్న ప్రాణముల్.

(నిష్క్రమము)



# మేవాడుశౌర్యాగ్ని నాటకము

తృతీయాంకము, తృతీయరంగము.

కొమల్మీరు - దుర్గము. బయలుప్రదేశము.

సైనికులు మధుపానమొనర్చుచుందురు.

(అనుబంధము 11)

1-సైని --అరే! భాయి! ఇదియేమికోటబే ! యిక్కడలానా, గానా, బజానా, ఔర్ జనానా, గినానాయేమిలేదు, అంతాయుద్ధం-యుద్ధం-

2-సైని—అరే! ప్రతాపసింహాకీ జనానాయేమైంది బే!

రామ—అరే! వారుమనకు జిక్కదురా! ఈమేవాడురాజపుత్రకామినుల శౌర్యసాహసములు సైతము పరమాద్భుతములని వినవా! ప్రతాపునిజనని వీరాబాయిశౌర్యము జ్ఞాపకము లేదా?

(ప్రవేశము - లీల)

2-సైని—అరే! భాయి! యిక్కడ ఛోకీ్రవుంది రా!

రామ—(ఆమెను(జూచి) అరే! ఈమె ప్రతాపసింహునికు మారియై యుండవచ్చును.

1-సైని—ఏవరిలడికీ యైతేనేమిరా! ఎంతకూబ్సూరత్ వుంది. దీనివయస్సు సోలాబరస్ వుండవచ్చు.

రామ—అరే ! మనయజమానికి నీమెనర్పింపవలెనని మనకు హుకుం కాలేదా!

1-సైని — భేష్! భేష్! మంచిమాట చెప్పినావు.(లీలను సమీపించి) ఛోకి్రి! యెవ్వరునీవు?

లీల— అయ్యలారా! నేననాథబాలికను - నన్నేలచుట్టుముట్టితిరి. నాదారివిడువుఁడు.

2. సైని-దారియాడది; బలే మితారిగావుండావు. మాహుజూర్కి నిన్నిస్తే బలేఫసందుంటాది. బలేమంచిమంచి సొమ్ముల్ గిమ్ముల్ దొరుకుతాయి.

లీల-అయ్యా! మీదయకే నెంతయు సంతసించితి. ఇచ్చట దాపునను నాతండ్రియున్నాఁడు. అతని దర్శించి, యాతనియానతి గైకొనిమఱల వచ్చెద. దారివిడువుఁడు.

1 సైని-తండ్రిగిండ్రిమాకు సరిపడదు. ఛోకి్రిదిక్తే పట్కో బోవాలా అని- మాహుజూర్కి-హుకుంవుంది ఊర్కే వల్కి-యెక్కు! సైతోం వుకాకో బండ్లో వేస్తాము.

లీల-(గుప్తముగనున్న ఖడ్గముఁదీసి) ఓరీ! మీతో సామవచనములెన్నఁడైన పనికివచ్చునా! ఊరక దారివిడచెదరా? లేదా?

1 సైని-అరే! భాయి యిదేమి లడ్కీ జే? కత్తి లేకోలడాయ్కి వస్తుంది.

రామ- చెప్పలేదేమిరా యీమె శ్రీరాజసింహుని తనయయని

(ప్రవేశము- గోపీనాథుఁడు తురకసర్దారు వేషమున)

గోపీ-ఓరీ! యేమి చేస్తూన్నారిక్కడ?

1 సైనిక-ఖావంద్-మాకీ ఛోకి్రి దొరికిండాది. దీన్ని హుజూర్కి తీస్కి పోవాలా సూస్తూన్నాము.

గోపీ-అచ్ఛా- నేనీ- ఛోకి్రిని తేస్తాను- మీరుపొండు.

సైని-(జోహారొనర్చి నిష్క్రమింతురు)

లీల-ఓరీ నీ వేల వచ్చితివి ? ఊరకవచ్చిన తోఁపబట్టవైతినా ఖ
డ్గమున కాహుతియగుదువు.

గోపీ-కుమారీ! భీతిల్లకుము.

(అని సహజ కంఠస్వరమున మాట్లాడును)

లీల-గురువర్యా ! మీరేలయిట్టి వేషమును ధరించితిరి ? ఆహా!
నను రక్షించుట కిట్టివేషమును దాల్చితిరా? ఏమిమీయార్తత్రాణపరా
యణత!

గోపీ-కుమారీ! యిది యంతయు నారాణాశాయి సాహసము"
మేము మొగలుసేనానుల నిద్దరిని యమలోకమునకంపి యిందువచ్చితిమి,
భీతిల్లకుము.

(ప్రవేశము సైనికులు-)

1 సైని-అరే! బొమ్మన్ మాకీమోసం చేసినావ్- చెప్పునీవెవరు?

గోపీ-ఓరీ! నేను బొమ్మన్ కాదు. ఈలడ్కీ భయపడకుండాయీ
వేషం వేసినాను.

2 సైని-మాకీః హుజూర్ యెంతో తిట్టినాఁడు.

1 సైని-కాదురా! వీడుకాదు- ఈసైతాన్ వచ్చి తిట్టించింది.

గోపీ-ఓరీ! నేనెవ్వరైనది తెలియుదా? (అనిఖడ్గము చూపును)

3 సైని-అరే! యిది వజీర్ ఖాన్ సాహేబుదిరా.

గోపీ-నేనెవ్వరనుకున్నావు? మీకు మతిలేదా ?

1 సైని-ఖావంద్! మీరేమైన సెప్పండి ! మే మీఛోకీనిఛో
డ్కేపోతే రహింఖాన్ సాహేబ్ మాగల్లా కదద్దాల్తానన్నాడు, మాకీ
హుకుంఅయింది.

గోపీ-అచ్ఛా! అయిన వల్లకి తెచ్చినారా?

2 సైని-అక్కడవుంది.

గోపీ-పొందు. ఛోకీ! నీకే. భయము లేదు పో! నేనువస్తాను.

(సైనికులు- లీల నిష్క్రమము)

"శ్రేయాంసి బహువిఘ్నాని" యేమిచేయుద మన్నను మేవాడున కు కష్టము లేకలుగుచున్నవి సలీం- రాజపుత్రవనితల నుద్వాహమాడ నువ్విళ్లూరుచున్నాఁడు. మొగలు సేనాని యీబాలనుఁగాంచి గురుతించెనా నిర్బంధింపక మానఁడు. ఈవార్త నాలకించిన యుత్తరక్షణముననే మానైకధనుఁడగు మహారాణా దేహ మగ్ని హోత్రుని పాలు కాదే! దైవమా! నేనేమొనర్తు! అహా! నాకింతకన్న కర్తవ్యము కలదే? పరాక్రమముననైన, మోసవాగురులఁ బడవైచియైన రక్షించెద లీలాకుమారిని!

(ప్రవేశము రాణాబాయి శీఘ్రయానమున)

రాణా-ఏదీ! లీలాకుమారి! గురువర్యా! ఏమొనర్చితిరి?

గోపీ-కుమారీ! యీమేవాడుపై దైవమున కింతసులభముగ కరుణకలుగునని తలంచితివా? లీలను శాత్రవ సేనాని శిబిరమునకు చేచెతఁ బంపినవాఁడను నేనే.

రాణా—ఏమి! ఏమి! పరిహాసించెదా తనయుడా! శాత్రవశిబిరమునకా!

గోపీ—కుమారీ! యోచింపకుము. మన మేసప్రాణములుండ రాజకుమారికి యనర్థము వాటిల్లఁగలదే? మనమాయలం ఫీరు ఫకీరును సంహరించి, యాతని దుస్తులహరింపలేదా! అవియే మనకిపుడు శరణములు. రమ్ము. నేనుఫకీరునయ్యెద—నీవు వాని శిష్యుఁడు కావలయు. రమ్ము! ఆలస్యమొనర్చిన—ప్రమాదమగును.

(యిరువురు-నిష్క్రమము)



# మేవాడుశౌర్యాగ్ని నాటకము.



## తృతీయాంకము—చతుర్థరంగము—మొగలులయుద్ధశిబిరము

(ఒకచోట సాగర్జి శయనించియుండును. సమీపపటగృహమున రహీముభవానీ దాసులు నిద్రించుచుందురు.)

సాగర్జి—(నిద్రయందే) ఆహా! అదె యగ్ని ప్రజ్వలించుచున్నది! అల్లదె మహాకాళనాదము. లయకాల కాలరుద్రుని సకలజీవహరణరోషకషాయితఫాలనయన వీక్షణములఁబోలె, నగ్ని వేదినుండి క్రతుభోజన సప్తార్చులు గగనము ఖోద్గారితములగుచున్నవి. ఔరా! అదియేమి? యీవైశ్వానరశిఖాసందోహమిప్పుడె సాంధ్యరాగమునుకూడి యత్యంతారుణిమ నొందునుభయసమాయోగకాలమరుదెంచెనా? మత్కల్పితమాయాతంత్రగాఢాంధతామిస్రము తొలఁగి, జోహారు వీతిహోత్రుండియభ్రంగతమైన ధూమమున కలసెనా? భళిరే! ధూమాంకితమైనమదీయ తంత్రభూతమాలిన్యము తదగ్ని తేజమున, కూడి ద్విగుణితమై వెలయుచుండుటలేదా? హాహాహాహా! (నవ్వి) ఆ! ఆ! ఏమి? ఏమది? ఆశ్వేతాంబరధారిణి యెవరు? (ఆకసమువంకచూపు మెత్తి) మేను నసూగంధ ద్రవ్యములలంది, విముక్తకేశపాశయై, బ్రాహ్మణ వృద్ధాంగ వాశిషములఁగొని, స్వతేజాత్రప్రకాశధాటిచే మఱింత మహాకాళజ్వాలల రగుల్చుచు, ప్రళయకాలాగ్ని సమర్చికలాపముల నాహ్వానించుచున్నది! ఆయమయే తారాదేవి! ఆదుర్గాదాసు భార్య! భవానీదాస్! ఇంతటికి కారణమెవరు? నేనుకదా? ఇక నేతడయరాము. అయ్యొదె యిప్పుడే తారాదేవి క్షాత్రతేజమగ్ని దేవునిచే సన్మానింపఁబడి యగ్నిగుండము

నుండిబయలుదేరి వాయువునందు లీనీభూతమై, గగనపథానువర్తనమై, తనగమ్యస్థానమునుఁ జేరనేగుచున్నది. ఇప్పుడామె జ్యోతియెంత తేజోవంతమైయున్నది! అల్లదే! ఆతౌత్రాదేవి తేజస్థానమాక్రమింప పలువురు రాజపుత్రాంగనలు చనుచున్నారు? భవానీదాస్! ఇకనాలసించిన ప్రమాదమగు! ఆ! ఆ! ఏమనుచున్నావు? నీవ్రేళులనెవరిని చూపుచున్నావు? భామా నాభార్యనా? కుమారాబాయినా? ఆదుర్గము మూలదాగి యగ్నికాహుతియగుచున్న రాజపుత్రాంగనల కనులపండువుగ గాంచుచున్న ప్రమదాభావ వైపుచూపుచు ధనంజయాహూయమాన నిజశరీరలగు క్షత్రియమానినులతోఁ గలుకుపలుకులు వినుమనియా? అవును! ఆయన యేమిపలుకుచున్నది? ఇంతటి రాజపుత్రలోక ప్రాణమానవంశనాశనమునకు కారణభూతులము నేనును, నాభార్యయునని కదా? అదినిక్కువమే! ఏమి? అదియథార్థము కాదనుచున్నావా? రజపుత్రశూరులు తారతమ్యజ్ఞానశూన్యత భారతస్వామియైన యక్బరు సార్వభౌమునితోఁ బనిసేయ నూల్కొనుటయే యింతటి వినాశదేవతాగమనమునకు కారణమనుచున్నావా? కానిమ్ము. ఏదియెటులున్నను నేనుమాత్రము పకీర్తినొందనోప! అదే యాకసంపుపాలంతితో చెలిమినల్పనేగుచున్న శౌర్యదేవత నారాధించి సుప్రసన్నగనొనర్చి నైజక్షాత్రతేజపర ప్రసాదమందెద. ఇంతటియవాచ్య, యనూహ్య ద్రోహకదంబములకు కారణులగు ప్రమదాభాసను, యవనశాత్రవులను హుతాశనునందు. రాజపుత్రాంగనాభస్మమునంటదహించెద. (అని ప్రక్కనున్న దీపమునుగొని ఆతురతతో పరుగిడువానిబోలె వేగముగ కొన్ని యడుగులు పోవ)

(ప్రవేశము—భవానీదాసు—రహీములు.)

భవా—మహారాణా! యిదయేమి? ఎక్కడికిపోవుచున్నారు?

సాంగ—ఆ-ఆ-అగ్నిదేవత! నన్నాహ్వానించుచున్నది! తనహాని

కరములనవ్వాళింగన మొనర్చు మందహాసమున నరుదెంచుచున్నది నన్నిక తడయకుము!

రహీ— సాగర్జీ ప్రభూ! మీరేమికలఁగాంచుచున్నారా! అగ్ని యేమి? మిమ్మాహ్వానించుట యేమి?

సాగ— అదియా! అది— మేవాడురసపుత్రుల- శౌర్యాగ్ని-

భవా— చాలు- చాలు- లెండు- అదే-దేవిగారు తమకై వార్త నంపియున్నారు. మీకుమారుఁడు, అజితసింహాయువరాణాగారు, ప్రాతఃకాలమునుండి మీకై కలవరించుచున్నారఁట! యిదే-యీరాయవనసేనాని మనసహాయమును విజయవార్తయు పాదుషాకుఁ దెలుపమనబడోని నే బంపియున్నాఁడఁట!

(లోపల సైనికుల కలకలము)

రహీ— ఆగుఁడాగుఁడు! అందెవ్వరో! మనచెంతకరుదెంచుచున్నట్లున్నది.

(ప్రవేశము:- సైనికులు-లీలతో)

సైని— ఖావంద్ సాకీ! యీ ఛోక్రీ రస్తామే పోతూవుంటే చిక్కింది.

రహీ— మంచిది మీరుపొండు.

సాగ— (లీలనుఁగాంచి దిగ్భ్రాంతుఁడై పోఁబోవ)

లీల— పితాజీ నిలుము? నిలుము! ఏలఁబోయెదవు? నీవునాకు పినతండ్రివైనను, నిన్నుపితాజీయని సంబోధించుటకే నెంతయు సిగ్గు చెందుచున్నదాన.

మ॥ కనులుత్క్రాంతములయ్యెనిన్నుఁగనగన్ ♦ కర్ణంబులీవాక్యముల్
వినలేకన్యథానువర్తనములై ♦ వెన్వెన్కనే తెంచె, నె

మ్మనమీదుమన్కృతపంకసంస్మరణచే ♦ మానెన్ స్వవృత్తిన్ ; పితా
జీ! నినున్ తండ్రియటంచుపిల్వనకటా ♦ సిగ్గొందెదన్ ధారుణిన్॥

నీ వెట్టిపాతకివైనను, నాకు పూజనీయపదవియందుండుటచే, నిదేయభివాదన మాచరించుదాన. నీయన్నకుమారి, అంతఃపురసుకుమారి, శాత్రవసముద్రమునకీడ్వఁబడి కన్న కష్టముల బహుటకములారగాంచ వలయునని వచ్చితివా? మేవాడురాజపుత్రి శాత్రవకృతావమానముల నెట్లు సహించునో తుదివఱకు నీవు గాంచవలదా!

భవా—రాజకుమారీ! నీకిట యొగ్గొనరించువారెవ్వరును లేరు. భారతచక్రవర్తికుమారుఁడగు సలీంయువసార్వభౌముని కరగ్రహణభాగ్యము నీకు చేకూర్చి, యువచక్రవర్తినివై యీభూచక్రమేలుచుండ గాంచి సంతసింపవలయునని నీపినతండ్రియభిలాష! అందుకై యే నిన్నిందుకొనిరా నన్ను నియోగించెను.

లీల—ఆహా! యెట్టిసదుద్దేశము మీరుగదా రాజపుత్రధర్మాభిమానులు. పితాజీ! యేలమానము దాల్చితివి? క్షత్రియగర్భమున జనించి క్షత్రియాంగనను, అన్నకుమారిని, పగవారికిచ్చి సంపదలగడింపనెంచి బలాత్కరించు, నీయట్టిమహోదారుఁడు, నీయట్టి పూజ్యచారిత్రుఁడీభూలోకమున నెందైనఁగలఁడె? నీవుండఁగదా శిశోదియవంశమే పావనమయ్యె,

సాగ—లీలా నామాటవినుము. మూర్ఖ్యముమానుము. కాలదేశములనారసి, మనయభిప్రాయాచారముల మార్చుకొనమి యేకదా మన దేశీయదైన్యస్థితికి కారణము!

చ॥ ముదుసలితాపసుల్ తొలిని ♦ మూర్ఖతవ్రాసిరి వర్ణభేదముల్,
యెదకననైరి దేశయభి ♦ వృద్ధికి సర్వజనైకమత్యమున్,

ముదమునఁగాంచురీతిని న ♦ గుజ్వలధర్మయుగంబువచ్చెనేఁ
డిదెనవధర్మయుక్తి జగ ♦ దీశితకీర్తిని దేవరింపుమూ!

చెలువారు రాయింతులలో మేల్బంతివికమ్మ. నీవు సమ్మతించినను, సమ్మతింపకున్నను యీకార్యము నిర్బంధమునైన నెరవేరఁగలదు- కాన

లీల—దురాచారా! కులపాంసనా! నీవేలశిశోదియా వంశమున జనించితివి? రాజపుత్రిప్రార్థన వృక్షమునకే వేరువిత్తైతివి? అధమా! తనవారిని, తన్ను పోషించి, ప్రేమించి, పెంచినవారిని, యీ పత్పరంపరలఁబడద్రోసి, పితృపితామహ ప్రాప్తమైన జన్మదేశమును, జన్మదేశ రాజ్యశ్రీని, మొగలులకమ్మి, కన్నబిడ్డలనైతము కన్నవారికి వ్యగించునీయట్టికిరాతకుని, నీయట్టిచండాలుని మోముచూడ పాతకము దురాత్మా! నీవాప్రతాపసింహమహారాణా సోదరుఁడను నామమును ధరించినకతనబ్రదికితివి! లేకున్న, నేనేవినుజంపి, నీయట్టివానిజనమున కైపరిలాపించు మేవానుజననిని నిష్కళ్మషగనొనర్చుచుంటి! స్వధర్మబాహిరా! యిట్టియవాచ్య పాపకార్య మొనరించి సుఖంపఁ దలఁచితివా? తుద కునీకులభించునదెయ్యది? చిరకాలమనోవ్యథాబాధితనిస్తేజ, నిర్జీవమైన కళేబరమొక్కటియే! నిన్నాచంద్రతారార్కము నావరించియుండు దురంతదుష్కీర్తి, విషవల్లరియొక్కటియేయనియెఱుఁగుము. నీవేయభిలాషకై, యేమనోరథ సిద్ధికై, యింతఁజేసి, మరియింతఁ జేయనున్నాఁడవో యట్టినీమనోరథ సిద్ధినీకు కలనుందైన సమీపింపదని నమ్ముము. దురితధనవిధానమా! నీదురితముల కెన్నటికైన ప్రతిఫలము లభింపకపోదు. నీ హేయకృత్యదుష్ప్రారంభముల కెన్నటికైన చక్కని ప్రతీకారము లభింపకపోవదు. సహస్రాక్ష సహస్రపాద సహస్రశిరుండైన యాజగదీశ్వరుండు మీయట్టి దుండగీడుల కుచ్ఛితకు తంత్రమార్గ ఘోరపాతకముల నవలోకించుచునే యున్నాఁడు. దుష్టశిక్షణమున జాగరూకమైన యాదేవ దేవుని చిత్తము మిమ్మూరక విడువదు! నన్ను నీద్రోహమేమి

యుచేయఁజాలదు. అంతకువచ్చిన యీక్షత్రియబాల కరవాలము స్వమానరక్షణసాధనమై నన్నివేళల రక్షింప సంసిద్ధమైయేయున్నది. సమస్తకల్మష కిల్బిషవృజిన మూలకందమా! మేవాడు రాజపుత్రకుల కళంకమా! జీవింప నెంచితివేని, తొలఁగుము నాదృష్టిపథమునుండి! నీయట్టి దేశభ్రాతృద్రోహికి ప్రాణదాన మొసంగిన బంధుభావమునేడు నిరోధము తొలంగక మునుపే!

రహీ—ఉదయపుర మహారాణా! సాగర్జీమహారాజా! మిమ్ము నిఖల రాజకీయకార్యములాహ్వానించుచున్నవిఁగదా! వెడలుఁడు! భవానీదాసజీ! మీరు మహారాణా ననుసరింపుఁడు.

(సాగర్జీ- భవానీదాసులు నిష్క్రమము.)

బాలా! యేలకోపించెదవు, కోపమున నేమైన కార్యసాఫల్యమగునని తలంచితివా?

లీల—ఉదయపుర మహారాణా సాగర్జీమిత్రులగు మీకుతొయ్యాలుల బలాత్కరించుటయే రాజకీయకార్యము కాఁబోలు. పాదుషా నందనులకు రాజపుత్రకామినులఁగూర్చుటయేనా మీకు కార్యము. అందుకుకైయే కాఁబోలు మీకు సేనాధిపత్య మొసంగఁబడినది!

రహీ—నీవు రాజకుమారి వగుటచే నీమాటకోర్చితిఁగాక, నొకులీ నిందావాక్యములాడి బ్రతికి పోఁగలవని తలఁచితివా! నాకు సైన్యముల నడపుటయందును, వైరుల చక్కాడుట యందునుఁ గలపాండిత్యము, కాంతానునయసరస వాక్యరచనలయందు లేదు. కావున, కోపగింపకుము. పాదుషా, నిన్ను కోడలిగానంగీకరించునట్లుఁ జేయుభారము నాయది. వినుము, రూపవివక్షతయేగాని మతవివక్షత లేదు. నీవు హైందవ మతమునే యనుసరింప నెంచినను, సర్వమతసమ్మతుఁడు పాతిషాహ సార్వభౌముఁడు తప్పకయంగీకరించును.

లీల—అక్బరునందనుఁ డగుఁగాక, నాయుభవుని నందనుఁడగుఁ గాక, నీలీలాకుమారి శాత్రవుల కలయుండైన తలంప దనివిశ్వసింపుము. నన్నెవ్వరని యెంచితివి? వీరాధివీర ప్రతాపసింహుని తనయయనుటమఱచితివా? పావనతర శిశోదియా వంశరక్తము నామేన ప్రవహించుచుండు టెఱుంగవా! ఈక్షత్రియాంగనామణి ప్రాణము లీదేహమును బాసిన పిదపనే యొరులీదేహము నంటఁగల్గుటయని యెఱుంగుము.

రహీ—కలికీ! యేలవాదులాడెదవు? మా చేఁజిక్కిననీకు విముక్తి కలుగ వలయునన్న ముల్లాసన్నిధానమున పాదుషానందనుని పరిణయ మాడిన పిదపనే? తెలిసితివా! నీసమ్మతినైన, యసమ్మతినైన నీకీపరిణయము తప్పదు. నీవుసమ్మతించితివా, నీజనకునకును, మేవాడు ప్రజలకును సుఖముచే కూర్పఁగలవు. యోచింపుము.

లీల—నేనంతయు యోచించియే వచించితిని. మేవాడుసస్యోదకాదుల వర్ధిలి, రాణాప్రతాప సింహుని పరిపాలన సౌఖ్యాబ్ధిఁదేలు ప్రతిరసపుత్రుఁడును, మ్లేచ్ఛశాంధవ్యమున కియ్యకొనుటకన్న తమరాణా పుత్రి మరణించుటయే మేలనితలంచును. ఇఁకనాజనకుఁడన్ననో, మహామహిమాంచిత భూమండల తిలకాయమానమగు సూర్యవంశమునజనించిన మానధనుఁడు. ఆతని పుత్రిక పాదతలపరాగమునేని శాత్రవులు స్పృశింపనర్హులు కారని యతినియభిప్రాయము.

రహీ—ఓసీ! యేమిపలికితివి? సార్వభౌమసుతుఁడు నీచెట్టవట్టుటకు నర్హుఁడు కాఁడా! అబలవనియునందునను బాలికవనియు, నెంచి యూరక సామవచనముల బోధించినట్లంతయు మీరిమీరి పలికెదవా? చూచెద నీవెట్లుతప్పించుకొని యెదవో? యేప్రతాపుఁడు నిన్నురక్షించునో చూచెద!

లీల—దైవవశమున ద్రోహము చేఁగల్గిన విజయమునే సర్వస్వముగ భావించి, మదాంధుఁడవై, యీపవిత్రావపుత్రిని బెదరించెదవా? అంతకు వచ్చిన నాప్రాణముల కదా నీవు గైకొనఁ గలవు? ఈతుచ్ఛప్రాణములకై భీతిల్లి, యీపవిత్రావ సింహతనయ నీయిచ్ఛ వచ్చినరీతి యొనరించునని యెంచితివా? నేను బాలికనగుట కతన నే నీవిట్టిమాటలాడి బ్రతికితివి. లేకున్న- అంతయేల! నీవు వచించునట్లు నీవు శూరుఁడవేయైన నాకొకకరవాల మిప్పింపుము. గైకొమ్ము కరవాలమును! రమ్ము యుద్ధమునకు- అప్పుడీబాలిక యెవ్వరో యెఱుంగఁగలవు!

రహీ—భేష్! నీధైర్యసాహసముల కెంతయు సంతసించితి! కాని, యుద్ధమనఁగ నేమనిదలఁచితివి? చెలువారు చిలుకలతోటి సరససల్లాపము లనుకొంటివా ?

లీల—అనాథయగు నొకబాలికను బాధించుచు పలుకుకారు లనుకొంటివా!

రహీ—ప్రేమింపు పతులయెడ ప్రేయసులు చూపు ప్రణయకోపమనుకొంటివా?

లీల—నోరెఱుంగని, యసూర్యంపశ్యలగు రాబాలికల బెదరించి యొనర్చుకిరాతక కృత్యము లనుకొంటివా?

రహీ—ఏమంటివి? నీవిట్లు పలికిన మదీయనిశిత ఖడ్గధార నీలేమేనుఖండింపకమాను నని తలంచితివా ?

లీల—అభిమానైకధనయగు నీవీరక్షత్రియకుమారి, యుగ్గుతోఁబుట్టిన శౌర్యమును ప్రదర్శింపకమాను నని తలంచితివా?

రహీ—పలుగాకీ! యింకనిన్నుపేక్షింపను. నోటికి వచ్చినట్లంతయు కారులు పలికినభవదీయ ప్రాణసందోహమట్టె నిలుచునని తలఁపకుము.

లీల—క్షత్రియాంగనను పరిభవింప నెంచుట కాలాహిపాలమాదొ్రక్కినట్లేయని తెలియుము.

రహీ—పలుగాకీ! యింకనీయాయువు ముగిసినది. చూచెదనిన్నెవ్వరు రక్షింతురో! నీయొడలు చీల్చినీవాలుంకకు బుద్ధిగఱపెద!

లీల—కలుషాత్మా! రమ్ము-నీవుశూరుడవేయైన- యీ మేవాడు క్షత్రియాంగనాశౌర్యాగ్ని నెదుర్పశక్తి! నీకుకలదేని?

రహీ—పాపినీ- చచ్చితివి- (అనిఖడ్గహస్తుడై లీలను సమీపించును. లీలతనగుప్త ఖడ్గముచే నతని ఖడ్గ మెగుర గొట్టును,)

లీల—అయినదా! నీశూరత్వమునకు తగినప్రతిఫలము! ఇపుడు యుద్ధమనగ నేమియో నెఱింగితివా? ప్రతాపసింహ తనయను చెనకుటయన నేమియో తెలసితివా? పొమ్ము- నిన్నిపుడే సంహరించుచుంటినిగాని, క్షత్రియధర్మమునకు విరుద్ధముగాన, మానితి! నీకువిధాతయిడిన యాయువుకల్ల! ఇదే! నేనొసంగితి నీకు ప్రాణదానమును!

రహీ—కామినీమణీ! నీశౌర్యముకే నెంతయు సంతసించితి. నీవాప్రతాపసింహ తనయవేయగుదువు! నిను బాధింపను-అయిన నాధర్మమును నేను పాలింపనేవలయుకదా! పాదుషా కీవార్తనంపెద. అతని యాజ్ఞ వడయువఱకు మాత్రము నిను నిర్బంధమున నుంచెద. అందు నీకెట్టి కొఱంతయు కలుగకుండుట కేనుత్తరవాదిని.

(గోపల-గానము)

అదే- యెవ్వరో వచ్చుచున్నట్లున్నది- (ప్రవేశము- గోపీనాథశాస్త్రి పకీరువేసమున) పకీర్జీ! వందనములు. ఈపీఠమున అలంకరింపుడు. ఆర్యా! తామెచ్చటినుండి వచ్చితిరి?

గోపీ—బేటా! నేను మక్కానుండి యీదేశమును చూడవచ్చితిని, నీవు అలంఘీరు పకీరు పేరు పాదుషావలన విని యీ ంచువు.

అదియే నాపేరు. నేను పాదుషా యాజ్ఞచే మీసైన్యముం జూడవచ్చితి. ఇదే పాదుషా యొసంగిన పత్రిక.

రహీ—(పత్రికగైకొని) ఆహా ! అలంఘీరు పకీరు లాతాము! పాదుషా మన్నించు గురువులు కదా మీరు! దేవా! తమ ప్రభావము కర్ణాకర్ణి వినియుంటిని, నేడు ప్రత్యక్షముగ దర్శింపఁగల్గుటచే సుదినము పక్కీర్జీ ! శిష్యుల మనోరథముల దీర్పకదా ! మీరిం జేతెంచుట !

గోపీ—బేటా ! యీకుమారి యెవరు ?

రహీ—దేవా ! యీబాలిక ప్రతాపుని తనయ-సలీం యువచక్రవర్తి సన్నిధానమునకు బంపనిర్ధరించి యున్నాఁడ.

గోపీ—కుమారా ! అల్లాయనుగ్రహముచే మీయుందతమంతయుఁ దెలసె ? అయిన కొలది దినము లీబాలిక నిచ్చటనేయుంచుము. నీకార్యమునంతయు సమంజసమైనదెద్ది-ఆయుమకై యెట్టి శ్రమమైన నరకుఁగొనను. అందుకై కాదె నేనిం దేతెంచుట? అయిన నెరులెవ్వరిందు రాకూడదు.

రహీ—భాగ్యము. తమయాజ్ఞ శిరమున దాల్చెద.ఈకార్యము మాత్ర మనుకూలముగ నొనర్చితిరా మీశిష్యుని భాగ్యమునకు మేర యేలేదు. ఇన్ని వత్సరములుగ-పాదుషా, మానసింహులు సైతము నర్వఁజాలని ప్రతాపసింహ పరాభూతి నేనొక్కఁడనె యొనర్చినవాఁడనగుదును. సైనికులారా ! మీరీబాలికను రాజాంతఃపురమునందలి యొకగదికి కొనిపొండు. వలయు నుపచారముల నొనర్పతగిన సేవకులనియోగింపుఁడు. అహమద్ ! ఆగదికి నీవే కాపుగ నుండవలయు. నీవు బైరామ్‌ఖాన్ సాయపడఁగలఁడు. ఈపకీరు సాహేబు మాత్రమెట్టివేళయైన నిరాటంకముగ లోనప్రవేశింపననుజ్ఞ నొసంగితి. ఇతరులెవ్వరును లోనప్రవేశింపకూడదు. హెచ్చరిక ! పక్కీర్జీ ! నమాజుకు వేళయైనది. పోవుదము రండు. (నిష్క్రమణము)

---

# మేవాడుశౌర్యాగ్ని నాటకము

## తృతీయాంకము - పంచమరంగము.



కొమల్మేరు దుర్గము - బయలు - (ప్రవేశము రాణాబాయి)

రాణా — మొగలు జయపతాకమా! ఇంకెంతకాలము విజృంభించెదవు? ఆరంగల దీపమును, నస్తంగతికై యెదురుచూచు భానుమండలమును, మహావిజృంభణమున వెలరారుట లోకసహజముగాదే? ఈమేవాడు జననిపుత్రపుత్రికల హృదయక్షేత్రముల నింకను క్షాత్రవిక్రమజ్యోతి నిర్వాణమునై, విరూపమైపోవలేదు. కేవల ముదరంభరిత్వమునకై తనుమానసముల నమ్ముకొనిన చమూపతులపరాక్రమ ధైర్యసాహసములకును, దేశభక్తిప్రబోధితములై, తమకన్నతల్లికై, ఆత్మగౌరవమునకై, తమగృహగృహిణీ పుత్రపుత్రికలకై పోరెడు శౌర్యధైర్యములకును గలతారతమ్య మచిరకాలముననే జగమెఱుంగఁగలదు. దేశభక్తిసామర్థ్య మచిరకాలముననే ప్రకటితము కాఁగలదు.

ఉ॥ పావనసు స్వాతంత్ర్యదివి ♦ భాసిలు రాజపతాకభాను స
ద్భావరణంబునున్ పొదవ ♦ వచ్చిన కేతువు పోల్కి, రాజపు
త్రావని, కీతసుస్థితి వి ♦ రాజితమైన, నదెంతకాల మీ
వీవిచెలంగు? నీకతి ప ♦ టిష్ఠనృపధ్వజవిక్రమార్కుఁడే
తావ్రున వెల్గుక్రమ్మఱ ము ♦ దంబున మ్లేచ్ఛపతాకరాజమా!

ఆహా! యేమి రాహునోపాధుని ధైర్యము.

చ॥ ఎఱుఁగఁడు సైన్యసంపదల! ♦ నెవ్వరుసాయ మొనర్పరారు; తా
నరయఁడు కోశవృద్ధిని; మ ♦ హాచలదుర్గమునైన, కానఁడా

యుగదములున్ తురంగములు ♦ యుక్కుటశూన్యము; విక్రమంబునన్
తరుగఁదు స్థైర్యలక్ష్మి, నవ ♦ దారత పోరు పనన్యభృతంబగున్॥

(ప్రవేశము లీల)

కుమారీ-క్షేమముగ వచ్చితివా ? గురువర్యు లెందున్నారు ?

లీల—జననీ ! సర్వవిషయముల క్షేమమే కాకున్న యీలీల ప్రాణములతో మీ చెంతఁ జేరునని తలఁచితివా? అంతయేల? గోపీనాథ గురువర్యుఁడే యొకఘడియ యాలస్యమొనర్చియున్న యీలీలాకుమారి యిప్పటికి వీరస్వర్గ నివాసినియై యుండదా ?

రాణా—అయ్యో, సంబంధవిముక్తి యెట్లుకలిగె ?

లీల—ఆరాయమల్లుతనయను విమల నెఱుంగుదువు కదా ? విమల సార్వభౌమ సుతుని కరగ్రహణమునకై యత్యంత సాహసమునకైన వెనుదీయదు. విమలయే, గురువర్యుని బోధనచే నీవకీరు వసనాచ్ఛాదితయై నాచెంత కరుదెంచి, నాస్థానమును గైకొనుటచే నాకీబంధ విముక్తి గలిగె.

ప్రవేశము గోపీనాథశాస్త్రి

గోపీ—కుమారీ ! లెమ్ము-లెమ్ము- శాత్రవులు మన తంత్ర మెఱుంగుటకు ముందే మన మీదుర్గపరిసరమును బాయవలయు.

రాణా—గురువర్యా ! మీరును నీకుమారియు పొండు. నాకింకను నిందుకార్యముఁగలదు.

గోపీ—కుమారీ—?

రాణా—ఆర్యా ! నను మన్నింపుఁడు. నేనా విమలాస్వైరిణికి బుద్ధిగరపువఱ కీదుర్గమును బాయఁజాలను. దేశభక్తిని వీటబుచ్చి, స్వార్థమునకై, సనాతన ధర్మాచారముల మాని, శాత్రవసంపదల వరించువారి నుపేక్షింపరాదు. అదే-అందెవ్వరో వచ్చుచున్నట్లున్నది. తొలుత మీరు పొండు. (లీల—గోపీనాథులు నిష్క్రమము) అక్కట

కటా! సంపదలకును_గౌరవబిరుదములకు వాశించి, వాత్మగౌరవమును బాళిమొనర్చుకొని జీవించు నీచాధముల నుండియే కదా దేశజనని దుఃఖపారతంత్ర్యాంధకార కూపమున క్షణమున కొకమెట్టు దిగుచున్నది!

(ప్రవేశము_దుర్గాదాసు)

దుర్గాదాస్! యేమి మరల వచ్చితివి! మరల నేదియైన యాపద సంభవించెనా? మహారాజ్ఞి యెందున్నది?

దుర్గా—మహారాజ్ఞి భిల్లసైని కరక్షితయై యారావళీపర్వతపు కనుమలచేరఁ బోవుచున్నది? కాని యమరసింహయువరాణా యెందున్నాఁడు? లీలాకుమారి గతియేమయ్యెది?

రాణా—గురువర్యుల సాయమున లీలాకుమారి దుర్గబహిః ప్రదేశము చేరినది! ఆకుమారికిఁక భయము లేదు. అమరసింహుఁడు నాగర్జిహతకుని చెంతకిపుడే కొనిపోఁబడెనఁట! రమ్ము_మనమందుఁబో పుదము. మనసైనిక వేషము లే మనకు దారియొసంగఁగలవు! పిదప మనఖడ్గము లే శేషించిన కార్యమును నిరవశేషములఁ జేయఁగలవు.

(నిష్క్రమణము)

## చతుర్థాంకము_ప్రథమరంగము.

ఆరావళీ పర్వతప్రాంతము_ప్రతాపుని గుఱ్ఱము చచ్చిపడియుండును. ప్రతాపుడు చింతమోకరించి యుండును)

ప్రతా—మేవాడునకును నాకును గలతుట్టతుదిబంధనము సైతము వీడెనా! అశ్వరాజమా!

సీ॥ అని లోన మునుమున్ను ♦ నరిసేన దార్కొని
యాదరించెడు మేటి ♦ జోదువీవె!
వైరిఖడ్గాసార ♦ వారంబునుండినన్
దప్పించి బ్రోచు బాం ♦ ధవుఁడవీవె!

వ్యూహించి శౌర్యజ్వాల ♦ యుద్ధవేళ వ్రవేళ
దర్శియా మత్ప్రాణ ♦ దాతవీవె!
రక్షకజన్మభూ ♦ రక్షకై, యిపుడు నీ
ప్రాణమర్పించిన ♦ ప్రాభుఁడీవె!

తే. గీ. మేలికృత్యంబు బోధించు ♦ మిత్రుఁడీవె!
అన్ని విడిన, నను విడవ ♦ టంచునుంటి
నన్ను నేకాకిఁ జేసితే ♦ సన్నుతాంగ
రంగమంబ ! సుబంధుతు ♦ రంగమంబ!

దుర్గాదాసింకను రాఁడయ్యె. అంతఃపురవృత్తాంత మేమియు తెలియదయ్యె! నాకొఱకై, నా వేసమూని నన్ను రక్షించిన యాశూరవతంసుఁ డేమయ్యెనో! నన్నే సర్వస్వముగ భావించి నాకొఱకై నంతిపురమున వసించు నారాణాసతిగతి యేమయ్యెనో! దైవమా! యిందఱాపత్సముద్రమున మునింగియుండ నేనొక్కఁడమని యే మొనర్తు! నీవు నిక్కముగ దీనదయాపరుఁడవా? ధర్మోద్ధారకుఁడవా? అయిన నీ మేవాడుజననికేల నిట్టిదుస్థితి? ఔరా! నేనేల హారపడియుండరాదు? జన్మదేశమని జన్మదేశస్వాతంత్ర్యమని శిశోదియావంశపరిపాలిత రాజ్యశ్రీని పరులకొసంగలేక యుద్ధమొనర్చుచున్నాఁడనా? ఇందరు ప్రజలు నాయొక్కనికై తమ ప్రాపంచిక సౌఖ్యసర్వస్వంబును త్యజించి దివికేగిరి. ఇందరి రోదనలకు, నిందరిప్రాణహానికి నేను కారణమా? దైవమా ? యేలపరీక్షించెదవు? నేనధర్మమునకైనని చేసితినా? జన్మదేశస్వాతంత్ర్యోద్ధారమునకై కదా? ఆహా! యింకను నెవ్వరును రారైరి! అంతిపురమున నేమైన నత్యాహితము సంభవించియుండునా? ప్రాణహానికేని సమ్మతింతు! కాని ప్రాణాధిక మానధనమున కేమైన భంగము కలిగియుండునా! కలుగదు! కలుగదు! ధర్మమున కెన్ని బన్నములు సంఘటిల్లినను నాశము సంభవింపదు. శంకరా! నాకార్యమీ పవిత్రతరమైన

ధర్మభంగము కలుగకుండుఁగాక! ఇది రేఁనీకును నాకును తుదిపరీక్షణ మగుఁగాక!

మ॥ అరిసేనల్ దరిమించె; మామకబలం • బంతంతక్షీణించె; నీ
తరి సామంతగణంబు శాత్రివుల పా • దాకా్రంతినాశించె; భూ
ధరరాజుల్ భవనంబులయ్యెఁ,తరుప • త్రాహారమున్ నయ్యె; సం
స్ఫురణన్ జెందెమనంబు; ధైర్యమవిసెన్ • బోధింపవే యీశ్వరా॥

(ప్రవేశము - భామాసా)

భామా—మహారాణా రాజపుత్రప్రతాపమార్తాండ రాజేంద్రునకు జయమగుఁగాక!

ప్రతా—భామాసా! రమ్ము! యుద్ధమున శాత్రివులబారినుండి ప్రాణములకై పలాయనుఁడైన ప్రతాపునికెన్నటికైన జయముఁగల్గునా?

భామా—దేవా? మీరుజీవించియున్నకదా దేశమాతకెన్నటికైన శుభముకలుఁగఁగలదు? మీకు నేనుఁజెప్పువాఁడనా? ఈదినమువ జయమైన మనకు జయమెన్నఁడైన కలుగదా?

ప్రతా—భామాసా! అదియుండనిమ్ము. అంతిపురోదంతములేమైన నెఱుంగుదువా ? మా శేనాని ఝూనాసరావు గతి యెయ్యది.

భామా—దేవా! ఝూనాసరావు వీరస్వర్గమలంకరించెను.

ప్రతా—ఏమి ఏమి - ఝూనాసరావు మడసెనా! నిక్కమా! అట్టిస్వార్థపరిత్యాగికినట్టి స్వామిభక్త్యలంకృతునకు దైవమిట్టిప్రతిఫలమొసంగునని నేవిశ్వసింపఁజాల.

భామా—ప్రభూ! వీరవతంసులకును, శౌర్యస్వార్థపరిత్యాగులకును వీరస్వర్గసౌఖ్యమునకన్న నపేక్షణీయమగు ప్రతిఫలమున్నదా! అదియుండనిండు. ఇదే "మేవాడుశౌర్యాగ్ని"చే సురక్షితమైన జయపతాకము !

సీ॥ రసపుత్రహృదయు ధై ♦ ర్యంబు పోలికజీర్ణ
మయ్యు వైరులకర ♦ ముందకుండ
తనవారు శత్రుప ♦ దా క్రాంతితనరిన
తాను విసమ్రమై ♦ తనరకుండ
క్షత్రియకాంక్షయ ♦ సరణిశత్రులగాంచి
చలియించి యొక్కచో ♦ నిలువకుండ
రాజపుత్రాధముల్ ♦ రహీనమానము నువీడ
తనమానమున్నతి ♦ తప్పకుండ

తే॥ గే॥ నెనసి మిన్నందిమేవాడు ♦ ఘనతబెంచి
నిన్ను, తనప్రభు, పిల్వంగ ♦ నేగుదెంచె
ననఁగ, మీకడకరుదెంచె ♦ నధికభక్తి
ధ్వజపతాకంబు గైకొమ్ము ♦ ధరణిపాల!

ప్రతా— ఛత్రపతాకమా! నీకును నీప్రతాపునిదుస్థితియేచే కూరెనా?

శా॥ శ్రీమేవాడుపతీ దరస్మితమనన్ ♦ శ్రీరాజపుత్రోత్కరో
ద్ధామామూల్యయశంబనన్ వెలిగితిం ♦ దాకన్నిదేశంబులన్
ఆమహాత్మ్యముమానెనో? ధ్వజపతా ♦ కాంబా! వగన్ గుంద! నిన్
ప్రేమఁగ్రమ్మరచేర్తు నీతలమునన్ ♦ పీతార్తివై యుండుమా!

భామా— ప్రభూ! అంతఃపురోదంతముల నేమైనవింటిరా?

ప్రతా— లేదు. వచింపుము. నీకు తెలిసినదంతయు వచింపుము.

భామా— మహారాణా! మనదుర్గాదానుసాహాస విక్రమము లంతిపురరక్షణజాగరూకము లైయుండె. కాని శాత్రవతిమిరము లెందును నావరించియుండు కతనను, శాత్రవులలో దుర్గగహాస్యములన్నియు

నెఱింగినవాడుండుటచేతను నతని కార్యము సంపూర్ణజయసిద్ధి వడయఁ జాలదయ్యె.

ప్రతా—భామాసా! యేలసంకోచించెదవు? విపత్పరంపరలే యావాసస్థానముగ నెన్నుకొనిన నీప్రతాపుని నెట్టియాపదలైన భీతి గొలుపఁజాలునే?

భామా—దుర్గాదాసు మహారాజ్ఞి విక్రమబాయినిరక్షించెను.

ప్రతా—మహారాజ్ఞి రక్షింపఁబడియెనా? నాకుమారుఁడు-నాయనుంగు అమరసింహుఁడు—

భామా—అమరసింహ యువరాజాతానును వెంటవచ్చుట దేవిగారిమానరక్షణ మహాకార్యమునకు భంగమాపాదించునేమో యని యెంచి స్వపరాక్రమ ప్రకటనమున నాత్మరక్షణ మొనర్పనిర్ధరించెనఁట!

ప్రతా—భళీకుమారా! తరువాత—

భామా—యువరాజాగారు - దేవా! శాంతముగ నాకర్ణింపుఁడు

ప్రతా—భామాసా! తామసింపకుము, పిదప నేమైనది చెప్పుము - చెప్పుము!

భామా—దేవా! యువరాజాగారు శాత్రవులచేఁజిక్కి శాత్రవసేనాని చెంతకు కొనిపోఁబడియెనఁట!

ప్రతా—దేశమాతా! జన్మదేశస్వాతంత్ర్యదేవతా! నీకొకరాజకుమారుని, నాకన్న- కుమారుని నొసంగితి—భామాసా! పిదప - నా లీల-

భామా—దేవా! శాత్రవులంతఃపురముఁజొచ్చి లీలాకుమారిని నిర్బంధింప సాహసించిరి.

ప్రతా—వాలీలనా ! శాత్రవులా!

భామా—దేవా! దీనినంతయు నే సైనికులవలన వింటిని. లీలాకుమారి మొగలుశేనానిచెంతకు గొనిపోఁబడియెనఁట! అవును - దేవా క్షమింపుఁడు.

ప్రతా—భామాసా! తామసించిన నీప్రభువిఁక తాళఁజాలఁడు వదింపుము.

భామా—దేవా! ఆకుమారిని సలీంయువచక్రవర్తికి సర్పింప రేపుఢిల్లీకి బంపనున్నారఁట!

ప్రతా—ఏమి! ఏమి! అకాలప్రళయమును సలీమాసించెనా? చిచ్చరపిడుగును చెచ్చెర సమీపింప సాహసించెనా? రాజపుత్రకామాన గౌరవములపై నీసకల "మేవాడుశౌర్యాగ్ని" ప్రజ్వలించుచుండు టెఱుఁగఁడా? భామాసా! తెమ్ము! నాకరవాలచాపభల్లముల ! ఆతురుష్కశేనాసామ్రాజ్యమొగలు సంతానసామ్రాజ్యవృక్షమును నొక్కపెట్టున నున్మూలించి, భేదించి, ఛేదించి, కలఁచి, దహించి, నీటకలిపెద! ఆశుంభని శుంభాసురదమనియైన శార్వాణీ విక్రమక్రమ రీతి నిరర్గళ శర సంచయరేణువజ్రశకలములచే, యవనభట సామక మొగలు సామ్రాజ్యసర్వస్వమును గ్రహించి, నిగ్రహించి తోయధిముంచెద. విడమించెద నాపుత్రి పుత్రిల! లయకాలరుద్రుని పోలిక, శాత్రవశాసన ప్రధ్వంసమొనర్చి, వైరి సంతానసంహార క్రీడానందము ననుభవించెద. అనుభవింపఁజేసెద వారొనర్చిన కృత్యములకు ప్రతిఫలము ! (అనిసావేగముగ పోఁబోవ)

భామా—మహారాణానిలుఁడు.మాతృదేశము నేమిచేయనెంచితిరి ? మీప్రతిన నెందుఁ ద్రిసితిరి?

ప్రతా—(తటాలున నిలచును)

భామా—మేవాడు స్వాతంత్ర్యోద్ధారణవ్రతము నేయేటఁగలు

వసెంచితిరి ? మీకై గాదె మేమెందఱమైన నంతసేమున ప్రాణముల నర్పింపసిద్ధముగ నుండుట ! మీమనుగడయే మాతృదేశము మనుగడ. మీజీవితమే మేవాడు స్వాతంత్ర్యదేవత జీవితము. మీయునికి యొక్షత్రియధర్మ పరిపాలనయునికి. ఇట్టిచో మీరేకృత్యాకృత్యముల నాలోచింపక సాహసమునకు దొరకొన్న మేవాడు మాతయే, యనాథయై, దిక్కులేక నశింపదా? అక్షౌహిణీసేనల మీరొక్కరు మార్కొ-నివిర్జింపనెంచితిరా ! మీరొనర్చిన ప్రతిన మఱచితిరా ?

ప్రతా—భామాసా ! నిక్కము నేపొరపడితి. క్షమింపుము నీవే నాకుకృత్యముద్బోధించి యాచార్యుఁడ వైతివి! మీకుమార్గ దర్శిగనుండవలసిన యీప్రతాపుఁడే, తనభార్యా పుత్రికలకునై దుఃఖించువాఁడని వగవకుము. జననీ ! దేశమాతా ! యిదేనా ప్రాపంచిక సౌఖ్య సర్వస్వము నుత్యజించితి. నీకొఱకై దారపుత్రికాది బంధంబుల ఛేదించితి.

మ॥ సిరిపోఁదోలితి; రాజ్యసౌఖ్యముల వా ♦ సిన్ నీఁగితిన్, నీకునై
వరజాయాసుతలన్ త్యజించితి; మనో ♦ బంధంబుఛేదించితిన్
స్థిరధైర్యంబును ప్రాపుగొంటి; భవదు ♦ త్తేజ స్వతంత్రత్వసం
భరణంగోరితి; దేశమాత! సఫల ♦ ప్రారంభునిన్ జేయవే!

జననీ! నాకై వగవను. అస్మదీయ రాజ్య భ్రంశమునకై నించుకంతయు చింతింపను. ప్రాణాధిక మామకమిత్రసచివసేనాబృందముల మృతికేని కొంచమేని దుఃఖింపను. మామక దారసుత ప్రాణాధికమానపరిభవభీతికేని గొంతయు వంతఁగనను. కాని, జననీ! నీకొఱకై, నీపవిత్రవిమలగౌరవ స్వాతంత్ర్యవినాశనమునకై చింతిల్లెద. జననీ! సూర్యవంశక్షోణీశకరలాలనమున నెంతయో వాసిగాంచితివి. అస్మత్కులపావనుఁడై, మదీయవంశపాలనస్థాపకుండైన, బాప్పరావులయమోఘతరవిక్రమక్రమసాహసపరిపాటిచే భూమినినీవొక్కమానినివై, అభిమానినివై,

రాజ్యరమాభిమానివై, పోల్చితివి. అనంతసాహసవిక్రమాదిత్యుఁడన యుపక్రమాభంగురకీర్తిని గడించిన హమీరుశూరవతంసునిచే లోకోత్తరసముంచితాకార సద్గుణసౌందర్యాలంకార సకలదేశప్రశంసనీయాభ్యుదయంబుల జగత్కామినీతిలకాయితవై మ్లేచ్ఛచక్రవర్తి యగు మహమ్మదుటగ్లకునుసైతము నోడించి చెరపట్టి కనికరంబునఁ బ్రాణదానమొసంగితివి. అస్మత్పితామహుండును, వీర్యశౌర్యసాహసజనపితామహుండుననగు, సంగరాణాయు ప్రసంగరంగత్సంగరసమార్జితవీర్యస్వార్థత్యాగధురీణతచే నెంతయు మావరులచే, పరులచే, ప్రశంసనీయస్థితినొందితివి. అమ్మరో! యిపుడు హతభాగ్యుఁడగు నాయొక్కనిమను గడచే తేజముడింది, కన్నపుత్రులఁ గోల్పోయి. స్వాతంత్ర్యధనముసీగి యాత్మావాసమందిరము బాసి, భిక్షుకవై, యారావళీపర్వతగుహాంతరములఁజేరి, వృక్షైకశరణ్యవై, విముక్తకేశవై వినిస్సరదజస్రాశ్రుధారాసారసమభిషిక్తశరీరవై, దిక్కులేనిభంగి విలపింపవలసివచ్చెగదాయని చింతిల్లెద - దీనికై వగచెద - దీనికై దుఃఖించెద.

(ప్రవేశము గోపీనాథవిక్రమబాయి, లీలలు)

లీల—పితాజీ (అనినమస్కరించును)

ప్రతా—(వెనుకకుజరిగి) అమ్మాయీ! లీలా ! భీకరశార్దూలములనడుమ భవదీయమానధనశిశువు నిరపాయస్థితినొంది సురక్షితమై సుశీలమైయున్నదా? అటు కాకున్న నీపితాజీ మీరిందువచ్చుటకన్న చచ్చుటయే మేలని తలంచుచుంటివా?

లీల—జనకా! నీకుమారి ప్రియసులనా నీవుసందేహించుట! ప్రతాపసింహ బాలికవైరిసంచయపిపీలికలకుఁ జిక్కునే? క్షత్రియైకమానలతామతల్లిక యింకనుపుష్పించి తనసౌరభమును మానకుండుట వలననే మిమ్ము చేరఁగలిగెనని విశ్వసింపుఁడు.

ప్రతా—ఇప్పుడు నేధన్యుఁడ! శంకరా! ఏకలింగేశా! నీకృపామాహాత్మ్యము వర్ణింప నేనెంతటివాఁడను!

ఉ॥ కూర్తువు దుఃఖితన్ సుఖము! ♦ కూర్తువు హాలహలంబునన్ సుధన్;
కూర్తు ప్రదీప్తిచీకటిని; ♦ కూరిమి దీనులవిన్నగన్ సదా
దీర్తువు ధర్మరక్షణ ము ♦ తీర్తున్; కరుణామయా! నీదులీలనే
నేర్తునెనన్నుతింప! శ్రుతి ♦ నిర్మలరూప! మునీంద్ర భావనా!

గోపీ—కుమారా! యిది నీయాప్రతిమాన శౌర్యతరుకుసుమమేఁగదా?

ప్రతా—(ఆశ్చర్యముననమస్కరించి) గురూజీ! మన్నింపుఁడు. నేనుదిగుల వికలహృదయమున నంతఃపురమానభంగసందేహవిషపానమున విస్మృతుండనై మిమ్ములఁగాంచనైతి. తామెప్పుడువిచ్చేసితిరి? తమకెట్టియాపదయు శాత్రవులనుండి కలుగదుకదా?

విక్రి—నాథా! ఈమహానుభావుని సాయముచేతనేకదా మేవాడురాజపుత్రికా మానధనమింకను సురక్షితమైయున్నది. వీరి ధైర్యసాహసములే మానప్రాణరక్షణమునకు కారణములు.

ప్రతా—గురువర్యా! మీయుపకృతి యెన్నిజన్మములకుఁదీర్పఁగలను. మీయాశీర్వచనమొక్కటేగాక మీశౌర్యసాహసములు సైతము రాజకుటుంబ రక్షణార్థమై సాయమొనర్పవలయునా?

మ॥ భువనాపాలనకై భవాదృశతపో ♦ భూమంబుచెల్వొందు, ప్రా
భవజన్మావని పారతంత్ర్యగతిఁ బా ♦ వన్ బూనకళ్యాణముల్
భువిచెన్నారవె? రాజతంత్రములు ♦ మిమ్ముఁ గొల్వధన్యంబులౌ!
కవిలోకోత్తర! మీకృపన్ గనెడ నా ♦ కార్యానుసాఫల్యముల్!

గోపీ—కుమారా! దేశసేవకై బ్రాహ్మణులు క్షాత్రధర్మమనుసరించిన నెట్టిస్వధర్మపరిత్యాగదోషమును కలుగదు. అదియుండ

నిమ్మా. మనదుర్గములన్నియు శాత్రవులచేఁజిక్కెను. సీహాహారములు యమపురికేగెను. ధనాగారములన్నియు శూన్యదేవతానర్తనశాలలయ్యె. మనకిఁక మాతృభూమి యాశ్రయము మొసఁగఁజాలమేఁగదా!

ప్రతా—నిక్కము. మేవాడుమాతను నాచేచేత శాత్రవులకొసంగితి. కానిండు. నా మేనప్రాణములుండువఱకు నమ్మాతను బాయఁజాల. ఈ మేవాడుమాత కాకున్నను, వీరస్వర్గమైన నా కాశ్రయము మొసంగదేమో చూచెద.

గోపీ—కుమారా! యిట్టిమౌర్ఖ్యము కార్యసాధకమగునా? నీవొక్కఁడవిందుండి యేమొనర్పఁగలవు? ఎట్లైన మేవాడుమాతకు స్వాతంత్ర్యమును మఱల చేకూర్పవలదా? మనతనువు లీజన్మభూమిని బాసినను మానసములిందేయుండుఁగదా? సింధు ప్రాంతారణ్యములఁ జేరియుండుండి ఢిల్లీకిఁబోవువస్తునిచయముల కొల్లగొట్టి, ధనమును సైనికుల నుజేర్చుకొని క్రమక్రమమున జయలక్ష్మిని సాధింతము. రమ్ము. నేనంతయు వచింతు.

ప్రతా—జననీ! దేశమాతా! విధిలేదు. పోవనేవలయు! కన్న తల్లిని రక్షింపఁజాలని సుతుఁడుండుటకంటె చచ్చుటయే మేలనియూరటవహింపుము.

సీ॥ మాతను, మాన్యను, ♦ మహివైరులకునమ్మి
చనియెదననినన్ను ♦ కనలకమ్మ!
తనువునప్రాణముల్ ♦ తనరుసందాక నీ
సుస్వాతంత్ర్యతఁబెంచఁ ♦ జూతునమ్మ
నీసుతుల్ మాతృద్రో ♦ హాసక్తులైరని
వలవంతనందఁగ ♦ వలవదమ్మ
సతిసుతప్రాణాళి ♦ జననీ! నీకర్పించి
నీసేవచేతు చిం ♦ తింపకమ్మ

తే॥ గీ॥ వరహమీరాన్ సంగరాణాస్ర ♦ పాలరక్త
మింక నామేనఁబుష్కలమై ♦ యింకదమ్మ
సతతవిహగరుతసమాశి ♦ షంబులో వేఁగి
జననభూమాత! నన్నింక ♦ దనుపుమమ్మ!

సీ॥ భవ్యశోణానుచాం ♦ బుజనదీజలముల
ద్రావించి పెంచిన ♦ రాజమాత
ఆరావళీఫలా ♦ హారముఁ నర్పించి
సుముబోధిమనిచిన ♦ మహితజనని
వరమహావధీరప ♦ వ్యాప్తివ్యాధులమాన్పి
ఘనబలదాత్రియౌ ♦ కన్నతల్లి
స్వర్ణమణీధాతు ♦ సమితినస్మద్భాగ్య
విభవముల్ చేకూర్చు ♦ వీరమాత

తే॥ గీ॥ నిన్నువిడనాడి విధిలేక ♦ నేఁగువాఁడ
నేదుపరతంత్రతాదుఃఖ ♦ మిందుఁబాధ
వలసి పోవొద సెలవిచ్చి ♦ పనుపుమమ్మ
మహితమేవాడుజనయిత్రి! ♦ మాన్యగాత్రి!

(నిష్క్రమము)



శ్రీ

# మేవాడు శౌర్యాగ్ని నాటకము.



## చతుర్థాంకము.



### ద్వితీయరంగము.



కొమల్మేరుదుర్గము - సాగరీభవనము.

ప్రవేశము - ప్రమద

ప్రమద—రాజపుత్రస్థానసామ్రాజ్యమే నాగమ్యస్థానము, దానికై దైవమెన్ని యంతరాయములుఁ గల్పించినను మదీయశేముషీ ప్రభావమహాఖడ్గంబున నసాధ్యంబుల సాధ్యంబులొనర్చి, యుపాయంబున మిన్ను మన్ను నేకంబు చేసెద. అంతటవిడుతునా! పిదప యీమొగలుల కంఠనాళముల మదీయతంత్రజాలమహాశృంఖలములచే బంధించి భారతసామ్రాజ్య పదవినందెద! తొలుదొల్త నేనొనర్పఁబూనిన ప్రపంచదిగ్విజయమహాయజ్ఞమునకు ప్రతాపుని, సమరసింహుని, ప్రథమ బలిగాచేసెద. నాహృదయశల్యము బాపికొని, నిష్కంటకముగ రాజ్యమేలెద. పిదప నా మొగలులున్నారు. నేనున్నాను ధైర్యదేవతా! నీవొక్కతెవు నన్ను బాయకుము. అరివాహినులైన నేమి? ప్రబలతరసురవాహినులైన నేమి? ఢిల్లీసార్వభౌముఁడైన నేమి? చిరుపల్లియల ధాముఁడైన నేమి? వారిని నీకు సమర్పించి కన్నబన్నములబడునట్లొనర్చి భరతఖండము

నేనాకరతలంబుననిడుకొని, చేతనదిమి, నేలవిసరి, కాఁవలఁచి, భూమిరాచి నిర్నామముగావించెద.

(ప్రవేశము సేవకుఁడు)

సేవకుఁడు—మహారాణీ! సైనికులొక బాలకుని బంధించి తెచ్చియున్నారు.

ప్రమద—కానిమ్ము. మహారాణాగారెందున్నారు?

సేవకుఁడు—మహారాణాగారు రహస్యాలోచనమందిరమున భవానీదాసుతో మాట్లాడుచున్నారు.

ప్రమద—పొమ్ము. రాణాగారికీవార్త వచింపుము?

సేవకుఁడు (నిష్క్రమము)

ఆహా! వీఁడే అమరసింహుఁడై యుండునా? నా కార్యమంతయుం జక్కఁబడఁగలదు. నానాథుఁడే మొనర్చునో చూచెదఁగాక!

(నిష్క్రమము)

(యవనిక నెత్త ప్రవేశము అమరసింహుఁడు సైనిక నిర్బంధమున)

(అనుబంధము 12)

ప్రవేశము సాగర్జి

అమర—పితాజీ (అంగభటుల తప్పించుకొని సాగర్జి నాలింగన మొనర్చి కొనఁబోవును)

సాగ—దురాత్మా! ఆమాటనకుము! (అని త్రోయును) చావనున్న నీకు పితాజియైననేమి? మృతాజియైననేమి?

అమ—(దిగ్భ్రాంతుఁడై నిలచును)

సాగ—ఇదే! నీకు మృత్యువాసన్నమైనది! తలఁచికొనుము నీతలితండ్రుల! తలఁచికొనుము నీదైవమును!

అమ—నన్ను! నీవు సంహరించుటయా! నిక్కమా!

సాగ—నిక్కము! ముమ్మాటికిని నిక్కము! నీమృత్యువు నాచే నగుట విధివిధానము. దీనితప్పింప నీవు కాదా దైవము వచ్చినను కాఁజాలడు! మేవాడు భూమియందైదడుగులు భూమిమాత్రము నీకు కనికరమున నొసంగెదను!

అమ—పినతండ్రీ! నేఁడునీచందమతి విచిత్రముగ నున్నది! నీవు లాలించి, మన్నించి పెద్దఁజేసిన యమరసింహుని నీవుసంహరించుట!

సాగ—కావుననే నిన్నేమిచేయుటకును నాకుస్వాతంత్ర్యముకలదు. ఇఁకనిన్ను పాలించువాఁడా యముఁడు. నిన్ను చంపినకాని నాకు సుఖము కలుగదఁట!- ఔను-నీవుండువఱకు నాకు మేవాడు సామ్రాజ్యము నిలువదు. శవము లెన్నిటికిని మనుజులబాధింపవు. నాహృదయశల్యమై శాత్రవోపమాన ఘోరసర్వస్వమగు నిన్ను చంపి నా మనశ్చింత బాపికొందును.

అమ—పినతండ్రీ! నేనునీకు హృదయశల్యమా! శాత్రవుఁడనా! పరిహాసమున కైనను కోపించియెఱుఁగవే? అట్టినీవు నన్నుచంపవచ్చిన నేనేమందును? కలయందైన నీమాటకు మాఱుపలికి యెఱుఁగనే? నేనుని చెంత కేతెంచినంతనే "కుమారా! అమరసింహా!" యనియెంతయో, ప్రేమనిండార పలుకరించుచుంటివే? నాజనకుఁడు కోపింప నన్నెంతయో నాదరించుచుంటివే? ఏయుత్సవము కాని, యేవినోదము కాని, నేను చెంతలేకున్న నదిప్రమోదోత్సవము కాదని యెన్నియో మారులు మాతండ్రి మందలించినను, మానక, క్రమగణింపక నాకై వేచియుందువే! ప్రాతఃకాలమున లేచునరికి నన్నుఁగాంచకున్న నీకుమారుని నజితసింహుని సైతము తిలకింపవే? ఇప్పుడునన్ను సంహరింతువా? నిక్కమా! నేవిశ్వసింపఁజాల!

సాగ—అవన్నియుకల్ల! అదంతయుభ్రమ! ఇపుడునాచేమరణించుటమాత్రము ధ్రువము. ఇదినీనొసట వ్రాసినవ్రాలు. నీకును, నాకు

ను చుట్టరికమున్నను, బాహుఖడ్గమునకును నీప్రాణములకును చుట్టరికముక లుగదు- కలుగరాదు- కలుగనివ్వను.

అమ — పితాజీ! నామీద నేలకోపము? నీవుచింతాక్రాంతుఁడవై యున్నతరి నీకుమరల సంతసము కలుగువఱకు భుజింపని నాప్రేమనుమఱచితివా? వాఁడునీవు రోగబాధితుఁడవై యున్నతరి, నీతలకడ నుపవేశించి, లోకమేమునిఁగిన భంగివగచుచు, నీకుపచారముచేయుచుండ, చెంతఁజేర్చి, ననుముద్దాడి "కుమారా! నీవేనా సామ్రాజ్యంపుటధికారుఁడ"వని వచించిన పలుకులమఱచితివా? ఎందుచనియె నీప్రేమ? ఎందుపోయెనీకూర్మి? నేనొనర్చిన నపరాధమైననెయ్యది? అజ్ఞానవశమున నపరాధమేమైన నొనర్చియున్న నిదేపాహీయని పాదములఁబడెద! క్షమింపుము. (అనినమస్కరించును)

సాగ — కాలాహివాలమా! ఘోరవిషమయ సంతానమా! నీయపరాధము నీవెఱుంగవా? నీతండ్రికి నీవుకుమారుఁడవగుట యొక్కటియే చాలదాయపరాధము!

అమ — పితాజీ! యేమంటివి? నాతండ్రికి నేనుకుమారుఁడనగుటయే నేనొనర్చిన యపరాధమా! లోకైకవీరుఁడై, దేశభక్తిస్వార్థపరిత్యాగములకే యాదర్శప్రాయుఁడై, శిశోదియావంశమునకే లోకోత్తరకీర్తిఘటించిన ప్రతాపసింహ రాణాకు కుమారుఁడనగుటయే నేనొనర్చిన యపరాధమా! కానిమ్ము. అదియపరాధమే యైన, నాయపరాధమునకు నాప్రాణముల పరమసంతోషమున నొసంగెద! నీవుప్రతాపసింహ సోదరుఁడవు కావా? నాకుపినతండ్రివి కావా?

సాగ — కాను-కాను- నేనునీకు పినతండ్రిని కాను. నీవునాకుసుతుఁడవు కావు. నీకును నాకును నెట్టిసంబంధమును లేదు. అరివర్గముల యాపుమాప నేతెంచునీస్వీయకార్య దీక్షాబద్ధునకు, మేవాడు సామ్రాజ్యర

మాఖండలుననూ, కుమారుఁడైనను, సుకుమారుఁడైనను, సోదరుఁడైనను, శాత్రవుఁడైనను నొక్కటియే! అనన్యసామాన్య మనోరోగము బాపికొని సుఖించెద! నా కార్యకరణమహోత్సవమున కెట్టియంత రాయములు కలిగినను వానిరూపుమాపెద! ప్రేమవాత్సల్యాది బంధంబుల ఛేదించెద! విసర్జించెద మనోదౌర్బల్యమును. త్యజించెద మానావమానహీనతర శృంఖలమాల! అర్పించెద నీశిరమును భూమికి తొలిముద్దుగా!

అమ—(మోకరించి) గైకొమ్ము. సంతసమున నొసంగెద! నా ప్రాణముల కదా నీవు గైకొననెంచుట! అవిక్షత్రియశేఖరునకు ప్రాణప్రియములు, జనకస్థానమలంకరించిన నీచే నవిచనుట నాకెంతయు సంతసమేయగు. నీకన్ననో ప్రాణాధిక కీర్తి కాంతయే నీనుండి తొలంగు. నీచేత ప్రకాశించుచున్న కఠినతరలోహనిర్మితకరవాలమే, యీహింసాకరఘోరకృత్యమొనర్ప కరుణవహించి, చలించుచుండ, నాజనకస్థానములంకరించిన నీకు కరుణకలుగకున్న నికనేమందును? అరులకు నిజరాజ్యప్రాణంబులనేని యర్పించిన పావనతరసూర్యవంశరక్తమింకను నీయందు ప్రవహించుట లేదా? మానవజన్మసామాన్యభూతదయాపవిత్రాపాసులు నీయందుమాత్రము నిస్తేజములై నిర్జీవములై పోయెనా?

సీ. నీపాపకృతికినై ♦ నీఖడ్గమసియాడ,
పినతండ్రికరుణని ♦ న్నెనయరాదె?
వరశిశోదియవంశ ♦ పావనరక్తమీ
దేహనాళికలందు ♦ తేజరిలదె?
ఘోరమాశిశుహత్య ♦ "కూడదు; కూడదనీ"
పలుకుమానససాక్షి ♦ పలుకలేదె?
క్షత్రియకోటిదు ♦ స్తరమైనయపకీర్తి
కలుగునంచనియాత్మ ♦ తెలియలేదె?

గీ. రిపులు నైనను నీపావ ♦ రీతి నేవ
గింతు రిది యకార్యం బని ♦ యెన్నవలదె!
నీచకృత్యత నార్జించు ♦ విభవమెల్ల
తిరముఁ గాదంచు సుజ్ఞాన ♦ మరయవలదె!

సాగ — కానిమ్ము! మృత్యుముఖము నందర్థముఁ జొచ్చి యర్థము భూమిపై వ్రేలాడునో ప్రేతమా! నీవేమన్నను నరకుఁగొనను. యమభట కాలపాశ కాలదండ మర్దిత ప్రాణాపాయ మృత్యుకేలిహ్యాపానమహాశవమా! నిన్నుపేక్షింపను. నాకు పశ్చాత్తాపమునకు కాలముమీరినది. కార్యానంతర మది కలిగినను నా కార్యతంత్రముల భేదింపఁజాలదు.

అమ — ఆ యమభట కాలపాశ కాలదండముల బారికిఁ జిక్కిన పుడైన భేదింపఁజాలదా! నేనింతవచించుట నాప్రాణములకై వెఱచి కాదు. ఈతుచ్ఛప్రాణములున్నను చన్నను నొక్కటియే. కాని, పినతండ్రి యగునీవు నన్ను సంహారించుటచే మహాదురితమున కొడిగట్టుచున్నాఁడ వుకదా యని చింతించు చున్నాఁడ! నే శూరుఁడ. శూరనందనుఁడ. దుర్మరణమొందనొల్లను. వేనవేలు తురుష్క సైనికులు నీచెంతనున్నారు. నాకొక కరవాలమిప్పింపుము. నీసైనికులలో నెవ్వరి నైన, నెందరి నైన, నాపైఁ బంపుము. నాకు వీరమరణముచే కూర్పుము. ఇదియొక్కటియే నా ప్రార్థన.

చ॥ జనకుని ప్రీతికై తనువొ ♦ సంగెద, కాని, మదీయ విక్రమం
బనితనరారు వైరుల హృ ♦ దంతర ప్రాణము లగ్రసింప వై
నననెడు! నీదు సైనికుల ♦ నెందరి నైనను బంపి తత్ప్రశాం
తినిఁ గొలుపంగ వేడెద! ను ♦ దీర్ణమతిన్ రణభిక్ష నియ్యవే!

సాగ — (స్వగతము) మానసమా! వికృతకార్యనాశన ధూమకేతు వైన కరుణారసమునుఁ బూనకుము! పుత్రుఁడే, దీనుఁడే,

శూరుఁడేయని చలింపకుము. లోకసంహారసిద్ధ కాలపురుషా! నాయుం దావహించి, శాత్రవబీజాంకురములు నశింపఁజేసి, కరవాలధారారక్త సిక్తకరవిరాజమాన పంచాంగుళుల భీషణ, కఠోర, క్రౌర్యసమాలింగితుఁడవై పదిలముగ రమ్ము.

చ. ఖరతరకోపవహ్ని ప్ర ♦ ఖ్యాతమునంబ! దయారసానుసం
చరణతశైత్యమొందకుము! వి ♦ చారము నొందకు! కృత్యదేవికిన్
స్థిరబలినిచ్చి వైరకళ్రీతు ♦ దీక్షనుఁ దీర్చి, గతార్తి శాంతవై
పరగుము రాజరాట్పదవి! ♦ బాయుము సంశయమేఘబృందమున్.

(ప్రకాశము) ఓరీ! రమ్ము! నిన్ను తెగటార్చెద! నాకు పాపమే కలుగుఁగాక!

అమ:—అయ్యా! యిదే సిద్ధముగ నున్నాఁడ. దీన నీకెట్టిసుఖమైన కలుగునెడ నీసంతసమునకై, ప్రాణములనర్పింప సంసిద్ధుఁడుగ నున్నాఁడ. ఇదియేకదా పుత్రధర్మము! అయిన, తండ్రీ, నీవు నీధర్మమును పాలించుచున్నాఁడవా! యోచింపుము. తొల్లి, భోజకుమారుని నతని పినతండ్రి ముంజుఁడు చంపనెంచెకదా? అతఁడెట్టి ప్రతిఫలమందె? "భోజ భోజ"యని పలవరించుచు, పశ్చాత్తాప బాధితుఁడై దుర్మరణమొందఁడా? మార్వారుదేశమున, భవానీసింగు, తన యన్నకుమారునిఁ జంపి రాజ్యము నపహరింప ప్రయత్నింపఁడా? అతనికెట్టి భోగభాగ్యములబ్బె? దుర్మరణమొక్కటియేకదా? నీవు మాత్రమిానీచ ఘోరకార్యమున నేమి సాధించెదవో చూచెదవఁట.

"సీ॥ భానాసు బాంబులు ♦ మహితమామేవాడు
శోణితవాహినుల్ ♦ చూచునాఁడు,
మణిహేమ పుష్పమా ♦ మాతృభూమిని సర్వ
నృపశిరస్తండముల్ ♦ నెగడునాఁడు,

వేణువీణాగాన ♦ హృద్యమౌ నీభూమి
నవిళవక్షిలాపదంబు ♦ వినెడువాఁడు,
మృగమద సౌరభ ♦ మేవాడు భూమిని
శవగంధమెల్లెడ ♦ గనలయువాఁడు,

తే॥ సర్వ సుత, బంధుసోదర ♦ సచివ మిత్ర
మరణములకెందువిలపించి ♦ మనెడువాడు
బ్రిదికియే రౌరవనరక ♦ బాధలెల్ల
అనుభవింతువు వెతలిందె ♦ యనఘచరిత!”

నీవేమైన నొనర్పుము. నేనంతనమున భరించెద. నాధర్మము ను పాలించెద. నను సంహరించినను నది నాభాగ్యముగనే నెంచువాఁడ. ననుచెంతఁ జేర్చినను, దూరీకరించినను, పాలించినను, ఖండించినను నినుమానను. చూచెద నీకు దైవమిట్టి బుద్ధి నొసంగడినో?

గీ. శిరము నర్పించి సుతకృత్య ♦ మరసిఁ దీర్తు;
తనయుపాలించి యొక్రిచునీ ♦ జనకకృత్య
మెట్లుఁ దీర్తువో? దైవంబు ♦ నేమిగొనఁగ
కలఁడో? చూచెద! కానిమ్ము ♦ తన్మాతలేంద్ర.

(అని యొక్క యెగురున పోయి సాగర్జిని నాలింగన మొనర్చికొనును)

సాగ—(కరవాలము క్రిందఁ బడును- తలవంచి, కన్నీరు నించినిలువఁబడును. ప్రవేశము- శీఘ్రయానమున ప్రమోద యొకవైపు నుండి, భవానీదాసు మరియొకవైపునుండి)

భవా—మహారాణా! యిటురండు- పాదుషానుండె కమ్మఁగొని ప్రతీహారియొకఁడు ద్వారమున మీకై వేచియున్నాఁడు. పోండు- (సాగర్జిని- బలాత్కరణమున నావల బంపుచు) ఓరీ! నీమాయయాన టనలచే మహారాణా గారికి కరుణ కలిగించి, తప్పించుకొనఁ జూచితి వా! నాయెడ నీయాటలు సాగిరావు.

అమ—నిక్కము. దాసీపుత్రుఁడగు నీయెదుట నే నాట్యమాడఁ గలనా? నీచాత్మా! యొనర్పుము నీయిచ్చవచ్చినరీతి! ఈప్రతాపసింహ తనయుఁడు నీయట్టి నీచుల మాటాడింపనైన నొల్లఁడు. నేను నిరా యుధుఁడనని తలఁచితివి కాఁబోలు? క్షాత్రసహజ శౌర్యాగ్ని నాయందు ప్రజ్వలించుచునేయున్నదని నమ్ముము.

భవా—దురాత్మా! చచ్చితి వింకెందు పోఁగలవు.

(ఖడ్గమెత్తి యమరసింహునిపైఁ బోవును. లోపలనుండి బాణ మొకటి యతని హృదయము దూసి పోవును. "ఆ- హా- హా- చచ్చి తి-" అని క్రిందబడును- ప్రవేశము యిరువైపులనుండి రాణాబాయి దుర్గాదాసులు- ప్రమద దిగ్భ్రాంతరై నిలచియుందురు)

(యవనికాపురో భాగమున ప్రవేశము రాణాబాయి-దుర్గాదాసు అమరసింహులు)

రాణా—దైవకృపచే కృతకృత్యులమైతిమి. మనము రహస్య మార్గములన్నియు నెఱింగిన కతన సమయమున కందుచేరఁగల్గితిమి కాని లేకున్న నెంతప్రమాదమగుచుండెను?

దుర్గా—మనయాకస్మికాగమనముచే శాత్రవులు నిశ్చేష్టితులై మనకవకాశము కలిగించిరి కాని, లేకున్న మనలో నొక్కరైన యమపురమున నిప్పటికి పోఁతేఁ కాపైయుండఁడా? (లోపలకలకలము)

రాణా—అదే! శాత్రవసైనికులు నలువైపుల పరతెంచుచున్నారు పొమ్ము-నీప్రభువును చేరుము. నేనును, యువరాణాయు, భిల్లసైన్యములగూర్చికొని మిమ్ము కలసికొందుము. ఇంకతడయకుము.

అమర—దుర్గా! పొమ్ము! నాజనకునితో నాక్షేమమువచింపుము. విజయలక్ష్మి కరగ్రహణమొనర్చికాని అమరసింహుఁడు తండ్రిని చేరఁడనివచింపుము.

గీ. అరులఁ జేరినరాసిరి ♦ నరయఁబిలచి,
విల్లు నెలవంకహారమ ♦ ర్పించి, రాజ
పుత్రిసుస్థానమున నిల్పి ♦ పూన్కిఁ దీర్చి,
తనయుఁడిటు వచ్చుననిఁ దెల్పు ♦ తండ్రితోడ!

దుర్గా—ఏమీ? నాప్రాణములనైన యుద్ధావనికర్పించెదగాక- సైనికులు మార్గాన చనుదెంచుచుండ, వైరికంఠమాలికల ధరింప నాకరవాలము వేకరుచుండ, శాత్రవులకు వెన్నిచ్చి పరువెత్తుదునా?

చ. సవనములందు మంత్రితతి ♦ సన్నుతిఁ బిల్వ సురాళిమిన్నకన్
భవనములందు నిల్చునే? యు ♦ పారవిపక్షచమూపతుల్ ననున్
బవరమొనర్పనంపగమి ♦ పైపయిఁబిల్వ చనంగ పాడియే?
అవనిని శూరధర్మమె? మ ♦ హాపయశంబిదిఁగాదె? మానినీ!

రాణా—వలదు. శాత్రవుల కభిముఖముగనే తిన్నగ వెనుకకు పొమ్ము- ఆలసింపకుము.

దుర్గా—(మోకరించి) యువరాణా! సెలవిందు- సేవకుఁడు మరల మిమ్ముచేరఁగలఁడు. ఈదేకరవాలమునుఁ గైకొనుఁడు.

ఉ. ఎట్టితపంబుఁ జేసెనొకొ ? ♦ యాభరతాంబిక! విక్రమాఢ్యు నీ
యుట్టి శిశు ప్రసూనమున ♦ నైనను సౌరభ దేశభక్తి వేఁ
బుట్టగఁ గాంచె ! యిట్టిగుణ ♦ భూషణు లేవురుఁగల్గిరేని, తా
నెట్టిస్వతంత్రపీఠి విల ♦ సిల్లును దేశమతల్లి ధారుణిఁ!

అమ—(ఖడ్గమునుఁ గైకొని) దుర్గాదాస్! సింహకిశోరము సింహకిశోరమేయగుఁగదా! చేతరాజలక్షణాంచిత కరవాలముందు వలెను నీప్రభుకుమారుఁడుతనవంశమున కపయశముఁ గూర్పఁడనినమ్ముము. పొమ్ము. (నిష్క్రమము. అందరు.)

# మేవాడుశౌర్యాగ్ని నాటకము

## చతుర్థాంకము.

### తృతీయరంగము.

[పర్వతగుహ; ప్రతాపుఁడొకచో చతికిలఁబడియుండును]

[లీలావిక్రములు దూరమున నుపవేశించియుందురు]

ప్రతా—సీ॥ మేవాడురాజన్యు ♦ మేలిమిపుత్రివై
కటికనేల పరుండఁ ♦ గంటివమ్మ!

లీల—దేశసేవాభాగ్య ♦ దీప్తబిసశయ్యయే
వరహంసతూలిక ♦ పాన్పుతండ్రి!

ప్రతా—సతతసామ్రాజ్యైక ♦ చక్రవర్తిని కాన
పాదచారిణి కాఁగ ♦ వలసెనబల!

విక్ర—మాతృసేవాభాగ్య ♦ మాన్యుఁడౌపతివెంట
చరియించుటేపుణ్య ♦ సరణినాథ!

ప్రతా—పక్వాన్నసమితిని ♦ పారవైచెడునీకు
ఆకునలమ్ములా ♦ హారమాయె!

లీల—స్వాతంత్ర్యపక్వాన్న ♦ సాభిలాషులకెందు
ఆకునలమ్ము ప ♦ క్వాన్నమయ్యె!

ప్రతా—కౌశేయవస్త్రసం ♦ కాశినివౌనీవు
నారచీరలఁ గట్ట ♦ వలసెనతివ!

విక్ర—సత్కీర్తిదే నాకు ♦ సతత కౌశేయంబు
నారచీరలిల స్వ ♦ ర్ణాంబరములు
ప్రతా—గీ. నాడు గర్భసీమను పుట్టి ♦ నందుకతన
కంటి కడగండ్లనెన్నియో ♦ కన్నతల్లి!
లీల— లోకసన్మాన్య! నీగర్భ ♦ లోకజాత
నగుట లోకైకమాన్యనే ♦ నైతినవని!

ప్రతా—కుమారీ! నీసంతాపమును చూడజాల! వంశపరంపరార్చిత దేశమాతను, మేవాడురాజ్యమాతను, నాచేత పరులకప్పగించి, వారొనర్చు నత్యాహితముల తిలకించి, యమ్మాత పరితాపమును చూడనోప! శిశోదియావంశకీర్తి గౌరవముల శాత్రవులకు విక్రయించి వారుతిని, యనుభవించి, పారవేసిన యుచ్ఛిష్టమును స్వీకరింపనోప!

సీ॥ మోరీలనోడించి ♦ యీరాజ్య రమనొక్క
మానిని యనని ల్పె ♦ మహినొకండు
మహామదుటగ్గకు ♦ మహినోర్చి యాదేవి
పోషించి స్థైర్యత ♦ బ్రోచెనొకఁడు
విజిత దేశాధీశ ♦ విజయచిహ్నాల వరా
భరణభూషితఁ జేసి ♦ మనిచెనొకఁడు
భరతమాతకె శిరో ♦ మాణిక్యమనకీర్తి
మకుటధారిణిఁ జేసె ♦ మాన్యుఁడొకఁడు
తే. వారిశౌర్యాగ్నిజనిత మే ♦ వాడుమాత,
పారతంత్ర్యానుశృంఖలా ♦ బద్ధఁ జేసి,
ప్రాణమీదేహముననుండు ♦ పట్టు-చాల
శాత్రవోపభోగిని చేయఁ ♦ జాల! చాల!!

[ప్రవేశము దుర్గాదాసు]

దుర్గా — దేవా! జయము జయము.

ప్రతా — దుర్గా! క్షేమమునవచ్చితివా?

విక్ర — దుర్గా! అమరసింహునిగతి యెయ్యదియో యెఱుంగు దువా?

దుర్గా — మహారాజ్ఞీ! మేము యువరాణాను రక్షించితిమి. రాణాబాయిజనసియు, యువరాణాగారును భిల్లసైనికులఁ జేరఁబోయిరి. శాత్రవులనుండి వారికిఁక నెట్టిభయమును నుండదు. దేవా! మనకిపుడు కర్తవ్యమేమి? మనసేనయంతయునశించె. శత్రుసైన్యమందమా! దానికే నాశమే ఘటిల్లదు. దీనికెయ్యదిమార్గము?

ప్రతా — దుర్గా! నిజము. ఉన్నసైన్యమంతయు శాత్రవులకు బలియైసంగి, నీవొక్కఁడవు, నేనొక్కఁడనుకదా మిగిలియుండుట! ఇదే శాత్రవులువచ్చిరి. అదే సమరసన్నాహము సమకూరుచున్నది! అయ్యదియేవిజయలక్ష్మి సుముఖార్త మని, యొక్కతావునుండి మరియొకతావునకు, నొక్కవృక్షప్రకాండమునుండి మరియొకవృక్షప్రకాండమునకు, నిజపత్నీ శిశుసంసారముతో తిరగి తిరగి, రేయికనులార నిద్రయు, పగటివేళ నాకలినణంచు యోగిరమునులేక చరించు నీమేవాడురాజ్యరమానాథుఁడు దేశసంసేవ యెట్లొనర్పఁగలఁడు? ఒక్కతూరి యత్యాధికోన్నత మహాబలగరిష్ఠుఁడైన పాదుషాతో సంధికియ్యకొనుటయే కర్తవ్యమని తోఁచుచున్నది. మరియొకతూరి బాప్పారావు వంశమున కే కళంకమాపాదించు భయాక్రాంత శత్రుసమిత్ర నాశ్రయించువల యునాయనిసందియము పొడసూపుచున్నది, మామకధైర్యవజ్రధారాసహాయం బొక్కటిదక్క, త్వదీయవిక్రమోత్సాహ ఛత్రింబొంపుదక్క మనకు వేరొండు సహాయసంపదకలదే?

దుర్గా—దేవా! యింకేల యాలోచన! దుర్గమమై, దుర్లభమై, దుర్ధర్శ్యమైయున్న యుద్ధవిజయమును భూమినిత్రవ్వి, రసాతలంబువ్రచ్చి, యాచ్ఛాదన మహాశిలాపటమును వదలించి, నిజశస్త్రముఖమున లేవనెత్తి, బాహుబల సమగ్రాకర్షణమున పెడఁదీర్చి, హృదయమందిరమున నిలుపుదము. లేకున్న నస్మదీయ చరణపంకేరుహద్వయమును వీరస్వర్గమున నిలుపుదము!

సీ॥ నయనలతాప్యాత్రీత ♦ నవ్యవిమానాగ్రి
దుర్దృశ్యమై మింటఁ ♦ దోఁచుదాని
సాహసైకసుగమ్య ♦ సాధనిగూఢమై
అరిహృదయాయాస ♦ మైనదాని
మామక ప్రణయు ♦ జ్మాన్యసమాహార
పరమాభిలాషచే ♦ పరగుదాని
శస్త్రహయాంచిత ♦ స్యందనగమన స
ముత్సాహపూర్ణమై ♦ యొప్పుదాని
గీ॥ హృదయసంకల్ప దుర్గమ్య ♦ దృష్ట్యభావ్య
పట సమాచ్ఛాదమున నొప్పి ♦ పరగుదాని
విజయకన్యక వెలిఁదీసి ♦ విమలకీర్తి
పీఠి నిలుపుద మింక లెమ్ము ♦ పృథివిపాల !

(లోపల - కలకలము.)

ప్రతా—అదే ! శాత్రవసేనాకోలాహలముఁ బోలెనున్నది. దుర్గా! అది యే మ్యాదియో పరికింపుము.

దుర్గా—భాగ్యము. (నిష్క్రమము)

ప్రతా—ప్రేయసీ! విక్రమా! మరల యుద్ధము తటస్థించెడి కాఁబోలు! యుద్ధమే తటస్థించు నెడ నీచిన్నిశిశువు నేమొనర్తువు?

విక్రి—నాథా! దైవమొసంగిన యీచిన్నిశిశువును దైవరక్షణమునకే యొసంగెద! ఈవస్త్రమునచుట్టి యీవృక్షమునకుఁ గట్టెద. యుద్ధానంతరమున ప్రాణములతోనున్న వారీశిశువును రక్షింతురు. లేకున్న యే భిల్లాంగనయైన రక్షించును.

ప్రతా—భళీ! కాంతా! యిపుడు నీవు వానిక్కింపు సహధర్మచారిణివైతివి! [ప్రవేశము - దుర్గాదాసు]

దుర్గా—మహారాణా! లెండు! లెండు! నేలయీనినచందమున నరిసేనాకదంబములు, దివ్యపతాకాంచితాంబర సంస్పర్శనంబున, మేఘబృందముల నావలఁదోలుచు, నిజసంచలన పటాత్కారమహాశబ్దంబులవైరివాహినుల నాజికిఁ బిలచుచున్నవో యనమిడిదేరి, విక్రమించి, సంచరించి, సంచలించి, మించుచు చనుదెంచుచున్నవి.

ప్రతా—అరరె! అరివాహినుల కింత కావరముఁ గలిగెగా? నేనెందు తలదాచుకొందునన్నను, నవకాశము కలుగనివ్వక, యీకొన్నసింగంబు నన్వేషించుచు చెంగుచెంగునఁ బరతెంచు కురంగసంఘంబులక్రియ నావద్దకే చనుదెంచుచున్నవియా? దుర్గా! చూడుము చావకబ్రదికియున్న మనసేనానులకరవాలములు కేలనున్నవో? కాలనున్నవో? లేక నేలనున్నవో?

దుర్గా—దేవా! మనరాజపుత్రసేనానులందరు పలాయితులై శాత్రవపక్ష మవలంబించిరని మున్నే నేను విన్నవింపలేదా!

ప్రతా—కానిమ్ము. దుర్గసైన్యమేమైన జీవించియున్నదా?

దుర్గా—దుర్గసైన్యములు యీమదుర్గమునుఁ జేరియుండుట మఱచితిరికాబోలు! సహస్రభిల్ల సైనికులుమాత్రమున్నవారు. శాత్రవసైన్యములు లక్షకుమీరినట్లు మనవారు వచించుచున్నారు.

ప్రితా-దుర్గా! ఇంకేలయోచన! లెమ్మా. భిల్లసైనికుల స్వప్రాణరక్షణమున జాగరూకతవహింప శాసింపుము. మనకాంతామణుల మంగళసూత్రముల కేలధరించి, వైరివిహారక్రీడకు నుపక్రమింతము !

మ॥ కరవాలంబొక కేల నాత్మసతిమాం ♦ గల్యంబు వేఱొక్కటన్
స్ఫురియింపన్ పరకంఠముల్ దునిమిత ♦ త్సోపాననిశ్రేణికన్
క్కరవాలంబను పల్లకిన్ తనరి స్వ ♦ ర్గంబేఁచేకొంద మో
వరవీరాగ్రణి కీర్తికాముకునకు నా ♦ స్వర్గంబెఁ యావాసమా!

విక్ర—నాథా! మేమును కరవాలములఁగొని యుద్ధమున శాత్రవుల నురుమాడి వీరస్వర్గమేనలంకరింపరాదు!

దుర్గా—జననీ! నీవంతకుఁజాలుదువు. కాని యిది మిక్కిలి సాహసకార్యము. మాకపజయముసిద్ధము. ఇట్టిచో మీరు శాత్రవుల చేఁజిక్కిన మీమానధనమునకే భంగము కలుగుఁగదా! మేవాడుస్వాతంత్ర్యదేవతను రక్షింపఁజాలకున్నమా నేఁగాక, మేవాడురాజకుటుంబకీర్తి గౌరవములైన నిష్కళంకముగ నుండవలదా? అందును మొన్నఁగలిగిన పర్వతాపాతమున నీవును నీలీలాకుమారియు నడువఁజాలకున్నారు. కావున - దైవమా! నాకెట్టిబుద్ధి స్ఫురింపఁజేసితివి-?

ప్రితా—దుర్గా! నిక్కము. వీరిమానరక్షణమే కరణీయమగు నెడ వీరికిమృతికంటె వేఱుపాయములేదు. ప్రేయసీ! నిన్నుయావజ్జీవము పాలింప కంకణబద్ధుఁడైననీ నాథుఁడే-నీదుర్భాగ్యపునాథుఁడే- నీకుమృతికంటె వేఱుమార్గము లేదని నోరారవచించుచున్నాఁడు! లీలా (చెంతజేర్చి) కుమారీ! నీవొక్కతెవైన బ్రదికియుండుట దైవమున కిష్టములేదా! అమ్మరో! నిన్నిన్నిదినములు పెంచి పెద్దఁజేసిన నీజనకుఁడే నిను చల్లగమడయుమని శాసించుచున్నాఁడని దూరకుము. ఈప్రితాపుఁడు

సకుటుంబముగ మడసినగాని దైవమునకు మేవాడుపై కరుణ కలుగ నట్లు దోచదు.

దుర్గా—అక్కటకటా! సాగ్రజీహాతకా! దీనింగాంచిననైన నీకన్నులకు సంతసముకలుగునా?

విక్రి—నాథా! నాప్రార్థన నింతయాలకింపుఁడు. రాజపుత్రికామినుల కిట్టివేళ మానరక్షణమున కొక్కటియే కదా శరణము.

సీ॥ శత్రులకనుబ్రామ ♦ క్షత్రియసతులకు
మానధననిధి యే ♦ మాన్యదీక్ష
భరతభూరాంగనా ♦ స్వర్గసోపానమై
దీపించె నేవ్రత ♦ దీక్ష జగతి
నృపసతీహృల్లీన ♦ విపులశౌర్యాగ్నికి
సూచకమయ్యె నే ♦ శుద్ధదీక్ష
ద్రోహులదుష్కృత్య ♦ రూఢతిమిరంబును
బాప దీపిక యే ప్ర ♦ భాతదీక్ష

గీ॥ అట్టిసుఖదీక్ష, పరిభవా ♦ హ్లాదదీక్ష,
ధర్మయుతదీక్ష, యాపదు ♦ త్తారదీక్ష,
వీరజనదీక్ష, సాహసో ♦ ద్విగ్నదీక్ష,
అలరదే, నాథ! మాకు జో ♦ హారుదీక్ష॥

అయినశాత్రవులు నలువైపులనావరించియుండ, నగ్నిసొచ్చి మడయుటకిందుసాధనము లెందున్నవి? కావునమీఖడ్గముచే మముద్రుంచి, వైరిసంహారక్రీడకు నుపక్రమింపుఁడు. శిశోదియావంశ కీర్తిని నిష్కళంకముగ నొనర్పుఁడు. ఎట్లునుచావనున్న మాకు మీఖడ్గముచే జచ్చుట భాగ్యమే యగుఁగాదే?

ప్రతా—అయ్యో! నా భార్యామణిని నాకుమారిని చేచేతనం హరించుటయా! చాల - నేచంపఁజాల.

దుర్గా—అక్కటకటా! దైవమా! నీవెందున్నాఁడవు? ఇఁకనైన నీవరీతుమానవా? అరి తేరినయరివర్గముల గర్వమడంచి వీరలక్ష్మీపరిణయసుమమాలికలోయన శాత్రవకంఠసీమల నటించుచు,వీరులప్రాణధనమ్ములపగల్చి, నిజసన్నుతసత్కీర్తినిఁ గైకొను వీరక్షత్రియశేఖరుని కరమునునిజసాధ్వీమణిని,యాత్మసతిని కన్నతనయను సంహరింపఁ జేసెదవా? నిరంతరప్రధనకర్కశ పరిపంథిమానసంబుల డీలువుచ్చి రాజిల్లు నేత్రరాజీవంబులు కరుణారసమున, ప్రేమరసమున పరికింపఁదగిన భార్యాపుత్రికల క్రౌర్యంపుదృష్టులఁ జూడ నియోగించితివా? నిన్నేమందును.

ఉ. కొందరు ధర్మసంస్థితిని ♦ కొందువటందురు, క్షాత్రవిక్రమా
మందవిహారశూరతతి ♦ మానకయుందువటందు రాస్మ దే
శేందిరకై నిజార్థతను ♦ లిచ్చెడుచోట వసింతువందు రే
నెందును నిన్నుఁగాన! మరి ♦ యెందుననుందువొ? హీనదైవమా!

ప్రభూ! నేనిదియంతయు చూడఁజాల. నాకు సెలవొసంగుఁడు. శాత్రవకరవాలములకు నాప్రాణములర్పించి, వీరస్వర్గమునుఁ జేరి మాతృవర్గము సేవకై వేచియుండెద.

ప్రతా—దుర్గా! పొమ్ము. గుహాద్వారముచెంత హతశేషులఁ జేర్చికొని పోరుచుండుము. నేనునువీరిమానరక్షణవిషయమున నిశ్చింతాత్ముఁడనై నినుఁజేరెద. (లోపల కలకలము) శీఘ్రముగఁ బొమ్ము.

మ. తనయాదారల రక్తతీర్థముల త ♦ త్కంఠాబ్జహారంబులన్
తఁరుజ్జన్మ ధరాస్వాతంత్ర్యధనమున్ ♦ దైవంబేఁజూపించె! నేఁ
గొనెదన్ ప్రేమతమంబుద్రోసి, మమతా ♦ క్షోభంబుపోఁద్రోలి, వే
కనెదన్ స్వర్గమునందునిన్ను! చనుమా ♦ క్షత్రాన్వయాభూషణా!

(దుర్గాదాసు నిష్క్రమము)

విక్రి—నాథా! యేల సంకోచించెదరు. మీముఁబోలు ధీరశేఖరులకు, భవాదృశ దేశసేవాపరాయణులకు భార్య యేడ? పుత్రిక యేడ? అంతయు దేశమే కాదే? లెండు. తెగువవహింపుఁడు. మేము మీ కొఱకై వీరస్వర్గమున వేచియుందుము. కాలవిళంబ మొక్కటియేఁ గాక నందఱును నందుఁ జేరవలసిన వారలే కదా?

ప్రతా—దైవమా! కానిమ్ము. నీవెట్టివిషమసంఘటనఁ జేకూర్చినను మదీయోద్యమమును మానను. తరుణీమణీ! నీవేధన్యవు. నీకా సద్గతి కరతలామలకము! మీ మృతికై నేనావంతయు చింతింపను. అది రసపుత్రకామినులకు, వీరవర్యులభార్యాపుత్రికలకు ఖేదావహము కానేరదు. కాని ప్రతిపక్షగంధసింధురములపరిమార్చి, వైరిసంతానవితానములదహించు మదీయవిక్రమభానునకు ననుజీవిత, నాతోడిసుఖదుఃఖముల నద్వైతరీతి ననుభవించిన నిజభార్యామణిని, కన్నతనయను, యబలలను సంహరింపఁజేసిన దుర్విధికినై వగచెద! శాస్త్రమా! వీరలక్ష్మీధురంధరుఁడనై, నాకు మున్ముందుచని శాత్రవదిగంతదంతావళముల సంహరించి నాకెంతయు సహాయుడవై యుండు నీకెట్టిదుస్థితి చేకూరె?

సీ॥ తలఁబ్రాలుఁ బోసితి ♦ వల జయలక్ష్మికి
ప్రేమమై సంగ్రామ ♦ సీమలందు
ఆర్తార్తినిర్వాప ♦ ణాంచితరీతిచే
చెలఁగితి దీనుల ♦ శిరములందు
భువనశాసన ధర్మ ♦ ఘోషణ నలిపితి
బహుధర్మవేద వి ♦ ప్లవములందు
ఘనధనుర్బాణ ఖ ♦ డ్గంబనై వెలిఁగితి
శాత్రవకంధర ♦ సౌధమందు
గీ॥ దానముల, హోమముల, దేవ ♦ తార్చనముల,
తనరి, యిప్పుడు పుత్రికా ♦ దారకంత

ఛేదమొనరింప నెంచితే? ♦ సిగ్గులేక
క్షీణపుణ్యంబ! పాపిద ♦ క్షీణకరంబ!

మానసమా? నీవనవగత మెవ్వరిని, ప్రేమించి, వరించి యొనలేనిధన్యతకై వేకరుచుంటివో? ఏ కామినీ రత్నమును, నజ్ఞానావస్థయందును, జ్ఞానావస్థయందును, నిద్రయందైనను, కలనైనను, రక్షింప నగ్నిసాక్షికముగ ప్రమాణ మొనర్చితివో? యోయంభోజాక్షి. ప్రోత్సాహ వాక్యములంది, ధీరుఁడవై నాకుమున్ముందు శాత్రవులపై నడచుచుంటివో? ఆపదలు నన్నావరించిన వేళ, మనశ్చింతలు నన్నుదరికొనిన సమయమున, నేధీరాంగనా వాక్యముల నూతఁగొని వానినన్నిఁటిని వ్రేల్మిడినీదుచుంటివో? అట్టినానెయ్యంపుదొంతిని, విక్రమను, నబలయనిజంకక స్త్రీవధాపాతకము లెక్కింపక, విదళించి, ఖండించుట కుపక్రమించితివా?

సీ॥ తరవారిఝుళిపింప ♦ ధర్మదారకొసంగు
రాజభోగంబిదే ♦ రాజవదన!
రూక్షేక్షవీక్షణ ♦ క్రోధాగ్నిఁగురియింప
నవి ప్రేమచూడ్కులే ♦ యంబుజాక్షి!
కరవాలధార నీ ♦ కంఠంబుఁద్రెంచులే
యాశ్లేషసౌఖ్యమే ♦ యమలగాత్రి!
తనునిస్సృతారక్త ♦ ధారలు, కేసర
శ్రీగంధచర్చలే ♦ నాగయాన!

గీ॥ దేశజననికై సర్వంబుఁ ♦ దీసివైచి
ఎటులసైరింతు, కృతినెంతు, ♦ నిలచరింతు,
మమతవిదళింతు, ధీరత ♦ మహినిబెంతు,
అమలవిక్రమ! ధీక్రమ! ♦ యక్కటకట!

కుమారీ! లీలా! నీకామేలుచేకూర్చుటయున్న, నీయత్యధికముద్దులొలుకుపలుకులనాలకించుటయున్న, నదేపరమభాగ్యముగ నెంచునీపితాజి

తన యాభీలాభీలశాత్రవకంధరమాలావిచ్ఛేదనమహాక్రీడాలాలసమైన కరవాలమున ఖండించి ఛేదింపనున్నాఁడని కనలకుము. వీఁడు నినుసంహరించుటకై విధాతచేసృజింపఁబడిన కిరాతకుఁడుఁగాని తండ్రి కాఁడు. లీలా! యెందఱోనిరుపేదలయిండ్ల, హీనసేవకులయిండ్ల, జనించి యుండిన నీకిట్టివిషమసంకట మహాఘోరమరణదుఃఖము సంభవించి యుండదుకదా! కుమారీ! నినుకనులారఁగాంచనైతి. రాజ్యకార్యపర తంత్రత నీముద్దారుపలుకుల మనసారనాలింపనైతి.

సీ॥ వీణారవైక్యమై ♦ వెలయునీగానంబు
నింపారనెపుడునా ♦ లింపనైతి
తలవంచి వినయంబు ♦ తళుకొత్త నామ్రోల
శోభిల్లకనులార ♦ చూడనైతి
అంటిన తనుకాంతి ♦ యెటుమాయు ననుభీతి
ప్రీతిమై నినుకౌఁగి ♦ లింపనైతి
దొరతనంపుభరంబు ♦ దరిమీర నొకనాఁడు
ప్రేమపుత్రీ, యనిఁ ♦ బిలువనైతి
గీ॥ యిపుడుపర తెంచి, విధినెంచి ♦ విపదనెంచి,
కూర్మినడలించి, వ్రకిరాత ♦ ఘోరలీల
నెంచి, వధియింపఁబూనితి, ♦ నీచుఁడైతి
రమ్యసుకుమారి! యకట! లీ ♦ లాకుమారి!

సీ వీణావేణువిద్యాగాన పాండితిఁగాంచి సంతసింపని నాఁడు, నేచనుదెంచినవెంటనే యప్రతిమాన ప్రేమరసంబున చనుఁదెంచి, నాయంకతలమున నుపవేశించి, కోకిలకలస్వనమధురంబులగు నీపలుకులనాలకించి సకలకార్య సమాలోచనాయాసమునుఁ బాయని నాఁడు, నదియే జగత్ప్రళయంబుగ భావించుచుంటిఁగదా? ఆబాల్యమునగెంచి పెద్దఁజేసి రసరసాన్నములఁ బోషించినది నిజఖడ్గధార

తుత్తుమురొనర్చుటకా? అయ్యయ్యో! నిజకుమారీ ప్రియసుతులకు సముచిత సౌఖ్యపరంపరలఁ గూర్చుతండ్రులు, భర్తలు నుందురుఁ గాక నావలె నిజఖడ్గహతి కోమలకంఠనాళముల ఖండించు కఠిన కిరాతకులుందురే?

సీ. జననియంకమునందు ♦ చనుబాలు గ్రోలగా
రంజిలి వర్ధిల్లు ♦ రక్తజలము
ఈకరమందుంచి ♦ నింపారఫలసార
రాజిచేఁ బెంచిన ♦ రక్తజలము
అలిగిన గారాబు ♦ పలుకుల పక్వాన్న
రసవర్ధితంబైన ♦ రక్తజలము
సరసవచోనంద ♦ పరత సాబంతిని
భుక్తమధురసాత్త ♦ రక్తజలము
గీ. లలిత శౌర్యసద్గుణ శుద్ధ ♦ రక్తజలము
రమ్యతరశిశోదియపుత్రి ♦ రక్తజలము
గౌరవాసినిరాఁ దీసి ♦ కొన్కనెసఁగ
నైన, మేవాడు సుఖమున ♦ నలరఁగలదొ?

లీల—జనకా! నీవింతయధీరుఁడవని నేనెక్కడైననెఱుంగ! మాకువీరస్వర్గమునుఁ జేకూర్చుటకా నీవు దుఃఖించుట! అయ్యది రసపుత్రులకు సర్వదాకాంక్షణీయముగుఁగాదె? ఇంక మామరణమునకా? దేహికిమృత్యువు పుట్టుకనుండియే వెన్నంటియుండదా? నీవు శాశ్వతము జీవించియుందువా? నీవిట్లుభార్యాపుత్రికలకై దుఃఖించిన, ప్రజలకు దేశసేవాస్వార్థపరిత్యాగాదుల నేమిబోధింపఁగలవు? దేశమునెందఱు ప్రజలు తమసోదరుల, పుత్రుల, తండ్రుల దేశమాతపాదారవిందములకు నర్పింపలేదు. వారందఱు వగచిరే? వారికందఱికిని మార్గదర్శిగ నుండవలసిన మీరేయిట్లు పామరమునఁబడిన నితరులగతి యేమి!

ఉ॥ శూరులు, తొల్లి యోజనని ♦ శుద్ధపదాంబుజసేవకై స్వకీ
యోరుతనూపవిత్రశోణితస ♦ ముజ్జ్వలదాజ్యసమిద్ధతాగ్నిలో
దారల, పుత్రపుత్రికల ♦ ధారుణివేల్చి కృతార్థులైరి, యా
ధీర! స్వదేశమాత కుల ♦ దేవత బంధువుగాదె మాకిలన్

ప్రతా—ఆహా! నాకిదియేమి తుచ్ఛవ్యామోహము. లేరు. లేరు. నాకు దేశరక్షణ మహాకార్యమునకన్న బాంధవులు లేరు. భార్యాపుత్రికలు లేరు. పుత్రులు లేరు. అంతయు దేశమే అంతయు జన్మదేశమే!

మ. తనువున్ దేశము! తల్లి దేశము! ప్రమో ♦ దం బెల్ల నాదేశమే!
ధనమున్ దేశము! తండ్రి దేశము! యసు ♦ స్థానంబు మద్దేశమే!
దినమాత్రంబది దేశమే! సతియు మద్దేశంబె! దైవంబు, భా
గ్యన వానందము, సూనుల్ సుతయు సత్త్వంబింక, మద్దేశమే!

లీలా! నిక్కము వచించితివి. ఇంక స్వార్థమును త్యజించెద. ఓ మేవాడు మాతా! జన్మదేశమాతా! నీకొఱకై, నీపుత్రికల మానరక్షణమునకై నీనిక్కంపు క్షత్రియాంగనాభిమానవిజృంభితశౌర్యము కొఱకై, యుష్మదీయోద్ధార జగన్నుతసత్కీర్తి కొఱకై, నీనందనుఁడనై జనించిన ఋణమును బాపికొనుటకై, నాకుమారిని, సుకుమారిని, లీలాకుమారిని, మదీయార్ధాంగలక్ష్మిని, నస్మదీయ గృహభాగ్యలక్ష్మిని, నీచరణంబుల కెల్లవేళల వందనంబులిడు నాగృహిణీపుత్రికల బలియొసంగి నేనొక్కఁడమనువాఁడ. వారిమానధనరక్షణ జాగరూకుఁడనై, నీసేవ యొనర్చువాఁడ. జననీ! నాకు స్త్రీవధాపాతకము రాకుండ ననుగ్రహింపుము. అరిలోకసందహనాగ్నిహోత్రమనః కాఠిన్యమా! నీవిజృంభణము మాత్రము ప్రకటింపుము. లోకసంస్తవనీయ దారాపుత్రసద్బంధ్వభిమానమా! తొలఁగిపొమ్ము నానుండి! యుగాంతసర్వజీవసంహారణ మహామృత్యురసనాగ్రమా! నీశక్తి నాకరవాలమున నిలుపుము. వీరాధివీరమారణపటిష్ఠ మహాబలసాహసమా! నాయర్ధాంగిని, నాకుమారిని

బలిగాఁగొని, శాత్రవులవధించుటకుఁ గడంగుము. దైవమా! రాజపుత్రికలరక్తముఁగొని, సంతృప్తిఁజెంది, మేవాడుమాతపై నీకనైన నీన దయాంతరంగితావలోకనములఁ బఱపుము. శత్రుమేదోఖండఖండమండితమండలాగ్రహా! శత్రుశిరఃపుండరీకములహరించి, వారిపాదఖండముల భూమినలంకరించి, రాజపుత్రియశోఖండముల భరతఖండమున ప్రసరింపఁజేసి పఱగుమా. శుంభనిశుంభాసురదమనీ! శాంభవీ! భవానీ! రమ్మా! శాత్రవసంతతుల మహారక్తధారల కనులార తిలకింపుము. పరికింపుము నీనందనునిపత్రితాపము! (ఖడ్గమున సంహరింపఁబోవ ప్రవేశము శీఘ్రయానమున రాణాబాయి) "ఆ! ఆ! తాళుము, తాళుము, జయము" అనియొకవైపునుండి, మరియొకవైపునుండి మొగలుసైనికులు, దీన్ దీన్ శబ్దముల— (యవనిక పడును.)

[యవనికాపురోభాగమున- లీలా- విక్రమబాయి- రాణాబాయియు ప్రవేశము-]

విక్ర—సోదరీ! నీవెట్లింకువచ్చితివి? ఈ పురుషవేషమేల? మమ్మెట్లు రక్షింపఁగలవు?

రాణా—మహారాజ్ఞీ! భీమాసా తన యవసానకాలమున మహారాజొసంగిన, ధనముచే సైన్యములఁజేర్చుకొని, శాత్రవులననుసరించియే మహారాణాగారికీవార్తఁదెలిపి, ప్రోత్సాహమొసంగనిందువచ్చి మిమ్ములరక్షింపఁగల్గితి. అదే! అందుఁగాంచితే! రాజపుత్రయోధులు మొగలులపారఁదోలి విజృంభించుచున్నారు. వారుమీకు దారినివ్వఁగలరు. రండు. మిమ్ముల భిల్లసాయమున సురక్షితస్థానమునుఁజేర్చి మహారాణానుఁజేరెద.

విక్ర—సోదరీ-అందఱ-నా-

రాణా—దేవి! ఇదిప్రశ్నోత్తరములకు వేళకాదు. మనకు జయలక్ష్మిచేకూరుననుధైర్యముఁగలదు. రమ్ము. (నిష్క్రమణము)

---

# మేవాడుశౌర్యాగ్ని నాటకము.

## చతుర్థాంకము.

### తురీయరంగము.

(ప్రతాపుఁడు - నిశ్చేష్టితుఁడై యుండ - ప్రవేశమిరువైపులనుండి రహీం - బడోని - మానసింహ - బైరాంఖానులు)

రహీ — ఆ - ఆ - ఆగుము బడోనీ - ఆగుము. మౌనమునవధించుటకన్న నవమానముఁగలదే? పాదుషాయాజ్ఞమఱచితివా? ప్రతాపసింహరాణాజీ! ఇఁక నీవేమొనర్పఁగలవు? నీసైన్యమంతయు నశించె? దుర్గములన్నియు మాయధీనమయ్యె.

ప్రతా — యవనసేనాని! శూరవర్యునకు జయమందైన నపజయమందైన నవశ్యానుసరణీయధర్మ మొక్కటియేకదా! దానినే యనుసరించెద. వివాదమేల?

రహీ — రాణా! నీవు వీరుఁడవే యగుదువు; ఒప్పుకొందుము. ప్రతాపశాలివే యగుదువు; అంగీకరింతు. కదనకాండశీకతకలయందైన నెఱుంగవు. సమ్మతింతు! అయిన యుక్తాయుక్తముల నారయక పోరిన నేమి ఫలము? పాదుషాకు లోఁబడితినను వాక్య ముచ్చరించిన చాలును, నీకెట్టియవమానమును కలుగకుండునట్లును, రాజ్యమును, చేకూర్చెద.

ప్రతా — అయ్యో! మేవాడు పరిభవదుఃఖమున తమంతనె వీడనున్న ప్రాణాలకై, దైవబ్రాహ్మణులకుఁదప్ప తలవంచియెఱుంగనియీ ప్రతాపుఁడు శాత్రవులకు తలవంచి మెలంగఁగలఁడా?

మాన— ఇట్టిమౌర్ఖ్యమున నేమిసాధించినట్లయ్యె నామమాత్రావశిష్టమైన మేవాడుస్వాతంత్ర్యమును నీవు కాదు మీవంశీయులందఱును వచ్చి నను రక్షింపఁగలరా!

చ॥ ఘనతరవీతిహోత్రుఁడగు ♦ గాక ఘృతేంధన యోగహీనుఁడై
యెనయునె? జ్వాలలన్ వెస దహించునె? ♦ వృథచతురంబుఁ గార్యకా
లనయగతిన్ రిపున్ గనక ♦ రాష్ట్రతిఁబోర్వ హితంబు, రాచపా
డిసిఁగనవీతసైన్యుఁడయి ♦ డీకొనఁబోలునె సార్వభౌమునిన్?

ప్రతా— ఆ మేవాడుస్వాతంత్ర్యోద్ధారమే దైవమునకు నసమ్మతము కాదేని, జగతినిర్వాణమై పోవుచున్న క్షాత్రశౌర్యాగ్ని నొక్కపరి ప్రజ్వరిల్లఁజేసి యందు నిర్వాణమై పోవుచున్న మేవాడుస్వాతంత్ర్యలక్ష్మిని నాచేచేతనైచి నేనును నిర్దగ్ధుఁడనయ్యెద. క్షాత్రవాటవిదహింప నీప్రతాప వీతిహోత్రుఁడొక్కఁడు చాలఁడా?

రహీం— కానిమ్ము, నీనిష్ఫలమౌర్ఖ్యమునకుఁ దగిన ప్రతిఫలమనుభవింపఁగలవు. [ప్రవేశము రాణా బాలపురుషవేషమున]

రాణా— క్షాత్రవవర్గనిందనీయులారా! ఒక్కయోధుని ననేకయోధజన సత్వప్రాణముల నొక్కరీతిఁ బోరాడి గ్రసించి విశ్రాంతుఁడైన వీరుని, మీరందఱేక కాలమున మార్కొందురే! మీకు సిగ్గులేకున్నను, ప్రతాపలక్ష్మిచిహ్నితములైన మీనిశితకరవాలభల్లములకేని లజ్జవొడమదా?

మాన— ఓరీ! డాంబిక ప్రతాపప్రకాశకా! ఇది నీతప్పిదము కాదు. ప్రతాపుఁడనలేనిచనువిచ్చి నీకిడిన యొంగిలికూడు తప్పిదము. నీయట్టివాని కాయఖండక్షత్రియలోకలక్ష్మీభూతయుద్ధధర్మంబులనునోరారవచించుభాగ్య మబ్బుట! యెందో గిరికందరములనీడ పగలంతయు వసించి, దరిద్వారములదాగి చోరులభాతి వెనుకనుండి పరసైన్యములపైఁబడి బందిపోటొనర్చువారికా యుద్ధధర్మవాద పరిపాటి?

ప్రతాప — ఔరా! మానసింహా! నీవు మానసింహుఁడవా? అవమానసింహుఁడ వగుదువుఁగాక! నీకు క్షత్రియకులాభిమానమే యున్న శత్రువులకు నిజసోదరీపుత్త్రికల నొసంగి యా మొంగిలికూటమునకు సుముచు జాతినీతిరీతుల మాని పశురీతి చరింతువే? గిరికందరముల నైననేమి? గగనకందరముల నైననేమి? సైన్యము లున్ననేమి? చన్న నేమి? నిజవిక్రమైకసహాయులమై, యాత్మీయధైర్యసావలంబులమై, స్వకీయకరవాలాగ్రమాత్రశరణ్యులమై, కేసరీ కదంబకముల మాడ్కి, నిజశరు ప్రరోమాంకురములపై సవారిగ వ్రాలుచున్న వైరి మక్షికముల విదల్చుచును, సకలభువనప్రశంసితజయలక్ష్మీపరిణయమున కెదురుచూచుచున్న మమ్ము గాంచి సారమేయము లెన్నిరీతుల వదరిన నేమి? జగమెఱుంగదా మా విక్రమకళాపాండితి? అంతయేల మీ బావ యాయక్బరుపాదుషా యెఱుంగఁడా? నీమానసమెఱుంగదా? మా ప్రతాప ప్రభావవైఖరి!

రాణా — నీవు రాజపురందిపని యెంచియు, శాత్రవపాదాక్రాంతి నాశించినను, రజపుత్రసహజ పరాక్రమ తేజోశకలికలంకను నిర్నామమై పోవలేదని యెంచియు, సముచితగౌరవము వల్పినట్లెంత మా దుష్కృతము హెచ్చె, స్వపరాక్రమమునకు మానునోటికసిదీగయుచ్ఛావచములాడ నమకట్టితివా? మేవాడుదేశవిరాజితరాజలోకమంతయు శిశోదియావంశ్యసార్వభౌములనిమొంగిలిని పరమపవిత్రమని భావించి, "యుహామహిమ"చే నేను నేనని మోహించి, మెప్పుపడసి భుజించుచున్నది. నీవన్ననో శాత్రవుల మొంగిలికై దేహాభిమానముల నేని విక్రయించుచున్నాఁడవు.

మాన — చాలుఁ నీక నోరుమూయుము (=యానముతో మానసింహాదులతో ప్రతాపుఁడు యుద్ధమొనర్చును. బైరాముఖాను ప్రతాపుని వెనుకనుండి చంపనెత్నింప దుర్గాదాసు ప్రవేశించి ఖడ్గమొగురఁగొట్టును. భిల్లసైన్యములు వచ్చును. ఖడ్గపాతములచే ప్రతాపదుర్గాదాసులుమూర్ఛిల్లుదురు. లోపల జయభానిశబ్దములు, మానసింహాదులు వెను

కకుపోవుదురు. రాణాబాయి వ్రాసి వెంబడించును. దుర్గాబాయి లేచి)

దుర్గా—ప్రభూ! మహాప్రభూ! అయ్యో! మాస్వామికిట్టిస్థితిఁ గలుటకే నెట్లోర్చితికొంపు! మోహాధాగ్రేసరుఁడై, యసమానధైర్యలక్ష్మీ ప్రణయపాత్రుఁడై, భారతపుత్రులలో నల్లగారాబుపుత్రుఁడై, ఖడ్గము చేతఁగొని యనికినిలచినవారికెల్ల నాచార్యుఁడై, నేనుమన్నించుదే వుఁడగు నీప్రతాపచంద్రుఁడు, సమస్తసకలలోక ప్రతాపుఁడు, నేడిట్లు రణక్షోణి యుద్ధావనిసాక్షి కైన లేనియటులఁ గొంపోయియుఁడై పడియుండు దుస్థితి కనులారఁజూచి యోర్వఁజాలి నవచ్చెఁగా? మధ్యందినమార్తాండ మండలము భూపతితంబైనరీతి, కాలాగ్ని జ్వాలాగోళము దుష్టకాలవి ధ్వంసమునకై పుడమిపొంతిమోమునకు కైసేయుసింధూరంపుబొట్టనఁ గనవతరించినపగిది, సకలజగద్ధర్మ శాసనమహాతేజోనిధాన మిందు ప్రకాశించుచున్న దనుమాడ్కి, యిస్సహా మహాపుఁడు, యిమ్మాత్రదేశో ద్ధారక మహామహుఁడు, భూమిపొలిచి, కనులు మోడ్చిపడియుండు దుస్థితిఁ గాంచుటకే నెంతతొలిఁబుట్టువున దురంతరదుష్కర్మసమూహంబా ర్జించితినో తెలియకున్నది. అక్కటకటా! యేకశాండో యుంచుక కెంపెనసిన శాత్రవహృదయధైర్యరసపూరంబంతయు నొక్కపెట్టున నిమిశిపోవుచుండెనో? యే నుగామరలర్థి చాతకపోత జీమూతప్రా యంబులై, దీనజనావనప్రశస్తశృంగారసవిధానములై, యెల్లవేళలవిల సిల్లియుండెనో? యే నేత్రరాజీవంబులు మేవాడురాజ్యలక్ష్మీ ప్రణయ పాత్రములై, నిఖిలక్షాత్రసార ముద్రితమణి హేమసన్నిధానంబులై, పొలుపారుచుండెనో? నట్టికన్నులిప్పుడు శోభాహీనములై, సంజకెంజా యురంజిల్లు రవిపొలిక శోణితదుగ్ధంబులైయున్నవికదా! ఔరా! విధిబల ము! దుర్దమపరిపంథి గర్వాంధరకంధరంబులకే బాహువు చటులజంఝా మారుతప్రాయమై చెలువారెనో? సకలభువనాశన, దుష్టశిక్షణ, శిష్ట రక్షణ గోద్విజపాలనాది పుణ్యతరకార్యధౌరేయంబై రాజిలుచుండెనో?

అట్టి దక్షిణభుజాదండము నఖండిత మూర్ఛాపతితమైన శిరంబున కిప్పుడుకూడ సాయ మొనర్చుచున్నదిఁగదా? వీరాధివీర సకలక్షోణిధవ శిరఃప్రణామసమాస్వాదకనళితమై, విజయలక్ష్మిమణి తలబ్రాలుఁబోయు నెంతయు వికస్వరభాస్వరమై, సకలమేవాడుభూభరణ ధురీణకనకమణి మయమకుటవిద్యోతమానమగు నీప్రతాపసింహరాణా యుత్తమాంగము, రుధిరధారా సారప్రవాహమునతడిసి, కన్నతల్లియగు భరతభూమతల్లికి విన్నవించుచున్నదోయన, యుద్ధధారుణి నిష్పరిధానమై, నిరస్త్రోపాధానమై, నిర్గతమకుటమై పడియున్నదికదా ? అకటా ! నేఁడెట్టిదుర్దినము! నేఁడు మేవాడుస్వాతంత్ర్యమతల్లియే నిర్నామమయ్యె! ఆదిచ్చుకంటిదొరనైన చెచ్చెరకను మూయింపఁజాలు ప్రతాపునికా యిది దైవమిచ్చు ప్రతిఫలము! తనమాతృదేశమునకై, తద్ధర్మరక్షణమునకై, కట్టా! రాజభోగంబులనాశింపక, నిజతనయాతనయ పత్నీప్రేమబంధంబులనేని యించుకంతయు సరకుఁగొనక, అక్బరుచక్రవర్తి పరమసాహార్దభావమున తనకొసంగనున్న స్వాతంత్ర్యవిరహితానంత, వైభవసుఖ సముదాయముల తృణగణంబు భాతి లెక్కింపక, నటవిఁజేరి, నాటవికులఁగలసి, అన్నాహార సుఖనిద్రాదులకే దత్తాంజలియొసఁగి, నిజగాత్రసంచరత్ప్రాణశ్రేయలతానమాంకోశవ సముదంచితపాట్యమును మనసారఁగైకొని, నాత్మీయదేశోద్ధారణ మహావ్రతదీక్షమానక, తనశోణితధారవెదజల్లి, పుత్రికాపత్నీ రక్తబిందువులన వారిగ భూమికభిషేకమొనర్చి, స్వకీయధైర్యైకసహాయుఁడై, శాత్రవసేనా మహార్ణవంబులు తనుముంపఁజేనుదెంచుచుండ నిజబాహుదండసేతువుచే నిలిపినప్రతాపశేఖరునకా? యమేయ ధైర్యమేరునగమునకా ? యస్ఖలితదేశరక్షణవ్రతునకా ? యిట్టి దుస్థితి ! యిట్టి దుర్దశ ! యిట్టి కనరాని, వినరాని ఘోరాపద ! దైవమా ! నీవెందున్నాఁడవు ? లేవు ! లేవు ! నీవు లేవు ! నీకు గుణపక్షపాతత లేదు ! నీవెప్పుడును, ద్రోహులకు, పాపకర్ములకే

సాయమునర్తువు ! అక్కటకటా ! పిపీలికలుమా స్వామినిఁ జేరుచున్నవి. ఓపిపీలికలారా ! మాస్వామి శోణితమును గ్రోలనేగుచున్నారా! మీరు మేవాడు ఫలోదకముల వర్ధిల్లరా! మీస్వామి, మీప్రభువిట్టి దుస్థితియందుండ నతని బాధింతురా ? అయ్యో ! లోకమంతయు కృతఘ్నతామయమైయుండ నీక్షుద్రపిపీలికలననేల ? రక్తము నర్ధముపంచుగొని జనించిన సాగర్జియే భ్రాతృద్రోహమొనరింపఁ బాల్పడిన నింక పరినవలయు? ఆహా! కాదు. కాదు. క్షుద్రజంతుక్రిమికీటకాదుల కింకను నసూయాదేవతాకరుణాకటాక్షముకలుగ లేదు. ఈపిపీలికలుమాస్వామి శోణితమాంసముల నింకను నన్ని ధైర్యవిక్రమరేణువులున్నవో యని పరీక్షించుటకేఁగుచున్నవి కాఁబోలు! ఓమాంసశోణితగ్రసనసమాపతత్కాకగృధ్రములారా! మాప్రభునంటకుఁడు. మాస్వామినిసమీపింపకుఁడు. మాస్వామిని, మాదేశవంశస్వామిని తాకకుఁడు. మిమ్ముల వేడికొందు! అయ్యో ! నీచుల కెక్కడిదయ ? హీనుల కెక్కడికరుణ ! ఓదుష్టవిహంగములారా ! నాప్రార్థన నాలకింపరా ! నాప్రభువును దప్ప నితరుల ప్రార్థించి యెఱుంగని యీదుర్గాదాసు ప్రార్థన నిరాకరించితిరా ? మూఢుఁడ మిమ్ముల నేమిఁ జేసెదనో? (లేవఁబోయి) అయ్యో! లేవఁజాల ! కదలఁజాల ! ఓనిస్సారపిశాచీ ! నీవెక్కడ నాకు దాపురమైతివి ? దైవమా ? యిది యెట్టివిషమపరీక్ష ! అయ్యో ! నాయాయుఃకాలమునంతయుఁ గొనియైన నాస్వామినిఁ జేరుశక్తి నాకొసంగువారు లేరే? ఓకిరాతకగృధ్రములారా : నానాత్మతమాంసశోణితమే మీరు గ్రసింపనెంచిన, మాంసభక్షణమే మీకు ప్రియమైన, నిదేమదీయోరుతలవిరాజమానమృదులతరమాంసము నొసంగెద. మాస్వామిని విడచిచనుఁడు, అస్మద్దేశప్రభుచూడామణికై, మామకమాంసఖండములొక్కటియేల, మదీయప్రాణపంచకంబు నేనిసమర్పించెద. (అని తొడకోసి మాంసఖండముల విసరును)

మేవాడు రాజ్యపురంధ్రీమణీ! రాజపుత్రస్థానసౌధవిలాస మానశౌర్యధైర్యసాహసరామామణీ! నీజీవితేశుని, నీవు మన్నించు ప్రోడను, నిజఖడ్గసంచలనమాత్రప్రదత్తశాత్రవకుటుంబినీ సంతాపుని, స్వీయధర్మశాసనధురీణ బాహుదండదర్శనమాత్ర కాందిశీకిత ప్రతిపక్షగంధసింధుర కలాపుని, మాప్రతాపుని, మీరేల యిట్లుపేక్షించియున్నారు? ధర్మదేవతా! నీవు నిక్కముగా వాడనాథవైతివి. నిరర్గళనిస్సరత్సకలావయవసంగీత పీడనలారా! మీరాలోకించుక నీవు తాళుఁడు. నన్ను మాస్వామి చరణపరిసరముఁ జేరనిండు. అకటా! అనదనై, చావనున్న వానివాక్యములయందెవ్వరికి యాదరముఁగలుగును? కానిండు. మిమ్ముల నతిక్రమించియైన నీదుర్గాదాను స్వామిని చేరఁగలఁడు. ప్రభుభక్తికున్న శక్తి మీకు కలదేమో చూచెద. (లిన్నగ ప్రాకుచు ప్రతాపునిఁ జేరును) ఇఁక మిమ్ముసరకుఁ గొనను. సకలనాడీకదంబవిఖండన సంచరిష్యమాణశోణితబిందు సందోహములారా! మీరే సార్వభౌమ ప్రదత్త రథరసాన్నముల గ్రోలియింతవఱకు వృద్ధినందితిరో నట్టివాని నుదాసీనింతురే? అఖిలబలసార తేజస్సార, సాహససారీభూతమాంసఖండవారములారా! మీరే ప్రభువుచే విజృంభించి, శాత్రవుల కసిఁదీరచక్కాడితిరో, యట్టి మహామహునికై యేలనాత్మత్యాగమొనర్పకున్నారు? సముంచితామూల్యాంబర ప్రదాన, గౌరవసన్మానప్రదాన, అభయహస్తచాలన ప్రేమవాత్సల్య సకలాధిపత్యప్రదానములచే మిమ్ము గౌరవించి, సన్మానించి, పెంచి యింతవానినిఁ జేసిన మీప్రేమంపుఁజేని సించుకసేపైన సూర్యాతపము నుండి యాచ్ఛాదనంబొనర్పక నేల మసలుచున్నారు! హా దుష్టజన విజృంభితపాపచయచిత్తమా! తదీయాభినవచ్ఛాయాగ్రహితసకల ప్రపంచమా! యింకెన్నాళ్లు విజృంభించెదవు? హా-హిందుమహామ్మదీయైకమత్యప్రేమరస సుధామంజరీ! యేల యింకను నీయావిర్భావ

మూర్తి భావంబులచే సకలైకమత్య సకల జనాదగ సకల జనప్రీతి నొసంగకున్నావు ? హా-దురంతము-యీ ఘోరభీషణ భీభత్సరంగావలోకనము దురధిగమసంతాపమూలము-చూడఁజాల-చూడఁజాల-ప్రతాపా!-ప్రభూ!-మాటాడుమా ! దుర్గాయుని యొక్క-మాటాడుమా ? నీ దేశమాతననాథఁ జేసితివే! నీసంపూర్ణస్వాతంత్ర్యాభిలాషను దూరీకరించితివా ? ప్రభూ ! దేవా ! అయ్యో-తాళఁజాల-దేవా-దే-శ-ము- ప్ర-భూ. (మూర్ఛిల్లును)

---

## చతుర్థాంకము—పంచమరంగము.

[యుద్ధభూమి ప్రవేశము రాణాబాయి]

రాణా—జననీ ! దేశమాతా ! యిట్టి శూరశేఖరుల, నిట్టి మహాత్ముల నాత్మగర్భంబునఁ దాల్చిన నీ వేధన్యవు !

సీ. ముజ్జగంబులు పైన ♦ మొనయ కేలాడక
నిలుచువాఁడు తనంత ♦ పొలుచువాఁడు
కష్టాబ్ధితనుముంప ♦ కలన వైరులముంచి
కలఁచువాఁడు జయాబ్ధిఁ ♦ బిలచువాఁడు
నీకునై యరికంఠ ♦ నీరజహార మ
ర్పించువాఁడు యశంబు ♦ నించువాఁడు
అరిరక్తజలముల ♦ నభిషిక్తఁగా నిన్నుఁ
జేయువాఁడు ముదంబు ♦ డాయువాఁడు

గీ. కీర్తి జయవైభవశుభమా ♦ క్తికములఁ గొని
నిన్ను మేవాడు పీఠిని ♦ నిలుపవచ్చు
లెమ్ము ! యీ ప్రతాపుని నెదు ♦ రొక్కమ్ము వేగ
భవ్య మేవాడు స్వాతంత్ర్య ♦ భాగ్యమాత.

ప్రతా— లేచుచు ఏరీ! శాత్రవులు! సేనానీ! శాత్రవసైన్యము లెందేగె? ఈప్రతాపసింహుఁడు మడసెననియు, కృతకృత్యుల మైతి మనియు వెడలిపోయిరా!

రాణా— ప్రభూ! మహాప్రభూ! అపరవీరలక్ష్మ్యవతార స్వరూపులగు మీయెదుట శాత్రవులు నిలువఁగలరా?

ప్రతా— ఏమి! ఏమి! పరాజితులైరా! యిన్నిదినముల కీప్రతాపునికి విజయమా!

రాణా— దేవా! పరాజితులైరి! పలాయితులైరి. అదే యందు పరికింపుఁడు శాత్రవ శవపరంపరల?

ప్రతా— భవానీ! అంబా! నీయాజ్ఞచే, దేశజననికై, నాప్రియతనయాతను రక్తమును భూమికభిషేకమొనర్ప సాహసించితి. ఉపవాసినై, పర్ణభక్షకుఁడనై, శరీరమును ధరించిన నాకిన్నిదినములకు "జయ"మను రెండక్షరముల వీనులార విను భాగ్యమును చేకూర్చితివా? దేశమాతా!

శా॥ నాకై చింతిల! నాయరాజ్యకృతికై ♦ నా శిల్లి శోకింప, న
స్తోకారాతివి భిన్న దేహగతికై ♦ దుఃఖింప! భార్యాసుతా
ద్యాకంతక్షతికై కలంగ! జననీ! ♦ త్వద్దైన్యసంప్రాప్తికై
నీకై, నీవిపదాప్తికై వగచెదన్ ♦ నిక్కంబు మేవాడ్సతీ!

దుర్గా! దుర్గా! (పడియున్న దుర్గాదాసునుఁ జూచి) దుర్గా! యేల యిట్లు పడియున్నాఁడవు? యిదియేమి? దేహమంతయు రక్తమయమై యున్నది? దేశభక్తి స్వార్థపరిత్యాగ తేజో రేణువులచే పవిత్రితమైన నీరక్తమును స్పృశించునంతటి శక్తి శాత్రవకరవాలముల కున్నదని నే విశ్వసింపజాల! ఆహా! తెలసె! నేను మూర్ఛిల్లినతరి నీశరీరమర్పించి, ననురక్షించితివా? ప్రభుభక్తిపరాయణా! స్వార్థపరిత్యాగభూషణా!

నీ వేధన్యుఁడవు. నీజన్మమే ధన్యము. స్వార్థపరిత్యాగ మొనర్చితినని గర్విం చునాకు, స్వార్థపరిత్యాగ మిట్టిదని బోధించితివి. నాకాచార్యుఁడ వైతివి. నీ కేమి ప్రత్యుపకార మొనర్తు ? సేనానీ ! చూడుము. దుర్గాదాసిట్లు న్న వాఁడో ?

రాణా—(నీరుచల్లి) దుర్గాదాస్-దుర్గాదాస్.

దుర్గా—(విస్మృతుఁడై) ప్రభూ ! ప్రభూ ! ఎట్లున్నాఁడవు!

ప్రతా—దుర్గా ! దుర్గా! జీవించియున్నాఁడను! లెమ్ము! నీయద్వితీయ సాహసప్రభుభక్తులకు మెచ్చి దైవము నాకు ప్రాణదాన మొసంగియు న్నాఁడు. దుర్గా! మరియొక సంతోషవార్త! మనకు సంపూర్ణజయము కలిగినది.

దుర్గా—ఏమి ! జయమా ! మనకు జయమా ?

రాణా—నిక్కము. ముమ్మాటికిని నిక్కము.

దుర్గా—నాయాయాసమంతయుఁ దీరె ? ఈయుత్సాహమే నాకు ప్రాణదాన మొసంగదా !

రాణా—తాళుఁడు-తాళుఁడం డెవ్వరో వచ్చుచున్నారు.

(ప్రవేశము-శీఘ్రయానమున సాగర్జీ-అతని వెంబడించి-సోమసిం హుఁడు-సాగర్జీ ప్రతాపాదులఁగాంచి నిశ్చేష్టుఁడై నిలచును)

రాణా—ద్రోహీ రమ్ము! యింకెందు పోఁగలవు? నీద్రోహము లకెల్ల ప్రతిఫలమందఁజేసెద!

ప్రతా—తాళుము- తాళుము- తొందరచే నకార్య మొనర్ప కుము, సోమసింహా! వృత్తాంత మేమి?

సోమ—దేవా ! యుద్ధమున శాత్రవులఁ దరుముచు నీయువ రాణానుఁ గాంచి యతని వెన్నంటి యిందువచ్చితిని.

ప్రతా—సోమసింహా ! నీకార్యమునకు మిక్కిలి సంతసించితి.

నీప్రభువు మంచిస్థితియందున్ననే మెచ్చుచుండెనో? యిపు డూరక ప్రశంసావాక్యముల నిన్నానందింపఁ జేయుచున్నాఁడు.

సోమ—ప్రభూ! మావంశమే మీచే జీవించినది-జీవింపనున్నది. సమస్త సిరిసంపదలకన్న మీ ప్రశంసావాక్యములే నాకెక్కుడు నాదరణీయములు.

దుర్గా—వీరెవ్వరు? సాగర్జీ మహారాణాగారా! ఉదయపుర సింహాసనాసీనులా! దేశద్రోహపుణ్యకార్యమున, పాదుషా యనుగ్రహముచే సంప్రాప్తమైన మేవాడు రాజ్యరమానాథులు కదా వీరు? ప్రభువతంసమా! యేల యిట్లు నిరాయుధులై, నిష్పరివారులై యిందు వచ్చితిరి. మీసదయాంతరంగతమమునఁబోలు నాటవికులకుదర్శన మొసంగి యనుగ్రహింపవచ్చుదెంచితిరా? ఎంతటికరుణ?

శా. ఏరీ! నీప్రజ లేరి? మిత్త్రులు ధరా ♦ ధీశుల్ భటోత్తంసులిం
దేరీ? బంధులు, జన్మదేశసహజుల్ ♦ వీక్షింపనున్నారె? నీ
క్రూరాత్మోద్ధిత పాపవహ్నిఁబడి యా ♦ క్రోశించుచున్ చావరే?
యీరాజస్థలదేశమాతకనియున్ ♦ హృత్తాపమొప్పారదే?

ప్రతా—దుర్గా! శాంతము, వాఁడెట్టివాఁడైనను నిట్టివేళ నిందింపనగునా? సాగరా! ఏదీ ననుచక్కఁగ బరికింపుము. నీకు రాజ్యకాంక్షయేయున్న నేల నాతో వచింపవైతివి? నేనుసంతసమున, నామనసార నీకు రాజ్యమొసంగి దేశసేవచేయుచుంటినే? దేశమాతకిట్టి దుస్థితి చేకూరకుండుటకై యొక్కరాజ్యమేల, నాతనుప్రాణములనేని సంతసమున నీకొసంగుచుంటనే? నీవునన్ను రాజ్యభ్రష్టునిఁ జేసినందుకించుకంతయు చింతింపను. నాకుమారిని శాత్రవులకర్పించి, నీచేచేతయా మెయిమానభంగమాపాదింపనెంచినందుకేని యావంతయు దుఃఖింపను. నాప్రాణములకెక్కువెట్టి నన్నుచంపఁ బ్రయత్నించినందు కించుకేని రోషింపను. నాకన్నకుమారుని సంహరింపఁ బ్రయత్నించినందుకేని నేనేమియుదురపిల్లను, మేవాడు

రాజ్యమాతకష్టములకేని సైరింతు. కాని, నీయట్టివాఁడు, నీయట్టి దేశద్రో
హి, శాత్రవపాదాక్రాంతి నాశించిననీయట్టిహీనుఁడు మావంశమున
జనించినందున శిశోదియావంశమునకుఁ గలిగిన యపకీర్తికై వగచెద.
నీకుసోదరుఁ డనుపించుకొనవలసిన నాదౌర్భాగ్యమునకై వగచెద!

మ॥ అరివారంబునకుఁ బదానతుఁడవై ♦ యర్పించినఁ గోట సో
దరుపుత్రిన్ యవనాళిఁ జేర్చిన సుతున్ ♦ దర్పోద్ధతిన్ జంపినన్
నరకోద్దామకులకుఁ రాఖిలజనో ♦ న్నాశంబు చేకూర్చినన్
పొరిదుఃఖంపను; నీకునగ్రజుఁడనై ♦ పుట్టొందదుఃఖం బెసన్!

సీ॥ వలచితిసిరిసంచు ♦ వలికిన రాసిరి
శిరమునవ్రాలునం ♦ చెఱుఁగవైతి
నీకునైసిరినేల? ♦ నిత్తునేసనువుల
నసునాదు మనమాను ♦ నరయనైతి
జననభూస్వాతంత్ర్య ♦ మునకాత్మసుతదార
లనునైననొసఁగున ♦ న్గనకపోతి
హైన్యమే, నైచ్యమే ♦ దైన్యకులతఁయు
మిాసేతయంచని ♦ యెన్నవైతి

గీ॥ అయినకానిమ్ము; ద్రోహసం ♦ ప్రాప్తరాజ్య
విభవమైననుస్వాతంత్ర్య ♦ విభనుఁగూర్చి
యార్యకాపట్యమును మాని ♦ యేలవన్న
పాడముద్రోహంబు లేకనైన ♦ విడుగదన్న!

ఒకమాటయైన నిట్లని నాతోనాడితివా? నీజన్మదేశమాతలకష్టముల
నాలోచించితివా? కానిమ్ము; నీవానర్చిన ఘోరపాపకార్యములకేని
ఫలితఫలమందితివా! పొమ్ము. పాపకార్యాచరణలబ్ధమేవాడు రాజ్యశ్రీ
నైన చక్కఁగ బాలింపుము. అమ్మాతకు పారతంత్ర్యనాశనదుఃఖము
నకుఁ దోడు, సర్వప్రజాబాంధవ, హింసాదుష్కార్యావలోకన దుఃఖ
మును సైతముఁ జేకూర్చుకుము. నీనుండియైన దేశజనని కింతసౌఖ్యముఁ
గలిగిన నాకదియే సంతసము. సోమసింహా! నీవితనిని సగౌరవముగ

సురక్షితస్థానమునుఁ జేర్పవలయు. ఇతఁడు కోరిన యాశ్వము నొసంగుము. సాగరా ! యిదే కరవాలమునుఁ గైకొనుము. మరల ససహాయుఁడవై యుద్ధమునకుఁ గడంగకుము. పొమ్ము. నీకు దైవము శుభ మొసంగుఁగాక.

(సాగర్జీ-తలవంచుకొని-సోమసింహుని వెంటనిష్క్రమించును)

సేనానీ ! అయిన మనకు జయమెట్లుఁ గలిగె — సైన్యము లెందుండి వచ్చెను.

రాణా — దేవా! తమ సచివచంద్రుఁడగు భామాసా తనయవసానకాలమున తనస్వత్వమునంతయు మీకొసంగిచనియె. దానిచే నిరువదివేల సైనికుల నొకసంవత్సరము పోషింపవచ్చును. ఆసైనికులఁగొని విజయోన్మత్తులగు శత్రువుల వెనుకనుండిఁ దాకితి. మనధాటికోర్వఁజాలక శత్రువులు పలాయనోన్ముఖులైరి. తమ కీవార్త నెఱింగింప నే నిందువచ్చితి; దేవా ! ఈయుద్ధమున శత్రువులు సమీపదుర్గాశేష సైన్యముల సైతముఁ దెచ్చియుండిరి. కాన, గోగుండాదిదుర్గములిప్పుడు రక్షకభటహీనములై యున్నవి. మనసైనికులఁగొని నేనుగోగుండదుర్గముపై వెడల ముదల యొసంగుఁడు.

ప్రతా — సేనానీ! మన సైనికు లెందరున్నారు?

రాణా — దేవా ! ఖిల్లరసపుత్రసైన్యములు రెండును కలసిననే బదివేలు సంఖ్యయగును.

ప్రతా — దుర్గా ! నీవిందర్ధసైన్యము గైకొని రత్నస్తంభదుర్గముపై వెడలుము. జయలక్ష్మిని సాధించి నన్ను కొమల్మేరు దుర్గప్రాంతమునఁ జేరుము. సేనానీ ! నీవును నిరువదివేల సైనికుల గొని గోగుండదుర్గమును ముట్టడింపుము. మరల సాయము వలయునేని నా చెంతకు బంపుఁడు.

రాణా — }
దుర్గా — } భాగ్యము-(అని మోకరింతురు)

ప్రతా — ధర్మమునకు జయసిద్ధి కలుఁగుఁగాక. క్షాత్రతేజ మెందును నప్రతిహతమై వెలుఁగుఁగాక — (యవనిక పడును)

# మేవాడుశౌర్యాగ్ని నాటకము



## పంచమాంకము—ప్రథమరంగము.

### ప్రవేశము—సాగర్జి పశ్చాత్తాపతప్తుఁడై.

సాగ- సీ. పతోత్కృథప్రేయసీ ♦ మహితానురాగమా
యిది ? రక్తపూరమె ♦ ల్లెడలపారె !
నాయనూయాసతీ ♦ నవకుసుమంబులా?
సఖబంధుసుత శిర ♦ స్తతులుదొరలె !
వాద్రోహివిమలతా ♦ నందపల్లవములా?
మాంసనాడీఖండ ♦ భరముఁదోఁచె!
నాపాపమ్మృదుగాన ♦ నాదమా? "హా నాథ"
యను ప్రలాపంబులె ♦ ల్లెందుఁదనరె!

గీ॥ నాదుశౌర్యాగ్ని చితియాయె ♦ మాదరించి
యిదియె మేవాడుప్రజల ద ♦ హింపవెల్గె :
మాతృభూమి, శవమయభీ ♦ కరంబునయ్యె!
యిదియె నాబంధుద్రోహ స ♦ మిద్ధఫలము !

అక్కటకటా ! యింతటికి కారణము నేనుకదా ! సర్వదుఃఖసర్వపాపములకు నేనుకదా కారణము ! అయ్యో ! యిదియేఁకదా రాజపుత్రస్థానము ! ఇప్పుడిది రాజపుత్రస్థానముఁగాక, నానాశిరోబాహుపాద విఖండన శవస్థానమైయున్నదిగదా! అభినవక్షాత్రతేజోరేణువులచే దిగంతములగెల్చి, దిశాంతకాంత పీరశ్రీకీర్తి కాంతా

భిరామమై, యనంతసాహసనమూసాదిత, సంపత్సమున్నతమై, నిరంత నిరశౌర్యావ విహారభూమిచంద్రివంశభూప లపరిపాలితమైన మేవాడు, రక్తనదీనదములచె, మాంసకబళములచే నిబిడీకృతమై యున్నది. ఇంతటికి కారణము నేనుకదా? అకటా! ఏకలింగస్వామి కృపాపాత్రమైన యీయారావళీ పర్వతప్రాకారమునకును, నాకున్న నిష్కారుణయే, నాకున్న విద్వేషక్రోధములే యుదయించెగా? లోకోత్తరమణివితానకనకవిరాజితమైన కోశాగారమంతయు అనేకజంబుకనివాసస్థానమయ్యె. ఇంతటికి కారణము నేనుకదా! ఎందుఁజూచిన పతితపావనపుణ్యనదీతీర్థయు తారావళీపర్వతనిర్ఝరసీకరములచే నెంతయు మోక్షస్థానమనలరారు నీపుణ్యభూమి ప్రజారక్తవాహినులనవారిగ ప్రవహింపఁ జేసితి. చందనమృగమదకర్పూరకుంకుమ కేసరాదిపరిమళశోభితమైన మేవాడున నిపుడుదుర్గంధబంధుర దుర్వాయుసంచారత కల్పించితి. అనారతశారద కుచకుంభసంగీత సాహిత్యపరిశోభితవనితాజన సంతతి యంతయు "హా! పుత్రి! హా! జీవితేశ్వర! హా! జనక!" యనెడి ప్రలాపములఁజెవిహ్వాలరై, దేశవిద్రోహియైననానామమునందలి పాపాత్మురము లనేజపించుచున్నది. సమస్త ప్రేతభూతవితానములాకసమున బారులుఁగట్టిఁ దిరుగుచున్నవి. ఇంతటికి కారణము నేనుకదా! అయ్యో! వీరశయ్యనలంకరించిన నిజభర్తృజనమునకై వాపోవుచు, చితిపేర్చి సహగమనమొనర్చుఁ సాధ్వీమణుల యగ్నికుండతేజములే యీమేవాడునకంతయు దీపములై ప్రకాశించుచున్నవిఁగదా? అవాధవనితాదురంతప్రలాపములే మేవాడునందు వీణావేణుమృదంగాది వాదిత్రములై చెన్నారుచున్నవిఁగదా! శుకపికమరాళమయూరాది సత్పక్షిజాలము సైతము కన్నీరుమున్నీరై వగచుచు, కలస్వానమధురరుతంబు లొనర్పక, వికారచేష్టాశబ్దంబులమదీయక్రూరచారిత్రము నెంతయుజగముల చాటుచున్నది. అరావళీపర్వతప్రతిగుహాపృథుపాషాణగిరికందరములున్ను, తమదుస్థితి,

తనదుర్వినాశము, నానుండికలిగినదని క్షణక్షణమును వేనోళ్ళ మదీయ దురుద్యమదుష్టతంత్రదుర్బుద్ధుల శిలాఫలకమున చక్కఁగ లిఖించుచున్నవి. నాయొక్కనిమూఁగడచే, కులనాశకుఁడగు నాయొక్కనియునికిచే, రాజపుత్రస్థానమే విధ్వంసితమయ్యె. నాయట్టిహతభాగ్యునిదుర్వివేకముచే, ననేకవత్సరప్రాణధారణంబొనర్చి, తమతమ గృహిణీపుత్రపుత్రికలఁ గూడి స్వమందిరోపాంతమున, స్వమందిరోద్యానమున, ననేకసుఖపారావారకల్లోలమాలికల నానందసామ్రాజ్యమేలు గృహమేధులందరును, పుత్రపుత్రికావ్యామోగబాధాంతరితులై, నాకై, నాపేరునకై, నాజన్మమునకై శాపోదకంబులిడుచు, స్వకీయాంగనిర్గళ ప్రవహాచ్ఛోణిత ధారాప్రవాహముల మాతృభూమికర్పించి, సకలదుష్కీర్తిదుస్థితి మహాపాపపటలంబంతయు నాతలపైనిడిపీరస్వర్గమలంకరించె! ఇఁక నేనొక్కఁడక దా! క్షత్రియశబ్దమునకే పగతుఁడనై, దయాదాక్షిణ్యములకే పుట్టువైరినై, దేశాభిమాన దేశస్వాతంత్ర్యాదులకే ద్రోహినై, పంచమహాపాతకములకనేక పంచమహాపాతకములఁ జేర్చి, అనాథయాపతీహింసకుఁడనై, యందరిశాపోదకములకు, సందర్శనలాపములకు, దాపలమై, నాజీవితకాలమంతయు క్షణక్షణమునుదుఃఖపశ్చాత్తాపమరణములననుభవింపవలయు! అయ్యో! సోదరా! యిన్నిఖన్నములపడియు నన్నొకమాటరమైన నాడితివా! ఆత్మజన్మమున నస్మద్వంశమునపుట్టినవారికిని, పుట్టనున్నవారికిని, మణిభూషణప్రాయుఁడై స్వప్రతాపతేజో విలాసధూమాయిత శత్రునిచయుఁడై, సాంద్రకీర్తి చంద్రికాపరమాహ్లాదుఁడై, వెలుంగు నిన్ను, పరమదయాళుని, రక్తము నర్ధము పంచుకొని జనించిన యగ్రజుని, నన్ను పోషించిన నాజనకసమానుని, యిన్నివంతలఁగూర్చిన ద్రోహిని మనసార క్షమించిన శాంతశ్రీనిధిని, నాచేతులార, మనసార, యుద్ధమున ఖండింపసాహసించితినే! అంతటవిడచితినా? అగ్రజాంతఃపురవిద్రోహమొనర్చి, పరవాహినుల, పరమాతస్థుల, పరుల ప్రేరేపించితి! అంతటఁ బాలక, రాజపుత్రాంతఃపుర కామి

నిని, వీరనందినిని, రాణాబాయిని నిర్బంధించి శాత్రవులకామె ప్ర యాణవృత్తాంతమునుఁ దెలిపితిని. అంతట నైనమానివా! భ్రాతృనం దనుని, సుకుమారుని, పుట్టినదాది పోషించి పెంచినబాలుని, "పినతండ్రీ పాహీ" యనిపాదములఁబడి నాప్రోవవసివాడను, నాక్రూరకృత్యములఁ గాంచి నా ధీరతవిడచివీరకుమారుని. నాచేతులార, సంహరింపఁబూనితి. నాయన్నకుమారిని, లీలాకుమారిని, శాత్రవుల కప్పగించి నాకౌంగిలి కూడ భుజింప కఠినుఁడనై, కఠినకిరాతకుఁడనై, ముందంజ వేసితి! ఎన్ని పాపములుకలవో, యెన్నిద్రోహములు, దుష్కృత్యములు లోకమునఁ బుట్టఁ బుట్టనున్నవో, యవన్నియు నేనె యొనర్చితి. నాజన్మమే దుష్కర్మ చండాలకృత్యముల కాకరము. అయ్యో! నేను గర్భముననున్న తరిమా తల్లికి గర్భస్రావమైయున్న మేవాడుజనని యింకను భూమిపై స్వాతంత్ర్య విరాజితమై వెలఁగుచుండుఁగదా! అక్కటకటా! యెందరిజీవములకెసరుపోసితి! ఎందరిరక్తధారలుగ్రోల పెనుభూతము నైతి! ఎందరి బాలబాలికాకంఠనాళముల ఛేదింప ముందంజవేసితి? దేనికి దుఃఖింతు? దేనికివగవింతు? దేనికి పరితపింతు? పరమపాతకియగు నాపాదవిన్యాసమును సైపఁజాలక భూదేవియే తల్లడిల్లుచున్నది. అందు కాన్పించుశవచితిసందోహ మహాగ్నిజ్వాలలన్నియు నొక్కపెట్టున నన్నావేశించిదహించుచున్నవి- అయ్యో! వలదు! వలదు! నాకీరాజ్యమువలదు- నాకీసౌఖ్యమువలదు. నన్ను మాపవిత్రాపుని చెంతఁ జేర్చువారు లేరే! శిశోదియా వంశమును భూమినినిలుపువారు లేరే! నాసంతాపమార్చుపుణ్యాత్ములు లేరే! కఠోరకల్పాంతానల్పరౌద్ర ప్రాణిప్రాణహరణమృత్యుదేవతా స్వరూపమా! నా బాధకంత్యముకలుగఁజేయవా! యింకెన్ని దేశములధ్వంసమొనర్పనున్నాఁడనో? లయకాలవిలోల ప్రబలానిలవ్యాత్తాస్యమా! నీవాక్కుమ్మడి నాప్రాణవాయువుల హరింపవా! అయ్యో! సంక్షోభ ప్రళయకాలవిజృంభితయమజిహ్వాగ్నిమే యీఘోరపాతకినిఁ గాంచి వె

నుదిరుగుచున్నది. మృత్యుదేవతసైతము నేనట్టి ద్రోహమొనర్తునో యని కేలనంటి వెఱచుచున్నది! లేదు. యీమహాపుణ్యస్త్రనకు నిష్కృతి లేదు. ఈదేశభ్రాతృద్రోహికి మనశ్శాంతి లేదు- నేనొనర్చిన ప్రతిఘోరకార్యమును, హింసయు, నాకిరాతకకృత్యములకు సాహుతియైన ప్రతిశవరక్తబిందువును "వీఁడు కిరాతకచండాలుఁడు! పంచమహాపాతక" యని ఘంటాఘోషముగ నుద్ఘోషించుచుండ నాకెన్నటికైన మనశ్శాంతికలుగునే? చచ్చినను, బ్రదికినను, పరమహేయ కిరాతక, నరకసంజాత యాతనాభీకరసంజాతక రాశిశస్త్రధారా సంజనిత దుర్గంధకూప మేదోమాంసపంకిలావలేపన సముజ్జ్వలాగ్నిజ్వలన మహావేదన ననుభవించు నాయట్టి చండాలుఁడెవఁడు? అయ్యో! దుర్భరమే! యీమహావేదన దుర్భరమే! తాపమే-పాపమే-సంతాపమే- ఎందుఁజొత్తు? ఏవరిశరణొందుదు? ఏదిమ్రింగుదు? అయ్యో-యీపాపిష్ఠ దేహావయవంబులన్నియు, కుళ్ళిదుర్గంధముపట్టి నశించు సంతోషకాలమెన్నటికైన కలుగదా! భరింపఁజాల-నిలువఁజాల- పలుకఁజాల! దుర్భేద్యగాఢతమతామిస్రవిమోహజాలము, కన్నుల గ్రమ్ముచున్నది. ప్రియాడభ్రమత్ప్రపంచమా! నీవు నాకు శత్రువు డవు! పంతసమా! లేవు- నీవు నాపాలలేవు- దైవమా! యేకలింగేశా! ననురక్షింపవా! జననీ! మేవాడస్వాతంత్ర్యాభిమాన దేవతా! ననురక్షింపవా! నేకిరాతుకుఁడనేయగుదు. అయినను నీనందనుఁడఁగానా! నన్నాదరింపవా! ఆహా! పద్చితివా? తల్లీ! యేమి నీపుత్రప్రేమ! నిన్ను శాత్రవులకర్పించినకూళపై నక్కటికమూనితివా? జననీ! వలదు- నీక్రౌర్యంపు దృష్టులకన్న నీప్రేమవాత్సల్యముతే నీకు సంతాపదాయకములు. వలదు- వలదు. నన్నుగాంచి యశ్రులవదలకుము. ఇదే నీచరణములంటి ప్రమాణముఁ జేసెద. నిన్ను మరల నుద్ధరించి నీకు స్వాతంత్ర్యముఁ గలుగఁజేసి నీకుమారుని, ప్రతాపుని మరల చిత్తూరుఁజేర్చెద. జననీ! యేలహాసించె

దవు? ఈఘోరపాతకివచనములెన్నడైన విశ్వాసార్హములగునా? యనివా సించెదవా! జననీ! అయ్యో! యేలపోయెదవు? నిలుము- ఒక్కమా టాడుము. కట్టా! యీరాజననిపోయె! ఆహా! యెవరండువచ్చునది? విభిన్నమస్తకమై, మేనంతయు రక్తము స్రవించుచుండ, కృపాణహ స్తమై యెట్టి ఘోరాకారము వచ్చుచున్నది- ఓపిశాచమా! నీవెవ్వరు? యిందేలవచ్చితివి? ఈసాగర్జిని బెదరింపవచ్చితివా! అహా! యిపుడీయా కారమెంత తేజోవంతమై యున్నది. భవానీదాసు! భవానీదాసు! ద్రో హీ! మరలనేమిద్రోహ మొనర్ప చనుదెంచితివి? ఆ- ఆ- యేమంటివి? ద్రోహమునకు ప్రతిఫలమా! అయినవిదే చూడుము. (అనిసంహారిం పఁబోయి) హాహా! అంతయు వ్యర్థము! అదేమి? అనేకనిశితధారాక్రూ రకరవాలవిలాసవిద్యోతము లొక్కసారియేనను పొలియింపచనుదెంచు న్నవి. అనేకశతకోటిప్రేతసందోహములు కంటమంటలు గ్రమ్ముచు చేతకరవాలములూనివచ్చుచున్నవి. ఓప్రేతములారా! రాకుఁడు-రాకుఁ డు. మత్సన్నిధానమునకు రాకుఁడు- ఆహా- ప్రతాపా! సోదరా! రక్షిం పుము - రక్షింపుము - ఆహా! వచ్చితివా! యిఁకనిన్ను విడువను- అయ్యో! పోయితివా! చాల - భరింపఁజాల - చచ్చితి - చ - చ్చి- తి - (మూర్ఛిల్లును)

(ప్రవేశము ప్రమద)

ప్రమ—చేతికివచ్చినరసాలఫలం బట్టె గగనంబున కెగసిన చంద మయ్యె. ఇంతయొనర్చియు నిపుడపజయమా? కార్యమువట్ల నానాథు నిసందేహమేకజా యీ యనర్థమునకు మూలము. యుద్ధభూమిని సైతమా తనిబాయక సంతదూర మేతెంచి యేమొనర్చితి? మానససాక్షి ణీదేవతా! యిదియంతయు నీవిలాసము! నానాథునిఁజేరి నాకార్యతంత్ర ముల నిరోధించితివా! నీవెప్పుడును, ధైర్యహీనులను దుర్బలులనే యాశ్రయింతువు! కానిమ్ము! మదీయకార్యసాధనైకదీక్షకంటెనీశక్తి

కొఱకు వడగునేమో చూచెద. నాకును నీకును నిదేతుదిపరీక్ష. జరుగుచున్నది. (సాగర్జినిఁగాంచి) ఆహా! ఏలయితఁడు మూర్ఛిల్లియున్నవాఁడు! (చెంతకుఁబోయి) ఆహా! ఇదియేమి మూర్ఛయందును నితని ముఖమింత భీతిఁగొలుపుచున్నది. కానిమ్ము; వచ్చినయాపద వలదన్నఁ బోవునా! నాథా! నాథా!

సాగ—చిరంతనకాలవిరాజమానమే నాదుస్వాతంత్ర్యదేవతా! జన్మదేశమాతా! రక్షింపుము! రక్షింపుము! (నమస్కరించును.)

ప్రేమ—తీరినది - ఇతనికీరోగము ముదిరినది.

సాగ—జననీ! ఏలపలుకవు? నీపాదములాన వచించెద. నీస్వాతంత్ర్యమునకై నాప్రాణముల నేనిసర్పించెద. ఒక్కమాటాడుము. ఒక్కపరి నీదయావలోకనముల నాపైఁ బఱపుము. అపుడు నాకూరట కలుగును.

ప్రేమ—నాథా! నాథా! దేశమాత యేమి? స్వాతంత్ర్యమేమి? నేనెవ్వరగుటయు నెఱుంగరా! నేను మీప్రేయసిని- ప్రేమదను కానా!

సాగ—ప్రే - మ - ద - ప్రేమ - ద - నా - ప్రేయసి!

ప్రేమ—మనోరమణా! ఏల నన్నట్లు పరికించెదరు? మీకేమి యాపద వాటిల్లినది? వచింపుఁడు. నాకంటె మీకుఁగూర్చువారెవరు? (భుజమున కరమిడి)

సాగ—ఓరీ కాసీ! నీకింకను తృప్తి కలుగదా! నీరాక్షసకార్యములకింకను సంత్యము కలుగదా?

ప్రేమ—ఆహా! యిందేమోయనర్థమున్నది! ఇపుడు బుద్ధిబలమొక్కటియె కార్యసాధకము.

సాగ—పిశాచీ! మరల నీదేశమును విధ్వంసమొనర్పనాలోచించుచున్నదానవు?

ప్రియ—ఉదయపురమహారాణా! అదే యందు పరికించితిరే! మీ సేవకులు సామంతులును నందుమీ సేవకై వేచియున్నారు- వారి-

సాగ—ఉదయపురమహారాజ్ఞీ! యిటే! యిందు పరికింపుము; చూచితివా! ఆయగ్నిజ్వాలల! రాజపుత్రస్త్రీనీమణులు నీదుర్బోధనచే నేనొనర్చిన ఘోరకార్యములకు తమభర్తలవాహుతియొసంగి, సహగమన మొనర్చుటకై పేర్చిన యగ్నిజ్వాలల! అందు పరికించితివా! నివ్రజల! కాకఘూకములచే నర్ధభక్షితములగు శవముల! ఇప్పుడైన నీకు సంతసముకలిగెనా! వారియాత్మత్యాగమున నీకుతృప్తిఁగలిగెనా ?

ప్రియ—ఆత్మత్యాగమేఁట! లోకమున చేతఁగాని వెంటికందరికిని నీయాత్మత్యాగమే శరణ్యము! వీరశేఖరులు తమకార్యసాధనకై పరుల త్యాగము నాధారముగఁ గొందురు. ప్రతాపుని పక్షమువారందఱు మడయుటఁగాంచి సంతసించుటకు మూరు దుఃఖింతురా!

సాగ—సంతసమా! దేశమంతయు నిర్మానుష్యమై, నిర్దగ్ధమై నిర్నామమైపోవుట నీకు సంతసమా! రోదనధ్వానంబులే నీకు మంగళవాదిత్రములా!

ప్రియ—ఔను. శాత్రవరోదనధ్వనులే నాకు మంగళవాదిత్రములు- తన్మారణోత్సవమే నావినోదోత్సవము! ప్రతాపసింహస్వర్గగమనదినమే నాకు పండుగదినము,

సాగ—ప్రతాపస్వర్గగమనదినమా! రాక్షసీ! ప్రతాపుఁడేల! నిన్నే యాస్వర్గమునకుఁ బంపెద-

ప్రియ—ఆ- ఆ- ఇదియా- శౌర్యము ?

సాగ—చావుము- చావుము- (పొడుచును)

ప్రియ—మూర్ఖా! పిరికిపందా! ఘనకార్యమొనర్చితివా! సంతసింపుము- నీయందలి ప్రేమయే నన్నింతకుఁ దెచ్చె- ఆఁ- ఆఁ- రాజ్యము- ప్రతా- పుఁడు- ముందు (చచ్చును)

సాగ—(మేనంతయు రక్తమయమైయుండ) అంతయు ముగిసె! అంతయుతీరె! అంతయు సమంజసమయ్యె! - రక్తపాతమున ప్రారంభింపఁబడిన కార్యము రక్తముననే నంతమయ్యె. హాహాహా! ఉదయపుర మహారాజ్ఞీ! నీకుపరేతలోకరాజ్ఞిత్వము చేకూరెనా! హాహాహా అందెవ్వరికి ద్రోహ మొనర్తువు? ఆఁ-ఆఁ-అది యేది? అనంతానంతసంక్రాంతదుష్ఫలానుభూతిభావోదయ మేది? అసదృశదుఃఖపావపశ్చాత్తాప ద్రోహావివేదనవిహింసనవిదగ్ధవిపరీతపరిణామభావోదయమా- అయ్యది? అల్లదే! అందున్నది? నిఖిలావయవనిరస్తేంద్రియానిర్ముక్తాశామనోరథహృదయకరాంళిక - జీవప్రణాళిక-ఆదిప్రాణప్రయాణిక సమారంభము కాదా? నాశిక కాదా? అంతయు లేదా? ప్రబుద్ధసంబద్ధజీవద్వివేకవిదళాత్మవిపాకాంగ నిర్గమనప్రయాణమంతమేనా- యింతయేనా- నావింతయేనా? ఇఁక నావంతయెందుండఁగలదు? ఆ- ఆఁ- నిలుము-నిలు-ము-ప్రళీకరదర్వీకరదంష్ట్రాంకురవిషపూరమంతయు. చేరెనా? చేరకుము. చేరుము- కలితవికృతప్రకృతప్రక్షేపవిక్షేపమృత్యుముఖజిహ్వాక్షణమేయిది-యీక్షణమే-యీక్షణమే - రమ్ము - రమ్ము - హా! కంధరమాంగల్యకఠోరకల్పాంతకరవాలమా! నీవు ప్రారంభించిన కార్యము నీవే ముగింపుము- అంతయునీవే - ఆక్రమింపుము. సాగర్జీ - - దేశద్రోహి పోలసితివి. హా - హా - దేశజననీ - వచ్చితి - వ - చ్చి - తి (పడుచుకొనును) హా - ప్రి- తా- పా . సో-ద రా- రాణీ- (లోపధ్వని- సోదరా- యిదేవచ్చితి-అని-) ప్రవేశము—ప్రతాపగోపీనాథులు.

అప - రాధ - ము-క్ష - మాపణ - దా - హము - నీ - రు - (ప్రతాపుఁడు నీరొసంగును) మనసార - క్షమింపుము - అప్పుడు-సుఖముగ ప్రాణ-ముల-వి-డతు-

ప్రతా—సాగరా! మనసార క్షమించితి. ఒక్క-మాటాడుము, అయ్యో! ఎన్నిద్రోహము లొనర్చినను వాని ననుభవించుటకైన నీవు

జీవించియున్న నాకదియే సంతోషముగనుండుకదా! (సాగర్జీని తొడపైనుంచుకొనును)

సాగ—(కన్నులు తెఱచి) అమరసింహా - లీల - అప - రాధము - చె - ప్పు - ము - హా - శ్రీ - మ- (కండ్లుమూయును)

(యవనికపడును)

---

# మేవాడుశౌర్యాగ్ని నాటకము.

## పంచమాంకము.

### ద్వితీయరంగము.

కొమల్మేరు దుర్గపరిసరము. సైనికగుడారము.

(శ్రీవేశము శ్రీతావదుర్గాదాసులు.)

శ్రీతా—దుర్గా! అదిశేషాంగపరివేష్టనంబుపగిది, మేరుభిత్తికావలయంబుమాడ్కి-దురంతదుస్సాధ్యదేవతాస్ఫూర్తి,నగాధపరిఘావృతంబగు నీదుర్గమునుసాధించుట కష్టంగదుకష్టమని దోచుచున్నది.

సీ॥ పాతాళనిర్గత ♦ పాటవ రసపుత్రి
రాజితశౌర్య వై ♦ ర్యంబనంగ!
కళ్యాణకార్య దీ ♦ క్షాశ్రీయమునపొల్చు
దర్పాంతరాయ దు ♦ ర్దైవమనఁగ!
దుర్లంఘ్య, దుర్గమ్య ♦ దుర్భావ్య మేవాడు
దుష్కర్మఫణిఫణా ♦ స్తోమమనఁగ

దుఃఖార్త మాతృభూ ♦ దోర్దండముఖరోమాఁ
నారాయణప్రార్థ ♦ నంబనంగ
గీ. హారిరయి రసపుత్రసాహసం ♦ బరయఁగోరి
పైకినెత్తినవింధ్య ప ♦ ర్వతమనంగ
వంశనృపదర్పలక్షణ ♦ వలయమనఁగ
క్షోణి నెటులొప్పుచున్నదీ ♦ కోటభళిర!

దుర్గా—ప్రభూ! గోగుండదుర్గము సాధింపనరిగిన సేనయింత లోవిజయవార్తతోఁ రాఁగలదు. వచ్చునని దుర్గమును సాధింపఁజాలమా!

చ. జలదచయాంతరేమదభి ♦ నర్పితభానుమరీచిపోల్కి, నీ
విలయపరాజయంబునసె ♦ వెల్గుజయంబు! తొలంగునాపదల్!
చెలఁగును జన్మభూమి పరి ♦ చింతితపావనసుస్వాతంత్రితల్!
కలుఁగువిసంబునందమృత ♦ కంజముసిద్ధము చూడు భూవరా!

(ప్రవేశము - శీఘ్రయానమున సోమసింహుఁడు.)

సోమ—దేవా! జయము! జయము! కోట మనస్వాధీనమైనది. భిల్లసైన్యము లెందుండి రో నాకస్మికముగ చనుదెంచి కోటబురుజుల నధిరోహించి శాత్రవుల నురుమాడుచున్నవి.

దుర్గా—సేనానీ! ఆసైన్యముల నాయకుఁడెవఁడు?

సోమ—సేనాయకుఁ డొకబాలుఁడఁట! పరాక్రమలక్ష్మియే నాతని మేననావహించినభంగి, దుర్నిరీక్ష్యప్రభాభానుఁడై శాత్రవ సేనాటవిని నిర్దహించుచున్నాఁడఁట-

ప్రతా—ఏఁడీ యాబాలుఁడు? ఏఁడీ! ఆశూరాధిశూరచక్రవర్తి-?

ప్రవేశము శీఘ్రయానమున అమరసింహుఁడు.

ప్రతా—(ఆలింగన మొనర్చుకొని) కుమారా! మరల నిన్నిన్ని దినములకుఁ గాంచఁగల్గితి.

ఉ॥ కంటి ముదామృతాబ్ధి శశి! ♦ కంటి ప్రతాప దినేశ బాలునిన్!
కంటి శిశోదియాన్వయ సు ♦ కౌస్తుభముం న్! సుకృతారవిందమున్
కంటిని! మాతృభూహృదయ ♦ కల్పకరాజముకంటి! విరోధికాలునిన్
కంటి! యిదే మదక్షిఫల ♦ కంబిది యేనుదినంబు వాకిలా!

దుర్గా—సోమ! (మాకరించి) జయ్! అమరసింహాయువరా

ణాకుజయ్!

అమ—దుర్గాదాస్! శేనానురాలా! మీదేశభక్తి శౌర్యస్వార్థ త్యాగాదులే మేవాడుగౌరవాభిమానముల నింతవఱకు పాలించుచున్నవి. మీరాజభక్తి స్వార్థపరిత్యాగాదుల కానైవమే సంతసించి మాకు విజయము ప్రసాదించె. స్వామిభక్తిపరాయణులారా! లెండు! దేశమాత యొక్క స్వాతంత్ర్యపదవినలరారువఱకు యువరాణాయగుం గాక, సామాన్యసైనికుండగుంగాక; నందఱును పవిత్రమాతృదేశోద్ధారవ్రతదీక్షాబద్ధులనుట మాత్రము మఱువకుండు.

గీ. ధైర్యమానస పత్రిక ♦ తవరసల్పి,
దేశభక్తికుసుమపూజం ♦ జేసి, రక్త
సమభిషేక మొనర్చి, దే ♦ శజనసస్వా
తంత్ర్యపూజ్యసల్పినం గదా ♦ తనయులగుట!

ప్రతా—నిక్కము. దుర్గా! మీభావిమహారాణాయగు నీయమరసింహుండు మదీయ దేశోద్ధారణోద్యమమును నిర్వహించు ననుధైర్యమిపుడాకింత కలుగుచున్నది.

మ॥ అలగోగుండముఖాదిదుర్గములుమా ♦ యాధీనతన్ వెల్గె! దు
ష్ఖలచిత్తూరుదయాదులన్ కొనంగ మ ♦ జన్మంబువే నోచదే
ని, లవంబైన నధైర్యమూనకటువా ♦ నిక గెల్తుమేమంచు మీ
వలు కేమెక్కటికోరెదర! ఒనంగుండో ♦ భవ్యాత్ములారాదయార్.

మీకుఁ నాయందునిక్కంపు భక్తియేయున్న, నాయాత్మకు శాంతమును కలిగింప నెంచితిరేని నేఁ జెప్పబోవునట్లు ప్రమాణమొనర్పుఁడు, మారు మాటాడకుఁడు! "మీజీవితకాలమున మేవాడునకు సంపూర్ణస్వాతంత్ర్యములభింపదేని మీయనంతరమున సైతము నీయమరసింహునికినిల్లే సాయమొనరుము."

దుర్గా—సోమ—"మీజీవితకాలమున మేవాడునకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభింపదేని,మీయనంతరమున సైతమీయమరసింహాయువరాజునకిల్లే సాయమొనరుము."

ప్రతా—"ఈయమరసింహుఁడు విషయేచ్ఛచేనైన,మరేద్దానిచేనైన, మేవాడుస్వాతంత్ర్యోద్ధారప్రతమునందు విముఖుఁడగునేని,వతనికికృత్యముదోప్బోధింతుము"

దుర్గా,సోమ— (అట్లేయందురు)

ప్రతా—"అప్పటికినివితఁడు నమ్మతింపకున్న, నితనిమానిదైన తుదకు రాజ్యభ్రష్టునిగ నొనర్చియైన, మేవాడుస్వాతంత్ర్యోద్ధారకము ప్రతమును మానము? ఇందుకుతప్పితిమని, రసపుత్రరక్తకమునకు జనించినవారము కాము !"

దుర్గా—సోమ! (అట్లేయందురు)

ప్రతా—ఇఁక చాలును. సాయనియుద్ధములచే డస్సిన నీశరీర మెప్పుడు ననువీడినను నాకించుకంతయు వంతకలుగదు. అయిన

గీ. వీరనాకాధివాసినై ♦ వేడ్కదార
పుత్రకలఁజేరితైన,మీ ♦ పూజ్యధైర్య
దేశభక్త్యాదులనుగణు ♦ తింపనాదు
నాత్మ యిందె చెలంగునం ♦ చరయుఁడయ్య!

అమ—జనకా! నా సోదరీజనము లెందున్నారు?

ప్రతా—కుమారా! వారే పుణ్యాత్ములచేనైన రక్షింపఁబడిరో? లేక,

గీ. ద్వేష, మాత్సర్య, విద్రోహ ♦ తీవ్రమైన
హీనచండాలభూమిజ ♦ వింకనొల్ల
కిపుడు, క్షాత్రతేజఃప్రజ్వ ♦ రిల్లునెచట
వారలచ్చోటనిర్దీను ♦ లైరొకో తనయ!

(ప్రవేశము విక్రమలీలా - గోపీనాథులు)

గోపీ—లేదు! లేదు! నిర్దీనులు కాలేదు. క్షాత్రశౌర్యాగ్నిలో వారి సౌశీల్యస్వార్థపరిత్యాగములకు వెఱచి, కేలనంటక మాకర్షించుచున్నది.

ప్రతా—(లీలావిక్రమల నాలింగన మొనర్చుకొని) లీలా! మరల నీజనకునికి సంతసము చేకూర్పవచ్చితివా! ప్రియసీ! తనచేచేత ఖండింప సాహసించినభర్తను చేరితివా! మీరు నిక్కముగ ప్రాణములతోనున్నారా! లేక వీరస్వర్గమునుండి యీప్రతాపుని పరిహసింపవచ్చితిరా?

గోపీ—కుమారా! యిదియంతయు నారాణాబాయికృత్యము. నీవానాడు వీరినట్లు సంహరింప నెంచుతరి నాసాధ్వి నీకు సైనికసహాయమును, విజయవార్తయుఁ దెలుపవచ్చి యాకస్మికముగ నీఘోరరంగమునుగాంచి వీరిరువురిని రక్షింపఁగలిగె. భిల్లసైనికుల మీకుసాహాయ్యమొనర్పబోధించుచు భిల్లవాటికనున్నతరి, నారాణాసతియే వీరినినాకర్పించెను. సమయము వేఁచి వీరినిందుఁ బిలచుకొనివచ్చితిని.

ప్రతాప—గురువర్యా! నిరతవేదాధ్యయననిష్ఠల కాలము గడపు మీకు నానుండి యెట్టిపాటుఁగలిగె?

గోపీ—కుమారా! వేదశాస్త్రాధ్యయనము మాత్రమే బ్రాహ్మణకృత్యములని తలఁచితివా!

గీ. తగుజపతపంబులె ద్విజకృ ♦ త్యములు కావు!
"సర్వేసర్వేజనాస్సుఖి ♦ నోభవంతు"
యనెడివాక్యంబె ద్విజధర్మ ♦ మై వెలుంగు;
దేశక్షేమంబు చే ♦ కూర్చుదేశభక్తి!
బ్రాహ్మ్యధర్మమై వెల్గదే ♦ భరతభూమి!

విక్ర—నాథా! ఆతరుణీలలామ యుపకార మెంత ప్రశంసించి ననుతీరదు. మాకొనర్చినయుపకార మటుండ, హీరాఘాటుయుద్ధమున మీకు సంపూర్ణవిజయమును చేకూర్చెను.

దుర్గా—ఏమి! పురుషవేషమున మానసింహు నెదిర్చి మమ్ము రక్షించినదా సాధ్వియేనా? ఆహా! యిప్పుడు కదా మేవాడుమాత ధన్యయగుట!

సీ॥ కనకకంకణఝణ ♦ త్కారంబు నొకవంక,
యురు ధనుష్టంకృతి ♦ యొక్కవంక;
వలపు బిత్తరిజిగి ♦ వాల్చూపు లొకవంక
యుగ్రవీక్షణములు ♦ నొక్కవంక;
నవ్యపూర్ణాబ్జమౌ ♦ నగుమోము నొకవంక,
నుజ్వలారక్తానన ♦ మొక్కవంక;
హరిణఖాదన తృణాం ♦ కురకరం బొకవంక
నుద్రేక శరకరం ♦ బొక్కవంక;

గీ॥ మగలనలరించి, బోధించి, ♦ మానుషంబు
వెలయు భారతీయాంగనల్ ♦ వీరచరిత
లాత్మదేశంబు రక్షింప ♦ నలరుకతన,
భళిరె! మేవాడు స్వాతంత్ర్య ♦ భాసిగాదె!

లీల—యుద్ధమున మూర్ఛితులగు మీకును, దుర్గాదాసునకును

ప్రాణదానమొసంగినది సైతమామెయే. గోగుండదుర్గమును నేనును, నాసాధ్వియు సాధించి, యందు మనరాయమల్లునుంచి వచ్చితిమి.

పృథ్వీ — రాణా సతీవతంసమా! నిన్నేమనువాఁడ. నీయనర్ఘ ప్రాణోపకృతికై, తావకీనమహానిర్ధారపూజనీయామల దేశపాలనభద్రకార్యకరణమునకై యేమిప్రత్యుపకృతియొనర్పువాఁడ. నాజీవితకాలమంతయు ధారవోసి యొనర్పఁజాలని దేశోద్ధారణమహాకార్యమును, నీవొక్కతెవె, యసహాయవై యొనర్చితివి. భవాదృశ దేశసేవాపరాయణచిత్తలై వసముదంచిత నిశ్చలనిరుపమానధైర్యవిరాజితలైన వనితామతల్లులు, భరతదేశ మహోద్యానముల, మహోన్నతకార్యక్షేత్రముల, స్వార్థపరిత్యాగ సుగుణ ఫలపుష్పవిద్యోతమానలై, గ్రాలుచుండువఱకు మాతృదేశము సకలేతరదేశగణజాగ్రజ్జేగీయమానమై నిరంకుశనిష్కళంక స్వాతంత్ర్యమహాభ్యుదయముల రాజిల్లదే!

సీ. వైరిశౌర్యాబ్ధిప్ర ♦ వాహాతలీనయౌ
నాడుమాతను బ్రోచు ♦ నౌకవీవె!
శత్రుకరాగ్ని వి ♦ ష్ట కుమారి రక్షింప
లోలవర్షాంబుద ♦ మాలవీవె!
అరిపుండరీక నా ♦ రాంతరన్నృపవంశ
హారిణరక్షకప్రౌఢ ♦ తరుణి వీవె!
రసపుత్రగౌరవ ♦ రాజకీరి సముద్ధ
రించుజగన్మాత ♦ వీవకావె!
గీ. భారతీయాంగనాదేశ ♦ భక్తిశౌర్య
ములజగంబుల చాటిన ♦ పొలఁతివీవె!
నాడు రాజ్యంబు,తనుప్రాణ ♦ సవ్యవిభుత
లెల్లనీయవె; గైకొమ్ము; ♦ యిందువదన!

ఓమాతృదేశాభిమానసందిసీ; ఈరాజ్యమునీయది; యీప్రాభవము

నీయది. నాతనుప్రాణములు, నాకుటుంబప్రాణములు నీయవి-అంతయు నీకర్పించువాఁడ. నిన్నే మేవాడుసింహాసనాధిదేవతగ నర్చించువాఁడ.

(ప్రవేశము. రాణాబాయి. సన్యాసినీవేషమున)

విక్ర—సోదరీ! యిదియేమి! నీకేలనిట్టి వేషము?

రాణా—మహారాజ్ఞీ! జగద్రంగమున దైవసృష్టియంతయు పాత్రధారులే కారే!

గోపీ—మహారాణా! యిది మేవాడునకు సంతోషకాలము. కాని, మనలోనింకను నొకరికి సంతసము చేకూరవలసియున్నది. యిటుపరికింపుమీ రాణాసాధ్విని; ఈశూరవనితాలలామకా యిట్టి వేషము! కుమారా! మీవిషయమంతయు నేనెఱుంగుదు. నీవీకుమారిని నిరాకరించు కారణమును నెఱుంగుదు. నామాటపాటింపుము. నీకిందెట్టి వచనభంగదోషమును కలుగదు. మీయిరువురి వివాహమును నాయభీష్టము. ఇదినీ గురుశాసనముగ భావింపవలయు.

ప్రతా—(మందహాసమున) గురూజీ! నామాటయటుండనిండు. తొలుత నాసాధ్వి నేప్రశ్నింపుఁడు.

గోపీ—కుమారీ! నీ వేమందువు?

రాణా—గురుచంద్రమా! నేనేమందును! నాయిహలోకసౌఖ్యములన్నియు నుత్యజించితి. నాతనుప్రాణముల దేశసేవకై వినియోగించుతరి శేషించిన నాజీవితమును దైవమునకు వినియోగింప నిర్ధరించితి-నేనుధరించిన సన్యాసినీవసనములే ప్రకృతము నా కానంద దాయకములు. ఇఁక నాకు, నాయభిలాషకు, నామోహమునకు తావులభింపదు లేదు, లేదన్న నీజన్మమున లేదని నాయాశయము. మనోరమణా! నాయభిలాషలకు నునికివైతివి! నామనోరథములకు నేను గడ్వైతివి-! నీవునను దూరీకరించినను, నేను నీయందు తన్మయినై యున్న దాన-నీవు

నాపత్నియయా నురాగాంకురమును నశింపఁజేసినను, నీవే నాయనురాగము యొడనైయున్నాఁడవు, నీయనురూపప్రేయసీజనంబులఁగూడివిహరించు నపుడు నన్నించుకస్మరించిన చాలును-నీయానందజ్యోతినై ప్రకాశించెద! నీసుఖమునకు సుఖస్వరూపిణినై వెలుఁగొందెద-ఇంతకన్న నాకు వేరుకోరిక లేదు-వేరయభిలాష లేదు. దేవా! నాపవిత్రమలమనోనిధానానురాగప్రేమలనీకర్పించితి-ఇఁక నీతుచ్ఛశరీరసౌఖ్యములు మాత్రము లేకున్న నేమి? మనయిరువురిమనోబంధమునకేమైన భంగముకలుఁగునే!

ప్రతా—భళీ! రాణావతీ! నీవే ధన్యవు! గురుచంద్రమా! మేవాడుమాతపై సదయాంతరంగతజయముఁగూర్చి నయాదేవదేవునినారాధించుమంగళమొనర్చెఁదు—

మంగళము.



# అనుబంధములు

1 శ్రీసమేత దేశమాత-చిరభావితమానిజాత। శ్రీస।
వాసవవిభవ వ్రిభూత-భారతభాగ్యవిధాత। శ్రీ॥
హంసాద్వ్యము విహితజలధి-అమితశూర సంభావితే।
హంసాధ్వనిశుభగనినద-అఖిల నిగమకళలాలితే। శ్రీస।

2 అమరసింహుడు—హిం। భైరవి రాగము-ఆది తాళము.
భారతావనిజననీ-వాణీ-వినుతమణిగణశ్రోణీ। ఓ। భార।
సదా-సస్యచయరుచిరా-నందినీదేవీమునాబోగోజ్వ
లాంబరమాత-జనదాతా-నిగమభావితమాత-
పాలింపన్-కను మ భూసురపూత-ఓ॥ భా॥

3 బోయిలు—ఇంగ్లీషునోటు రాగము-రూపక తాళము.
కనుడాహాహా-వినుడాహాహా-దారినుండువైరులనుకనుడాహాహా
మాయస్త్రంబుల్-విలసిల్లంగా-మిట్టపల్లములగాంచినుడాహా

4 రాణాబాయి—సింహేంద్రమధ్యమరాగము-ఏక తాళము.
హా కరుణాసింధో-ననువరమకరుణమునుడవె-దీనబంధో॥ హాక।
దీననాథు-దేడుదాన-దేవదేవా-కావవె-
పరమపురుషా-నిరతతోషా-సరసభూషా-శివవాసా॥ హాక।

5 రాణాబాయి— రాగము తాళము.
సంతసమయ్యెనుగా-నాకునోహరునేగాంచగ-మదిలోనసకదు।
చెలువునొప్పునుందరు-నానాథుని-అలుతమి మీరగకనుగొను
కతనను॥ సంతస॥
అవనంబు-శశిబింబము మీరెదు-అంబుజంబుగేరు
కనులచందము-మారునలరు-విరుల-శ్రీకళల
వే-బోలును-చాలును-బాళినిగూరుచు॥ సంత॥

6 అందరు—— మోహనరాగము-రూపకతాళము.

బాహుబలక్షత్రాంచిత-భరతరామకరలాలిత॥ ఊహా॥

ఊహారహిత మునివినుతా-మోహనగజరిపువాహన॥ శ్రీన॥

7 రాణాబాయి—— రాగము-తాళము.

కలవెనీదా-శక్తిజావ-రమణిం జేరి-మోహమా॥ కల॥

మరుమరీచిన్-నీరుగోరి-తిరుగ నేలకోవిరిడి-

కలిగెనేమోకంటకంబు-వెకలివాను వె-మోహామా॥ కల॥

8 ప్రతాపుడు—— రాగము-తాళము.

వేదవిలాస-గృహాంచితమాత-శంకరి-శుభగణజాతా॥

దేవినామనోభావసంభావ-నంబును దారత-దెల్పుము నేత॥

భరతధరణిదుస్తరవిపదాళి-పొగలగ నెటువగ

నడంతుమాత-శాత్రవజైత్రి-సంసృతిగాత్రి-రిపుదా

శుభదా-రణచణపరపదపాహి పరమచారిత్రి॥ వేద॥

9 విక్రమబాయి—— రాగము-తాళము.

గారీమనోహరా-బ్రోవవె విజయము-గూర్పవె నీకృపచే॥ గారీ॥

నానాథున్ గని-దృఢతరయానసె-జనరక్షణమును-రిపు

విదళనమును-కరుణాత్మక యో-దేశపాలనా శుభదామము నీ

పరిపాలనయే-ఆపదకలుగ జేయుకిటుమది-స్ఫురియించవ

వె-వర-వరదా-మనుపుము-మమ్మికక॥ గారీ॥

10 లీలా——అమర ఇంగ్లీషునోటు-ఏకతాళము,

మించెదన్-నలంచెదన్-రిపులతిని దెగూల్తున్। ఏంచుచు-నరి

మించుచు-నదలించుచు॥ ధర॥ మాతరో।నానతియొసగ వె-

రణమునకిపుడున్ దురమునందునరులపొందునణతు నిందు॥ మి॥

12 అమరసింహుడు——రెండవపాటయే.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 5 | పరీక్షీణ | పరిక్షీణ |
| 3 | 7 | నర్హ్యుడు | యుర్హ్యుడు |
| " | 10 | సమున్నత | యమున్నత |
| " | 22 | పూర్ణితమై | పూర్ణితయై |
| 6 | 2 | ప్రియమై | ప్రియయై |
| " | 3 | వాటమై | వాటయై |
| " | " | నిర్భయమైన | నిర్భయయైన |
| " | 5 | వర్గవీర | వీరలోక |
| " | 7 | ద్విభుని | రేంద్రి |
| " | 9 | రాడ్విభు | రాణా |
| " | 11 | వీరరమా | లోకేంద్ర రా |
| 7 | 7 | స్వాతత్ర్య | స్వాతంత్ర్య |
| " | 10 | సమున | నమును |
| 10 | 2 | పదవి | పదవీ |
| 11 | 18 | నదియూ | యదియూ |
| 14 | 4 | ప్రిమద | లేదు |
| 15 | 2 | నన్నను భూత | నన్ననను భూత |
| 20 | 5 | సుస్నాతుండనై | నిత్యస్నాతుడై |
| " | 18 | సమున | సమును |
| 21 | 25 | క్షోణీశుండు | క్షోణీశుండు |
| 32 | 8 | క్షత్రియ శూరాం గ్రామణులకు | లేదు |
| 36 | 15 | నాకింత | నోకింత |
| 39 | 7 | స్వకీయ పరిపాలన మునకే | లేదు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| » | » | డించిగా | డించిగాౖలుచున్ననునదే |
| » | 10 | నెదగ్రా | నెదగొల్పి |
| » | 11 | లుచున్ననునదేల్చు | లేదు |
| » | 17 | తమ | తను. |
| 41 | 4 | పీఢివ్ | పీఢిన్ |
| » | 6 | ద్ధామ | ద్దామ |
| » | 20 | రసణి | సరణి |
| 43 | 16 | దేహావు | దేహా |
| 44 | 16 | వైభవము | వైభవమున |
| 45 | 8 | అర్ధాంవి | అర్ధాంగివి |
| 47 | 8 | రంధ్రిమూకెందు | రంధ్రి కెందు |
| » | 21 | విక్రీత | విక్రేత |
| 54 | 5 | వృత్తాన్తె | వృత్తా |
| 59 | 19 | హృతమయ్యో | హృతయయ్యో |
| 60 | 6 | సిద్ధుని | సిద్ధుల |
| 61 | 25 | విత్రాది | విత్రాధి |
| 62 | 5 | నిర | నిజ |
| » | 6 | నొసంగి | నొసంగుటచే |
| 63 | 6 | కుక్కల | కుక్కలపై |
| 65 | 5 | కుంభతా | కుంభసా |
| 66 | 8 | యును | యున |
| » | 9 | మీాతల్లి | మతల్లి |
| 67 | 18 | ప్రిత్యతము | ప్రిత్యతమున |
| 68 | 5 | ముంచా | ముంచు, |
| 77 | 18 | [illegible] | [illegible] |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 79 | 11 | కుల | కుతి |
| 8[illegible] | 2 | రూపు | రూప |
| " | 12 | మూన | యూన |
| 90 | 5 | ఎటికో | ఎటకో |
| 91 | 15 | మన | మనము |
| 93 | 3 | శార్య | శౌర్య |
| " | " | లంపుకామ్య | లసత్కామ్య |
| " | 13 | విస్ఫురించి | యింపుమించి |
| 105 | 2 | నుకుణ | నకుణ |
| 106 | 5 | బాంధన | బాధన |
| " | 12 | రాజ్ఞీవత | రాజ్ఞీత |
| 107 | 7 | లక్ష్మియూ | లక్ష్మియా |
| " | 15 | నందనుల | నందనులను |
| 111 | 4 | వ్రితాబ | వ్రితాపు |
| " | " | మూపెదన్ | మూపెదున్ |
| 112 | 6 | దేశమతల్లుల | దేశతరుణీమతల్లుల |
| " | 8 | నీవృత్య | నృత్య |
| " | 12 | మనల్మ | మనల |
| " | 17 | నంతిపుర | నంతఃపుర |
| 118 | 1 | మమ్ము | మమ్మ |
| " | " | యూధముల్ | యూధమున్ |
| 128 | 23 | దేశయుభి | దేశముభి |
| 129 | 12 | జనమున | జననమున |
| " | 22 | సహాభ్రి | సహాభ్రి |
| 180 | 16 | అందుకుశై | అందుశై |
| 184 | 5 | వేళయైన | వేళనైన |
| 135 | 18 | పొదవ | పొదువ |